# సాంఖ్యమ్

చదవండి!

# భగవంతుణ్ణి దర్శించండి!



రచన: **రాంషా**

వెల: **రూ.5/-**

# హేతువాదం



రచన : గౌతమ మహర్షి

వ్యాఖ్యాత : వాత్స్యాయనమహర్షి

అనుసరణ : రాంషా



ధర్మచక్ర పవర్ ప్రెస్,
సామర్లకోట-533 440

అంకితం

బహుభాషా కోవిదుడు,

సౌజన్యమూర్తి

మాన్యశ్రీ పి. వి. నరసింహారావు గారికి

గౌరవ పురస్కారంగా

రాంషా

# హేతువాదం

రచన : గౌతమ మహర్షి

వ్యాఖ్యాత : వాత్స్యాయనమహర్షి

అనుసరణ : రాంషా

ధర్మచక్ర పవర్ ప్రెస్,

సామర్లకోట-533 440

# అంకితం

బహుభాషాకోవిదుడు,

సౌజన్యమూర్తి

మాన్యశ్రీ పి. వి. నరసింహారావు గారికి

గౌరవ పురస్కారంగా

రాంషా

# పెద్దలన్నారు

## 1. లోకాయుక్త గౌ॥ ఆవుల సాంబశివరావు

మాజీ ప్రధాన న్యాయమూర్తి

మాజీ వైస్ ఛాన్సలర్, ఆంధ్రాయూనివర్శిటీ

మీరు పంపిన "హేతువాదం" పుస్తకం సమయానికే అందింది. సమాధానము ఆలస్యంకావడానికి కారణం మీరు నా అభిప్రాయాన్ని అడి గారు మీ యెడల గౌరవం ఉన్నవాడను, న్యాయమూర్తిని. పుస్తకాన్ని చదవకుండా అభిప్రాయాన్ని రాయలేను. ఇప్పటికి చదవడం పూర్తి అయింది. నా అభిప్రాయం క్లుప్తంగా రాస్తున్నాను.

మీ పుస్తకం రాసినపైనం మెచ్చుకోదగ్గది. "హేతువాదం" అంటే నిర్దిష్టమైన అభిప్రాయాలు చదువుకొన్న వారికికూడా లేవు. అదిన్నీ కాక హేతువాదం చాలా పురాతనమైనదనీ, ప్రామాణికమైనదనీ, చాలామందికి తెలియదు. తర్కశాస్త్రం గురుముఖంగా చదువుకొన్నవారికికూడా హేతు వాదం అంటే ఒకరోత, ఒక భయం ఉన్నాయి.

అందుకు కారణాలు నేను ఊహించినవి: మనజాతి జీవితంలో కొన్ని దృఢమైన అభిప్రాయాలు మూలకందాలైనాయి. గాట కట్టిన పశువు లాగ ఆ బాట నుండి బయట పడటానికి మనలో చాలామంది వెరుస్తుం టారు. హేతువాదం అనగానే ప్రతిదీ నిశితంగా పరిశీలించడం, పరిశో ధించడం. గాట కట్టిన గొడ్లకు, గానుగ ఎడ్లకు, తమదారి తప్పి వరొక దారిని, కాంతిని వెతుక్కునే సాహసంగానీ, కోరికగానీ ఉండవు. అందు చేత దర్శన శాస్త్రానికి మూలాధారమైన హేతువాదం, తర్కశాస్త్రం ఏవగించుకొనే విషయాలైనాయి.

రెండవది, హేతువాదం అనగానే తప్పనిసరిగా నాస్తికత్వం యెడల పయనించే రీతి అనే భీతి ఎందుకు? నాస్తికత్వం ఎందుకు అంగీక

రించకూడదు? అనే మీమాంస మనలో చాలామందికి ఉండదు. నాస్తికత్వం అంటే అర్థం పర్థంలేని భయం.

అందుకని నేను అనుకుంటూ ఉంటాను: మన దర్శన శాస్త్రాలను మన జాతి సరిగా వినియోగించుకోలేదని. బౌద్ధ, జైన, నాస్తిక దర్శనాల మాట అలాఉంచండి. ఆస్తిక దర్శనాలలోనే న్యాయ, వైశేషిక, సాంఖ్య దర్శనాలు ఎంతవరకూ మనకు సక్రమంగా అవగాహన అయినాయి? భగవద్గీతలోని సాంఖ్యం మంచిప్రచారంలో ఉన్నది కాని కపిలుని సాంఖ్యం అంత ప్రచారంలో లేదు. ఈ పైమూడు దర్శనాలు మణిపూసల్లాంటివి. మనిషిలోని హేతుత్వాన్ని రేకెత్తించి, ప్రజ్వలింపజేసే వెలుగుదీపికలు ఆ మూడూను.

అటువంటి న్యాయదర్శనాన్ని అనుసరణచేసి తెలుగువారికి అందించారు ఆ అనుసరణలో మీకు చాలా ఇష్టమైన వాత్స్యాయన మహర్షి వ్యాఖ్యానాన్ని మనసులో ఉంచుకున్నారు విషయాన్నిచాలా తేటతెల్లంగా చెప్పారు విషయం జటిలమైనదైనా విశదీకరణ సులువుగా ఉన్నది. అందుకు అనువైన భాషమీది. సాంకేతిక విషయాలను సులువుగా ప్రజానీకానికందించే భాషా రీతి మీది, అవసరమైనచోట ఇంగ్లీషు పర్యాయ పదాలుకూడా సూచించారు. అవి చాలా ఉపయోగకరంగా ఉన్నాయి, మీ పరిశీలన కూలంకషంగా ఉన్నది ఉపపత్తులు, దృష్టాంతాలతో మొదలుబెట్టి, సంశయం, ప్రత్యక్షాదిప్రమాణాలనుండి పరమాణువు, సర్వశూన్యవాదం, విజ్ఞానవాదం వరకు నడచి, నిగ్రహ స్థానాలు వాటి వివరణలతో మీ పరిశీలన పూర్తి చేశారు.

శాస్త్రీయ గ్రంథాలు చదవడం కష్టమే. కాని మీరు దాన్ని వీలైనంత సులభసాధ్యంచేశారు. సమగ్రమైన న్యాయ దర్శన ఆవిష్కరణ మీ వల్ల జరిగింది. అందుకు మిమ్మల్ని హృదయపూర్వకంగా అభినందిస్తూ ఉంటాను.

హైదరాబాద్
28-4-84

ఆవుల సాంబశివరావు

# 2

## ఘండికోట బ్రహ్మాజీరావు

యం. ఎ. ఇంగ్లీషు, యం. ఎ. తెలుగు: యం. ఎ. సంస్కృతం.

కొన్నివేల సంవత్సరాల క్రితమే భారతదేశంలో హేతువాదం పుట్టింది. దానికి న్యాయశాస్త్రమని పేరు. దానికి మూలపురుషుడు గౌతమ మహర్షి. ఆయన రచనకు వాత్స్యాయనమహర్షి చేసిన వ్యాఖ్యానాన్ని సరించి అతితేలిక భాషలో ఈ గ్రంధాన్ని రాంషాగారు అందించారు.

ఈ హేతువాదం ప్రామాణికమైన గ్రంథం, ఒక్కసారి చదివి ముగించవలసిందికాదు. రాంషాగారు తెనుగులో వ్యాఖ్యానించిన విధం పర మోత్కృష్టమయినది. వారీగ్రంధాన్ని ఎంత సాకల్యంగా అధ్యయనం చేసి నారో! అమృతంవంటి సాధుభాషలో వ్రాశారు. ఎన్నో గ్రంధాలు వ్రాయటంకన్నా ఇటువంటి మహద్గ్రంధాన్ని తెనిగించటం చాలా కష్టం.

వాద ప్రతివాదాలలో ఉన్న అందం చాలాగొప్పది వాది వాక్యాలు ఎంతన్యాయంగా కనిపిస్తాయో ప్రతివాది ఖండన కూడా అంత న్యాయం గానూ కనిపిస్తుంది.

గ్రంథమంతా ఒకేవిధంగా చమత్కారవంతంగా, మధురంగా, మనోహరంగా వుంది. ఎన్నిసార్లు చదివినా ఇంకా చదవాలనిపిస్తోంది.

పారిభాషిక పదకోశం కూడా చేర్చితే బాగుండును.

కుప్తీ
1-4-84.

ఇట్లు
ఘండికోట బ్రహ్మాజీరావు.



"ఈ రచయిత విజ్ఞుడు. నిరీశ్వరవాదులు సైతం చదవవలసిన మంచి పుస్తకాలలో ఇదొకటి"

—భారతి నవంబరు 1984

"తర్కశాస్త్రాన్ని గురించి తెలుసుకోగోరిన వారికి ఈ పుస్తకం చక్కగా తోడ్పడుతుంది... తర్కశాస్త్రంద్వారా సత్యాన్ని అన్వేషించే ఈశాస్త్రాన్ని హేతువాదం అని పిలవడం సమంజసమే హేతువాదమంటే నాస్తికత్వమనే భ్రమను కలిగించకుండా శ్రీరాంషా ఈశాస్త్రాన్ని ఎంతో నేర్పుతో రచించారు. శాస్త్రవిషయం ఎంతో క్లిష్టమైనదైనా ఏ మాత్రం కష్టం తోచకుండా సుబోధకమైన తెలుగులో, కొన్నిచోట్ల సంశయాలకు తావులేకుండా పారిభాషిక పదాలను బ్రాకెట్లలో ఇంగ్లీషులో కూడా యిచ్చి, మిక్కిలి ఆసక్తికరంగా రచించారు. జిజ్ఞాసువులు తప్పక కొని చదవవలసిన పుస్తకమిది.''

రామమోహనరావు

—ఆంధ్రజ్యోతి దినపత్రిక ఫిబ్రవరి, 1985



"....శ్రీ రాంషా నడక "హేతువాదులు" గా మాట్లాడుతూ ఆస్తికతతో కుస్తీపట్లు పట్టే ధృఢకాయులకు కనువిప్పుగా ఉంది.....

తర్కశాస్త్రానికి ప్రయోజనం ఏమిటి—? యదార్థ తత్వజ్ఞానం కలిగించి మనిషిని రాగద్వేషాల నుంచీ దుఃఖం నుంచీ అజ్ఞానంనుంచీ బయట పెట్టడం తర్కప్రయోజనం. ఈ తాత్విక జ్ఞానం ప్రమాణ సమన్వితమై ఉంటుంది. అ ప్రమాణాలు ఏవి? ప్రత్యక్ష పరోక్షజ్ఞానం ఎలా కలుగుతుంది? శబ్దం అంటే ఏమిటి? దాని ప్రయోజనం ఏమిటి? అది ఎన్ని విధాలు? ఈశ్వర ప్రణిధానం ఎలాటిది? మాననీయత ఎలాటిది? వీటికి అక్కడక్కడ మూలసూత్రాలుకూడా యిచ్చి నిర్వచించి అర్థ నిరూపణతో విషయ బోధ చెయ్యడంలో శ్రీ రాంషా విద్వత్తు స్తవనీయమై ఉంది. రాగం, ద్వేషం. మోహం- యీ మూడూ మానవ జీవయాత్రలో మూడు మృదుల కంటకాలు. వాటిని చక్కగా వివరించారు.

విద్య-అవిద్య-ప్రమాత్మకం విద్య – భ్రమాత్మకం అవిద్య నిండైన నిర్వచనం.

ముఖ్యంగా యీ గ్రంథంలో చదవవలసినవి ఎనిమిది, తొమ్మిది పది — ఆహ్నికాలు.

ఈశ్వరవాదాన్ని ఆనాటివారు కాదనలేదు. నేడు కాలబలం వల్ల వింతవింత ధోరణులు సమాజాన్ని సంకుచితం చేస్తున్నాయి. ఆ ధోరణులకు ఈ "హేతువాదం" ఆ ధోరణం అని నా అభిప్రాయం. సర్వులకూ సుగ్రాహ్యంగా తెలుగు చేసిన శ్రీ రాంషాను అభినందిస్తున్నాను. అటూ — ఇటూ ఉన్నవారందరూ ని దా న ం గా చదివి విషయ విమర్శతో ఆత్మ విమర్శ చేసుకుని తత్వం గ్రహించదగిన గ్రంథం.

యామిజాల పద్మనాభస్వామి

—ఆంధ్రపత్రిక ఫిబ్రవరి 1985



Iread your book **HETUVADAM** with great apprecia-tion-Icommend it as atext book to **P** G students of philosphy

Prop : K S R Rao, **M A**
Reader-in-Philosphy
**MYSORE**



# పరిచయం

న్యాయం, న్యాయ్యం అని రెండు మాటలున్నాయి. వ్యాజ్యాలలో న్యాయమూర్తి ఉభయ పక్షాలలో ఏ ఒక్కరియందూ పక్షపాతము లేకుండా విచారించి చేసిన నిర్ణయాన్నే న్యాయ్యమంటాము.

"ప్రమాణై అర్థ పరీక్షణం న్యాయం"—కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అను అయిదు ఇంద్రియాలచే గ్రహింపదగిన రూప, గంధ, శబ్ద, రస స్పర్శలే ఇంద్రియార్థాలని చెప్పబడుచున్నవి సమస్త వస్తువులూ అర్థాలే [Objects]. అట్టి అర్థాలను ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్దములనే ప్రమాణాలతో పరీక్షించుటయే న్యాయమని చెప్పబడుతున్నది. పరీక్షణమంటే నిరూపణ చేయటం.

ఇంగ్లీషులో Induction అని Deduction అనీ రెండు మాటలున్నాయి. Induction is the result of reasoning from a part to a whole, or reaching a general conclusion from particular cases. ఆకుల్ని చూసి చెట్టును నిర్ణయిస్తాం. అంగాలనుచూసి అంగిని నిర్ణయిస్తాం. కొన్ని కొన్ని సందర్భాలను విచారించి సాధారణ నిర్ణయాలకు వస్తాం. అదంతా ఇండక్షనే. పొగనుచూసి నిప్పు అనుకోవటం ఇలాంటిది. నిప్పులేకుండా పొగలేదు గదా! పొగ నిప్పుకు అవయవమే. నిప్పు అవయవి. కనుక ఇండక్షన్‌ని "ఉపనయం" అని చెప్పవచ్చు.

Deduction works from a general principle through a special case to a conclusion- If the general principle is true- if the instance actually does fall under the principle, the conclusion arrived at is true సాధారణ సూత్రాలనుబట్టి మనంచేసే నిర్ణయమే "నిగమనం" ఆ సూత్రాలు నిజమయినా, మనం చెప్పిన సందర్భం పూర్తిగా ఆ సూత్రానికి లోనయి ఉన్నా మన నిగమనం (డిడక్షన్) సత్యమవుతుంది.

ఆకాశం మేఘావృతమై ఉంటుంది. అవి కారునల్లని మేఘాలు కారునల్లని మేఘాలు దట్టంగా పట్టినప్పుడు తప్పకుండా వర్షం వస్తుందని ఊహిస్తాం. అది వర్ష మేఘమే వర్షం కురుస్తుందని మనం అనుకుంటున్న సమయంలో వర్షంకురవనూవచ్చు కురవకపోనూవచ్చు.అపనిగమనం [డిడక్షన్]ఉపనయానికి [ఇన్‌డక్షన్]సందిగ్ధస్థితిలేదు. నిగమనానికిఉంది. ఇదే ఆ రెండింటికీ తేడా—లోక వ్యవహారం ఆ రెండింటిపైనా జరుగుతుంది.

ఐడియలిజం, మెటీరియలిజం—అను రెండు సిద్ధాంతాలు లోకంలో వ్యాపించి ఉన్నాయి. జగత్తుకు సంబంధించిన సమస్త కార్యాలు, ఆలోచనలు పదార్థగతమైనవే అను వాదం పదార్థవాదమని [మెటీరియలిజం] చెప్పబడుతున్నది. వస్తుగతమయిన సౌందర్యం భావనలోనే ఉన్నదను వాదం భావనావాదం [ఐడియలిజం].

గౌతమమహర్షి న్యాయంలో ప్రతిజ్ఞ [Statement]కు హేతువు [Reason ], ఉదాహరణ[Example], ఉపనయం[induction]నిగమనం [Deduction ] ఉండాలి. అప్పుడు అది తర్క [Logic-the Science of correct reasoning] మవుతుంది అట్టి తర్కాన్ని వినియోగించి విశ్లేషాలను వెల్లడించటం అన్వీక్షికి Dialectics : synthatic reasoning అవుతుంది.

ప్రత్యక్షాగమాశ్రితమ్ అనుమానమ్ సా అన్వీక్షా— అని నిర్వచనం, జ్ఞానేంద్రియాల ద్వారా మనం సాధించిన జ్ఞానానికి ప్రత్యక్ష జ్ఞానమని పేరు. దానిని శాస్త్రబద్ధం చేయాలి. అప్పుడే అది ఆగమాశ్రితమవుతుంది. ఆగమాశ్రితమయిన జ్ఞానం వస్తువుకాదు. వస్తువుకు సంబంధించిన విషయం. కనుక అది అనుమానమే.[Derivation] విషయ పరిజ్ఞానంతో వివేచనం చేయటమే అన్వీక్షికి

అందుకే ''ప్రత్యక్షాగమాభ్యాం ఈక్షితస్య అన్వీక్షణం. అన్వీక్షా తయా ప్రవర్తతే ఇతి అన్వీక్షికి న్యాయవిద్యా" అన్నాడు గౌతముడు.

ప్రత్యక్షజ్ఞానాన్ని శాస్త్రదృష్టితో అన్వేక్షించటమే అన్వీక్షికయా ప్రవర్తన [Dialectica approach] మవుతుంది అది అన్వేక్షికి [Dialectics] అను పేరనున్న న్యాయవిద్యయే [Logic-the science of correct reasoning] అని ఆయన అభిప్రాయం.

గౌతమమహర్షి పురాణ పురుషుడు. ఈయన భార్య అహల్య. కుమారుడు శతానందుడు. జనక చక్రవర్తికీయన పురోహితుడు. రహూగణ మహర్షియొక్క కుమారుడు.

ఈ మహర్షి ఎక్కడకు వెడుతున్నా, వంచిన తల ఎత్తకుండా, ఏదో ఆలోచించుకొంటూ తన పాదాల మీదనే చూపులు నిగిడ్చి నడిచేవాడు. కనుకనే ఆయనను అక్షపాదుడని [Having his eyes fixed in abstraction on his feet] సమకాలీనులు వెక్కిరించేవారు.

ఈయన ప్రతిపాదించిన డయలెక్టిక్స్‌నుంచే పదార్థవాదులు డయలెక్టికల్ మెటీరియలిజమ్ను ప్రతిపాదించారు. గతి తార్కిక చారిత్రిక భౌతిక వాదమని దానిపేరు. భా వ నా వా దు లు ఆధ్యాత్మిక వాదాన్ని Metaphysics-a branch of philosphy dealing with the nature, character and causes of being and knowing the existence of God [Spiritual philosphy] సృష్టించారు.

ఈ గ్రంథానికి న్యాయదర్శనమ్ అని పేరు దృశ్యతే అనేన ఇతి దర్శనమ్ అని వ్యుత్పత్తి. సమగ్ర దృశ్యమును చూపించేదని అర్థం. ఈ మహర్షి ధర్మశాస్త్రాన్నికూడా వ్రాశాడు. దానికి గౌతమ ధర్మసూత్రాలని పేరు.

అదిలోక ప్రసిద్ధమయినది.దానిని అనువదించే భాగ్యం నాకు లభించింది. ఆయన వ్రాసిన న్యాయదర్శనానికి వాత్స్యాయనమహర్షి వ్యాఖ్యానం చేశాడు. ఈ వాత్స్యాయనుడు కామసూత్రాల రచయిత.వాత్స్యాయన కామసూత్రాలకు నేను వ్యాఖ్యానంవ్రాశాను.ధర్మశాస్త్రకర్త అయిన గౌతముడు

వ్రాసిన న్యాయదర్శనానికి కామశాస్త్రకర్త అయిన వాత్స్యాయనుడువ్రాసిన వ్యాఖ్యానాన్ని అనుసరించి ఉభయాచార్యుల స్వతంత్ర గ్రంధాలను అనువదించిన నేను- ఈగ్రంధాన్ని మీకు అందివ్వటం నా పూర్వజన్మ తపఃఫలమనుకొంటున్నాను.

పా మ ర్ల కో ట

తేదీ : జూలై 1993

రాంషా

# ఒకటవ ఆహ్నికం

ప్రశ్న : తర్కశాస్త్రానికి ప్రయోజనం ఏమిటి?

జవాబు : పుట్టుక నుంచీ మనిషిని అజ్ఞానం ఆవరించి ఉంటుంది. అతడి ఆలోచనలు అజ్ఞానాన్నే తెలియజేస్తాయి. ఇది జన్మ ప్రవృత్తి (Very nature) ఈ అజ్ఞానం వల్ల నిస్సహాయత కలుగుతుంది. ఈ నిస్సహాయత (Desolution) వల్ల దుఃఖం (Uneasiness) కలుగుతుంది. దాని వల్ల రాగద్వేషాలు (Bias) ఏర్పడతాయి. దానితో మనస్సు దోషయుక్త మవుతుంది. మలినమవుతుంది. యధార్థతత్వజ్ఞానం కలిగితే మనిషి ఈ రాగద్వేషాల నుంచీ, దుఃఖం నుంచీ, అజ్ఞానం నుంచీ బయట పడతాడు. అందుకు తర్కమే సాధనం.

ప్రశ్న : "ఆహ్నికం" అన్నారేమిటి?

జవాబు : అజ్ఞానం అంధకారమే. తేజస్వంతమైనది పగలు. తర్కంవల్ల బుద్ధి వికసిస్తుంది. వికాసం కాంతిమంతమే కదా! జ్ఞానోదయానికి తర్కం తొలిమెట్టు. అందుకే దీనిని ప్రథమాహ్నికం అన్నాం. తొలి మధ్యాహ్నమనుకోండి.

ప్రశ్న : సంగీతంలో స్వరాలున్నట్లే, అపస్వరాలుకూడా ఉంటాయి. ఆ రెంటింటినీ క్షుణ్ణంగా తెలుసుకోవటమే సంగీత శాస్త్ర ప్రయోజనం. అలాగే ఈ హేతువాదానికి కూడా ఉపసాధనాలు, అపసాధనాలూ ఉంటాయి. అవేవో చెప్పండి?

జ : హేతువాదానికి కొన్ని ప్రమాణాలు (Standards) ఉన్నాయి. అది ప్రత్యక్షం, అనుమానం, ఉపమానం, శబ్దం అని నాలుగు రకాలు. ఈ ప్రమాణాలను అనుసరించి బుద్ధిని వినియోగించి సాధించిన తాత్పర్యాన్నే ప్రమేయం (Resultant) అంటాము. "సంశయం" (Doubt) లేకుండా ఆలోచన ప్రారంభం కాదుగదా! సంశయానికి ప్రయోజనం (Purpose) ఉంది. ప్రమేయం ఎప్పుడయితే ఏర్పడిందో దానిని బలపరచటానికి దృష్టాంతం (Example) ఉండాలి. ఇలా దృష్టాంతాలతో బలపడిన ప్రమేయం "సిద్ధాంతం" (Thesis) అవుతుంది అది చర్చనీయాంశమే. అది చర్చకు "అవయవం" అవుతుంది. ఆ అవయవాన్ని బట్టి కొనసాగే "తర్కం"మే శరీరం (అవయవి) అవుతుంది. తర్కం నుంచి "నిర్ణయం" (Deduction) పుడుతుంది. ఇది శుభపరిణామం మొత్తం తొమ్మిది దశల్లో జరుగుతుంది.

పైన చెప్పిన విధంగా తొమ్మిది దశలలో కొనసాగే న్యాయ వైఖరినే "వాదం" (Discourse) అంటాము రాగద్వేషాలు లేకుండా ఒక విషయాన్ని కొందరు కలిసి బహుముఖాల విషయాన్ని పరిశీలించటమే వాదం. ఇది పరిశుద్ధ (Pure Logic) తర్కం, ఇక జల్పం. వితండం, హేత్వాభాస, ఛలం విగ్రహం—అను అయిదు అపరిశుద్ధ విధానాలు ఉన్నాయి. వీటివల్ల జ్ఞానం తొలగిపోతుంది. విజ్ఞానం కలగదు.

హేతువాదం ప్రమాణపూర్తిగా ప్రమేయ ప్రయోజనాన్నే

కలిగిఉండి సంశయాత్మకమై దృష్టాంతములపై ఆధారపడి సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తుందని చెప్పుకోవాలి. ఆ సిద్ధాంతాన్నే అవయవంగా స్వీకరించి అవయవిని సాధించాలి అప్పుడే అది వాదమవుతుంది. ఈ వాదం నాద ప్రధానమయిన స్వరం లాంటిది కాకుంటే జల్పము, వితండమూ హేత్వాభాస ఛలము, జాతి, నిగ్రహమూ పొందుతుంది ఈ ఆరూ అరిషడ్వర్గాలు, అపస్వరాలు,

## ప్రమాణాలు :

ప్రశ్న : ప్రమాణమంటే ఏమిటి? అది ఎన్నిరకాలుగా ఉంది?

జ: ప్రత్యక్షాను మానోపమాన శబ్దాఃప్రమాణాని-ఏ వసువుకు సంబంధించి అయినా పరిపూర్ణమైన జ్ఞానాన్ని "ప్రమ" (Knowledge) అంటాము దానిని సాధించే విధానమే "ప్రమాణం"- (The means of acquiring true knowledge) ఇది నాలుగు రకాలుగా వుంది-

1 ప్రత్యక్షం (Perception by senses)
2. అనుమానం (Inference)
3 ఉపమ (Analogy)
4. శబ్దం (Verbal Authority).

ప్రశ్న: ఈ నాలుగు రకాల ప్ర మా ణా ల నూ అన్వయించి ఏదైనా ఉదాహరణ చెప్పండి.

జ: జ్ఞానేంద్రియాలకు లభ్యమయ్యేది ప్ర త్య క్ష మే గదా చంద్రుడు ప్రత్యక్షం. ఒకప్పుడు వెన్నెల కనిపిస్తుంది. చంద్రుడు కనపడడు. వెన్నెలని బట్టి చంద్రుని ఉనికిని నిర్ణయిస్తాం. అది

అనుమానం. చంద్రుడు లేకుండా వెన్నెల ఎన్నడూ ఉండదు కదా! శబ్దశక్తి జ్ఞాన రూపానుభవ విశేషమే "ఉపమ". మంచును కలిగించే గుణం ఉంది చంద్రునికి. అందుకే అతనికి హిమకరుడని పేరు. అది ఉపమ (Analogy). నాల్గవది శబ్దం: కూత ను బట్టి పక్షి పేరు చెపుతాము పేరునుబట్టి వస్తువును గ్రహిస్తాం. ఈ రెండూ శబ్దంలోకే వస్తాయి. చంద్రుడు అనేసరికి మన మనస్సులో కలిగే అనుభూతియే చంద్ర దర్శనం చేయిస్తుంది. అదిశబ్దశక్తి.

## ప్రత్యక్ష ప్రమాణం

ప్రశ్న: ప్రత్యక్ష ప్రమాణానికున్న విశిష్టత ఏమిటి?

జ: ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞానమ్, అవ్యపదేశ, మవ్యభిచారి, వ్యవసాయాత్మకమ్ ప్రత్యక్షమ్-పదార్థాలతో మన జ్ఞానేంద్రియాలకు ప్రత్యక్ష సన్నికర్షకలగటంవల్ల ఆ పదార్థానికి సంబంధించిన రూపురేఖలు, గుణాగుణాలు, రుచి, వాసన మున్నగు విశేషాలన్నీ తెలుస్తాయి. అదే ప్రత్యక్ష జ్ఞానం. ముక్కు, చెవి, కన్ను, నాలుక చర్మము- ఇవే మన జ్ఞానేంద్రియాలు. వీటి ద్వారా ప్రత్యక్షజ్ఞానాన్ని పొందుతాము. ఇందులో ఊహించ వలసిన విషయమేదీ లేదు. అది వ్యపదేశాత్మకమూ, వ్యభిచారి కాకూడదు వ్యవసాయాత్మకమై ఉండాలి.

ప్రశ్న: కొన్ని వస్తువులు అన్నిజ్ఞానేంద్రియాలకూ అందవు. అప్పుడు మనకు లభించిన జ్ఞానం సమగ్రంకాదుకదా!

జ: అవును. చంద్రుడున్నాడు. చంద్రుని రూపం కంటికి, చల్లదనం చర్మానికి లభిస్తున్నాయి. ముక్కుకీ; చెవులకూ, నాలుకకూ

లభించడంలేదు. లభించినంత వరకూ ఆ జ్ఞానం ప్రత్యక్షమే గాని సమగ్రం కాదు. అయినా చంద్రుని రూపం మనకు తగిన అవగాహన కలిగిస్తుంది.

ప్రశ్న: కొందరికి "రేచీకటి" ఉంటుంది. వారికంటికి వెన్నెల ఒకేలా కనబడదు మనం ఆనందించే పండువెన్నెల అతనికి బహుళ పంచమి జ్యోత్స్నలా కనబడవచ్చు. కనుక ప్రత్యక్ష జ్ఞానం ఎవరిది వారిదే అవుతుందిగాని అందరిదీ ఒకటి కానందున సమగ్రంకాదు

జ: పుట్టు గ్రుడ్డివాడూ, రేచీకటివాడూ, కళ్ళున్నవాడికి ప్రమాణం కాదు, మూగవాడూ, నత్తివాడూ, మాటకారికి ప్రమాణంకాదు. చెవిటి వాడూ, బ్రహ్మచెముడు వాడూ వినికిడి గలవానికి ప్రమాణం కాదు అజ్ఞానం జ్ఞానానికి ప్రమాణం కాదు.

# వ్యపదేశం

ప్రశ్న : వ్యపదేశమనగా పేరు. అన్ని వస్తువులకూ వేరు వేరు పేర్లున్నాయి. కళ్ళున్న వాడికీ లేని వాడికి "చంద్రుడు" అని, చెపితే అర్థమవుతుంది. కనుక ప్రత్యక్ష ప్రమాణం అవసరం లేదు. పేరు చెపితే తెలిసేది ఏదిఅయినా వ్యపదేశాత్మకమే కదా!

జ: మీకు తెలియని వస్తువు పేరు చెపితే ఆ వస్తువు మీ మనస్సులో ఏర్పడుతుందా? అందుకే వ్యపదేశం ప్రమాణం కాదు. ఎప్పుడో ఒకప్పుడు మీకావస్తువు పరిచయమయి ఉండేవాలి, చెపితే తెలుస్తుంది ఇక తెలిసిన వస్తువులున్నాయి వాటి పేరు చెపితే సరిపోతుందా? "నీరు" అన్నా ననుకోండి అప్పుడే మీ మనస్సుకు స్ఫురించే నీటికి, నిజంగా ఉన్న నీటికీ చాలా తేడా ఉంటుంది. అది

చప్పగా ఉండవచ్చు: ఉప్పగా వుండవచ్చు: తియ్యగా ఉండవచ్చు: ఎలా ఉన్నా అది నీరే కదా! వ్యపదేశ మాత్రాన నీటి లక్షణం తెలియదు. వ్యపదేశం పరోక్ష జ్ఞానాన్ని కలిగిస్తుందే గాని ప్రత్యక్ష జ్ఞానాన్ని కలిగించదు. కనుక వ్యపదేశం ప్రమాణంకాదు

పైగా వస్తువులకు వ్యభిచార దోషం ఉంది. ఉప్పునీరు, బురద నీరు, కల్మషాత్మకమైనవి. తనది కాని మరో వస్తువును కలుపుకోవటం ద్వారా నీరు తన స్వార్థాన్ని (Purity) పోగొట్టుకున్నదన్న మాట! అప్పుడు వ్యపదేశం నిరర్థకం అవుతుంది.

ఇంకో దృష్టితో చూద్దాం. ఉప్పదనంలో కూడా తేడాలున్నాయి. ఉప్పగా ఉండేవాటిని లవణాలని అంటాము దేని రుచిదానిదే. రుచిని బట్టి మనం లవణాలను వేర్వేరుగా పేర్కొంటాం. ఆ రకంగాచేసే వస్తు నిశ్చయానికి వ్యవసాయం (Analysis) అని పేరు. వ్యవసాయ యోగ్యమైన వస్తువుకే ప్రత్యక్షమని పేరు.

## అనుమానం

ప్రశ్న : లేనిది ఉన్నట్లు ఊహించడం అనుమానం కాదా?

జ: కాదు. వ్యవహారంలో సందేహానికి అనుమానం పర్యాయ పదంగా వ్యవహరింప బడుతోంది. అది తప్పు అది నాకు అనుమానమే — అంటే అది నాకు అంగీకారమే అని అర్థంవుంది అలాగే ఉన్న ఆధారాలను పురస్కరించుకొని చేసే నిశ్చయానికి అనుమానము పేరుంది: (The act of drawing conclusion from given premises.) మేము చెప్పిన అనుమానం ఇది కూడా కాదు: అవయవాన్ని బట్టి అవయవిని గ్రహించటం మేము చెప్పిన "అనుమానం. అందుకే

'ప్రత్యక్ష పూర్వకం అనుమానం' అని చెప్పబడింది. ఇది "వ్యాప్తి" (Extension) పై ఆధారపడి ఉంటుంది.

పొగను చూస్తున్నాం. ఎంత వెతికినా నిప్పు కనబడదు. నిప్పు లేకుండా పొగ ఉండదు. కనుక ఎక్కడో నిప్పు ఉన్నదని నిర్ణయిస్తాం. పొగనుంచి మన మనస్సు నిప్పుకు వ్యాపించిందన్నమాట. ఈ రకం వ్యాప్తితో కూడిన నిర్ణయమే మన "అనుమానం".

ప్రశ్న : ఇదా మీ "అనుమానం"? అందుకే అది ప్రమాణమై కూర్చుంది. అయ్యా! మొత్తంమీద మీకు ఎన్ని రకాల అనుమానాలున్నాయి.

జ : త్రివిధమనుమానం—పూర్వవత్, శేషవత్, సామాన్యతో దృష్టంచ, మూడు రకాలు : 1. పూర్వవత్, 2. శేషవత్, 3. సామాన్యవత్—అని మాకున్న అనుమానం మూడు రకాలుగా ఉంది. నిప్పుకనబడకపోయినా పొగ ఉన్నచోట నిప్పు ఉన్నదని అంటున్నాముకదా? దేనిని బట్టి? పూర్వానుభవాన్ని బట్టి పూర్వానుభవంవల్ల మనకు కలిగిన అనుమానమే పూర్వవత్ అవుతున్నది.

వేసవిలో గోదావరి నీరు ఉధృతంగా వస్తూండటం చూశాము. పైగా ఆ నీటిలో బురద ఎక్కువగా కనిపిస్తున్నది. ఇదివరకు గోదావరి నీటిలో లేని బురద ఇప్పుడు కనిపించిన కారణంగా గోదావరికి వరద లొచ్చాయని గ్రహిస్తాం. ఆ పైన ఎక్కడో వర్షాలు భారీగా పడిఉంటాయి. ఇది శేషవత్.

రంగు, రుచి, వాసన, వేడి, ధ్వని—ఇవి గుణాలు. వీటిని బట్టి వస్తువును నిర్ణయిస్తాము. అనగా అనుమానిస్తాము. రంగును చూసి ఇత్తడనీ, పుత్తడినీ చెపుతున్నాం కదా! ఇది సామాన్యవత్. ఈ విధంగా అనుమానం మూడు రకాలు.

ప్రశ్న : పదార్థవాదులకు "అనుమానం" ఉందా ?

జ : పదార్థవాదులకు అనుమానం లేదు. చార్వాకులంతా పదార్థ వాదులే పదార్థవాదులు తర్కగతిని (Dialectics) అనుసరించడం జరిగితే వారికి "అనుమానం" కూడా ప్రమాణమవుతుంది. లేకుంటే ప్రత్యక్షమే ప్రమాణం. పదార్థవాదులు కేవల వ్యవసాయోప (Analysis) జీవులు. ప్రత్యక్ష ప్రమాణం తార్కికం కాదు. అనుమాన ప్రమాణమే తార్కికం. అన్వీక్ష (Dalectical Materialism) ప్రత్యక్షాను మాన ప్రమాణాలమీద ఆధారపడి చేసిన సాగుమాత్రమే. భావవాదులు కేవల అనుమానోప జీవులు. కవులు ఉపమానోప జీవులు: అనుభూతివాదులు.

## ఉ ప మా న ం

ప్రశ్న : కావ్యభాషలో "ఉపమానం" ఉన్నది. ఆమె ముఖం చంద్రుడిలా ఉన్నదంటారు కవులు. ముఖం చంద్రుడూ కాదు చంద్రు డెవరికీ ముఖమూ కాదు—అది ప్రమాణమవుతుందా ?

జ. ప్రసిద్ధ సాధర్మ్యాత్ సాధ్యసాధన ముపమానమ్—కావ్యభాషలో "ఉపమానం" అలంకారమేగని ప్రమాణంకాదు. అది అర్థాలంకారం. ఆమె ముఖం గుండ్రంగా ఉన్నదని చెప్పడం కోసమే చంద్రునితో ఆమె ముఖాన్ని పోల్చాడు కవి. భిన్నములగు రెండు పదార్థాలకు గల సమాన ధర్మాన్ని బట్టి ప్రతిపాదింపబడిన సాదృశ్యమే ఉపమ—చంద్రుడు ఆమె ముఖమంత చిన్నదికాడు. ఆమె ముఖం చంద్రుడంత పెద్దదీకాదు. ఆ రెండూ గుండ్రంగా ఉన్నాయని, చల్లని వెన్నెల కురుస్తున్నాయనీ కవి భావన. చంద్రుడు ఉపమానం ఆమె ముఖం ఉపమేయం. కావ్యభాషకీ తర్కభాషకీ తేడా ఉంది. తర్కశాస్త్రపు ఉపమానం వేరు.

ప్రశ్న : పోనీ మీ తార్కిక "ఉపమానం" ఏమిటో చెప్పండి?

జ: శబ్దశక్తి మూలకమగు జ్ఞాన రూపానుభవ విశేషమే "ఉపమ" అని తార్కిక బాష, చంద్రుడు అంటే "అందగాడు" అని అర్థం హిమకరుడు అంటే చల్లదనాన్ని కలిగించే వాడని అర్థం. అందమూ, చల్లదనమూ జ్ఞానరూపానుభవ విశేషాలు. అది జాబిలి (Moon) యందే నిర్దేశింప బడ్డాయి. ఆ విధంగా గుణ నిర్దేశం జరప టాన్నే ఉపమ (Anology) అంటాము. ఉపమానం ఆప్తోపదేశ శబ్దమే. చంద్రుడు అను పేరు ప్రకాశవంతమైన చంద్రబింబానికేకదా! అర్థాన్ని విడవని శబ్దానికి, అర్థ వ్యభిచారం లేని శబ్దానికి ఆప్తోపదేశ మనిపేరు.

## శబ్దం :

ప్రశ్న : మీరు శబ్దం ప్రమాణమని చెప్పారు. ఆ శబ్దం సాంఖ్యమా? గాంధర్వమా? సాహిత్యమా?

జ: శబ్దానికి స్వరమని అర్థంచెప్పిన వారు సాంఖ్యులు. వారు. శబ్దాన్ని ఉదాత్త, అనుదాత్త, స్వరిత-అని మూడు భాగాలుగా విభజించారు. స్థాయీ భేదాన్ని బట్టి జరిగిన విభజన అది. అది సాంఖ్యం

షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, దైవత, నిషాద-అని శబ్దాన్ని సప్తస్వరాలుగా విభజించారు. గాంధర్వులు. ఇవన్నీనాధం యొక్క స్థాయీ భేదాలు. అది గాంధర్వం

శబ్దానికి పదము. వాక్కు, భాష అనికూడా అర్థాలు (Meanings) ఉన్నాయి. వాఙ్మయం యావత్తూ శబ్ద బ్రహ్మ అర్థాన్ని ఆశ్రయించిన

శబ్దమే సార్థకం. అది సాహిత్యం.

తర్కశాస్త్రంలో ఉన్న 'అర్థాలు' పేరు, అవి పదార్థాలు. వస్తువులకున్న పేర్లనే శబ్దాలని అంటాము. ఏ వస్తువు పేరు వింటే ఆ వస్తువు మన మనస్సుకు తట్టుతుందో అది శబ్దం. గంట అన్నామనుకోండి. గంట అనబడే వస్తువు స్ఫురిస్తుంది. అలా స్ఫురింపజేసేదే శబ్ద ప్రమాణమయింది.

ప్రశ్న: గంట దృష్టార్థం. గంట వినబడుతున్నదేగానీ కనబడటం లేదు. అప్పుడది అదృష్టార్థమే కదా? గంట వినబడి కనబడకపోయినా కనబడి వినబడకపోయినా శబ్దం "అనుమాన"మే గాని వేరే ప్రమాణం కాదు.

జ: గంట వినబడి కనబడక పోయినా, కనబడి వినబడకపోయినా అది అనుమాన ప్రమాణమే. శబ్ద ప్రమాణం అది కాదు ఇందులో గంట కనబడదు. గంటానాదం వినబడదు. గంట అను మాట మాత్రమే వినిపిస్తుంది. అదే ముఖ్యం అనగా ముఖం నుంచి వచ్చేది. శబ్దం ముఖ్యమే గాని పదార్థం కాదు గదా! అందుకే శబ్దం వేరే ప్రమాణమని అన్నాము.

ప్రశ్న: ఆప్తోపదేశః శబ్దం అన్నారు మీరు, శబ్దం ముఖ్యమంటున్నారు మీరే-సరిగా చెప్పండి

జ: ఆప్తోపదేశమనగా విశ్వసనీయ వ్యపదేశమే (Trusty Instruction). అర్థమనగా వస్తువు. ఆ వస్తువుకు ఏదో ఒక పేరు వుండి. వ్యపదేశమనగా పేరు. అది శబ్దాత్మకం. ఆ పేరుకు రెండర్థాలుండ కూడదు. ఉంటే దానికి వ్యభిచారదోషం కలుగుతుంది. "కుండ"

అనే శబ్దానికి మరో అర్థం లేదు. కనుక వ్యభిచార దోషం లేదు. కేవలం మట్టి కుండను స్ఫురింపజేయుటమే ఆప్తోపదేశం. అది శబ్దాత్మకం గనుకనూ, ఆ శబ్దం ముఖం నుంచి వస్తుంది గనుకనూ ముఖ్యమయింది.

ప్రశ్న : అర్థములు (వస్తువులు) రెండు విధాలని మీరన్నారు. దృష్టార్థములు, అదృష్టార్థములు అని కనబడేవి దృష్టార్థములవి, వినబడేవి అదృష్టార్థములనీ అన్నారు. అది తృప్తిగా లేదు. ఇంద్రియగోచరమైన దేదయినా దృష్టార్థమే కదా ?

జ : వ్యుత్పత్తిని అనుసరించి అలా చెప్పాను కానీ వస్తువుల పేర్లన్నీ దృష్టార్థములే. అవి వాస్తవాలు ఆత్మ, మనస్సు, ఆలోచన వంటివి వస్తువులు కావు ప్రత్యక్షమూ కావు. అవి అవాస్తవికాలు. ఈ రకం అవాస్తవిక శబ్దాలు అదృష్టార్థకాలు. ఈ విధంగా శబ్దం "ద్వివిధో దృష్టా దృష్టార్థత్వాత్".

## ప్రమేయం :

ప్రశ్న : ప్రమేయమంటే ఏమిటి ?

జ : ప్రమ అనగా యథార్థ జ్ఞానం. అనగా వస్తువుయొక్క నిజ స్వరూపాన్ని తెలుసుకోవటం. దానికి ప్రత్యక్ష అనుమానం, ఉపమాన శబ్దాలు సాధనాలు-కనుక అవి ప్రమాణాలు. ఇట్టి ప్రమాణాల ద్వారా నిర్ణయించ దగిన విషయాన్ని ప్రమేయ (Proposition) మని అంటారు. అవి ఎప్పటికీ రుజువు కావలసినవే. ప్రమేయ Is something to be proved in discussion.

అలాటివే ఆత్మ (Soul) ఇంద్రియార్థాలు (Sensation), బుద్ధి

(Intellect) మనస్సు (Mood), ప్రవృత్తి, (Activity), దోషాలు (impurities) అభావం (Non Entity) ఫలం (Resultant) దుఃఖము (Pain) అపవర్గం (goal).

ఆత్మ :

ప్రశ్న : ఆత్మ ప్రత్యక్షమా ?

జ : ఆత్మ వస్తువుకాదు. కనుక వాస్తవంకాదు కొన్ని ఆధారాలను బట్టి ఆత్మ ఉన్నదని ఊహింపబడుతున్నది. ప్రత్యక్షం కానిదేదీ వాస్తవం కాదు. అందుకే ఆది "ప్రమేయం" (Proposition) అని అన్నాము. ఆత్మ ఉన్నదని అనుమానించదగిన హేతువు లున్నాయి. సుఖదుఃఖాలను శరీరమే అనుభవిస్తుంది. కాని సుఖదుఃఖ జ్ఞానం "ఆత్మ" అని చెప్పబడుతుంది.

సత్యమనగా వస్తువు (Material). వస్తువు కానిది అసత్యమే కదా! ఆత్మ అసత్యమే గాని సత్యంకాదు. మెదడు సత్యమే, బుద్ధి అసత్యం కదా! ఆత్మ లేదనే వాడికి బుద్ధి కూడా లేదు. హేతువు అసత్యాన్ని సాధిస్తుంది. సత్యాన్ని చూపించటానికి హేతువు అవసరం లేదు

హేతువు ముఖంగా నిరూపింప బడినవే ప్రమేయాలు. ఆగమ ప్రమాణం గలవి ప్రమేయాలు (Deductions). కనుక శాస్త్రజీవనమే కలిగి వాస్తవ జీవనంలేదు ప్రమేయాలను కూడా కాలం రాను రాను "సత్యాలు" (రుజువు చేయబడిన నిజాలు) గా స్వీకరించింది. ఆవిధంగా ఆత్మవంటి అసత్యాలు సత్యమయ్యాయి

ప్రశ్న : ఆత్మ ప్రత్యక్షం కాకపోవచ్చు. అనుమానమయినా కావాలి గదా! శాస్త్రాన్ని (ఆగమ) మీరు ప్రమాణంగా చెప్పలేదు ఆత్మ ప్రమేయమే అన్నారు. సరిగా జ్ఞాపకం తెచ్చుకోండి ఆత్మ ఉన్నదని మీరెలా చెప్పగలరు?

జ : మనిషి నిర్జీవుడై ఉన్నాడు. అది శవం. మనిషి సజీవుడై ఉన్నాడు అప్పుడు జీవి. అతనికి జ్ఞానేంద్రియాలున్నాయి! వాటి ద్వారా జ్ఞానాన్ని సముపార్జిస్తున్నాడు. ఆట్టి జ్ఞానాన్ని ఎక్కడ దాస్తున్నాడు? మెదడు గోళకాలంలో. అయితే అదేదీ వస్తువు కాదు. కేవల అనుభవ జ్ఞానం. ఈ అనుభవ జ్ఞానానికే ఆత్మ అని పేరు, ఇది అనుభూతి రూపంలో ఉంటుంది.

సమస్త ప్రాణికోటికీ సుఖానుభూతి. దుఃఖానుభూతి ఉన్నది కామం, ఆకలి ఉన్నాయి. ప్రయత్నమూ ద్వేషమూ, సంతోషమూ ఉన్నాయి. ఇవన్నీ అసత్యాలే. అయినా అవి ఆత్మ అవుతున్నవి. శవంలో లేని ఇవన్నీ పశుపక్ష్యాదుల్లో ఉన్నాయి కదా! కనుకనే ఆత్మ ఉన్నదనుకో వలసి వస్తున్నది కాదయ్యా, ఇదంతా జీవధర్మమే గాని ఆత్మ లేదను కుందాం. "ఎమీబా"లో అనుభూతి లేదేమి? అది జీవమే కదా! శవంలో లేని ఆత్మానుభూతి శరీరంలో కనపడటంవల్ల ఈ అనుమానం శేషవత్ అవుతున్నది. పదార్థంకాని ఏదయినా ప్రమేయమే గనుక ఆత్మ కూడా ప్రమేయమే.

సుఖదుఃఖానుభవం పొందేది శరీరం. సుఖదుఃఖానుభవజ్ఞానమే ఆత్మ. భోగసాధనాలు ఇంద్రియాలు. భోగవిషయాలు అర్థాలు. భోధయే బుద్ధి, భోగలాలసత్వమే మనస్సు. భోగసముపార్జన స్వభావమే ప్రవృత్తి. రాగద్వేషాలు దోషాలు. నిర్లిప్తతయే అభావం. సుఖదుఃఖానుభవమే ఫలం. దుఃఖ నివృత్తియే అపవర్గం (Goal)

## ఇంద్రియార్థాలు :

ప్రశ్న : మానవ శరీరంలోని ఇంద్రియాలు కొన్ని చేష్టల్ని చేస్తాయి. అవి యాదృచ్ఛికం కావచ్చు ఐచ్ఛికం కావచ్చు. అంత మాత్రాన వాటిని జ్ఞాన సాధనాలుగా చెప్పటం సమంజసమేనా?

జ : ఊరికే చూస్తూ ఉంటాం. అది యాదృచ్ఛికం. అలా కాదు. ఒక్కొక్కప్పుడు ఏదో విషయాన్ని తెలుసుకోవటం కోసం పట్టి పట్టి చూస్తాం. అది ఐచ్ఛికం. అలా తెలుసుకున్న విషయమే "అర్థం" అందుకే దానిని ఇంద్రియార్థమని అన్నారు. కన్నులు చూసిన దానిని, చెవులు వినినదానిని, ముక్కు పసిగట్టిన దానిని, నాలుక రుచి చూచిన దానిని, చర్మం స్పర్శించిన దానిని ఏది గ్రహిస్తుందో అది ఆత్మ. ఆత్మ, మనస్సు, బుద్ధి—ఈ మూడూ ఒకే ఇంద్రియంలో ఉంటాయి. ఇంద్రియ జ్ఞానమే మనస్సు. అయితే మనస్సు కోరికల పుట్ట: మంచి చెడ్డలవివేకమే బుద్ధి

కాళ్ళు నడుస్తాయి, చేతులు పనిచేస్తాయి, చెవులు వింటాయి. కళ్ళు చూస్తాయి. చర్మం శీతోష్ణాలను గ్రహిస్తుంది-ఇవీ కర్మలు, ఈ కర్మల ద్వారా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు లభిస్తాయి ఇవే ఇంద్రియార్థాలు కర్మ పరంగా కర్మేంద్రియాలయినవే అనుభవపరంగా జ్ఞానేంద్రియాలయినవి.

ప్రశ్న : కర్మేంద్రియాలకు జ్ఞాన సంపాదనా శక్తి ఎట్లా వచ్చింది?

జ : శరీరం పాంచ భౌతికమైనది. మట్టి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం (ఈథర్) ఈ అయిదూ పంచభూతాలు. నేలకు గంధగుణమూ, నీటికి రస గుణమూ, నిప్పుకు రూప గుణమూ, గాలికి స్పర్శ గుణమూ,

ఆకాశానికి శబ్దగుణమూ ఉన్నాయి. ఈ గుణాలే వరుసగా ముక్కు, నాలుక, కన్ను, త్వక్కు, చెవి, కలిగి ఉన్నాయి. అందుకె శరీరం పంచభూతాత్మక మని చెప్పబడింది.

ప్రశ్న : ఏమిటేమిటి? ముక్కులో మట్టి, నాలుకలో నీళ్ళు, వంట్లో నిప్పు, చర్మంలోగాలి, చెవిలో ఆకాశము ఉన్నాయంటారా? పిచ్చికుదిరింది తలకు రోకలి చుట్టమన్నట్లుంది.

జ. అది బుద్ధి తక్కువ పనే, పంచ భూతాత్మకమైన ప్రపంచం ఏయే లక్షణాలను కలిగి ఉందో పంచభూతాత్మకమైన శరీరంకూడా అవే లక్షణాలను కలిగి ఉంది. అందుకనే పంచభూతాల యొక్క అంశలు (మాత్రలు) శరీరంలో ఉన్నాయనిచెప్పడం జరిగింది. వాసనముక్కునూ రుచి నాలుకనూ, రూపం కంటినీ, స్పర్శ చర్మాన్నీ శబ్దం చెవినీ ఆశ్రయించాయి. ఇవన్నీ ఏక కాలమందు ఆత్మానుభవాన్ని పొందుతాయి.

ప్రశ్న : ఆత్మవేరు, మనస్సువేరు అని మీరు చెప్పారుగదా!

జ: ఇంద్రియాలన్నీ ఏకకాలమందు పనిచేసి తాము సేకరించిన ఆర్థాలను ఒక చోట ప్రోగు పెడతాయని చెప్పాను. అదే ఆత్మాగారం. అవి మనస్సుకు అంటవు. వాటినుంచి తనకవసరమయిన అర్థాన్ని మాత్రమే మనస్సు గ్రహిస్తుంది. తతిమ్మా వాటిని ఉపేక్షిస్తుంది. అందుకే ఆత్మవేరు. మనస్సు వేరూ అని చెప్పాము. ఆత్మ (Soul is that part of Man's nature where experiences, feelings, ideals and morals centre). అనుభవాలు, అనుభూతులు, ఆదర్శాలు నైతికవైఖరి కేంద్రీకృతమైన మానవ ప్రకృతియే ఆత్మఅని అంటున్నాను.

ప్రశ్న : అయితే ఆత్మ మనష్యులకే గాని చెట్లకీ, పశువులకీ, పక్షులకీ లేదన్నమాట! ఆత్మానాం సర్వభూతాని అనే సూత్రమే తప్పు.

జ: కాదండీ! ఇంద్రియార్థ సముచ్చయమే ఆత్మ. అది అనుభవాల అనుభూతుల ఆగారం.

ప్రశ్న : గ్రుడ్డివాడికి దృశ్య జ్ఞానం, చెవిటి వాడికి శబ్దజ్ఞానం ముక్కుడికి వాసన జ్ఞానం లేవు కదా! అప్పుడు వారి ఆత్మ పరిపూర్ణం కాదు

జ : ఆత్మ యొక్క ఉనికి ఇంద్రియార్థాలపై ఆధారపడి ఉన్నదని ముందే మనవి చేశాను. అమీబాకు, చెట్లకు చర్మం తప్ప ఇతర ఇంద్రియాలేవీ లేవు. అందుకే అవి తమోభూతాలు, పక్షులకూ, పశువులకూ. కర్మేంద్రియాలున్నాయి, అవే జ్ఞానేంద్రియాలు కనుక ఇంద్రియ జన్య జ్ఞానమూ (ఆత్మ) ఉన్నది. చెట్లకు చర్మం ఉన్నది. తద్వారా స్పర్శజ్ఞానం ఉన్నది. ఆ మేరకు ఆత్మ ఉన్నది. వెన్నుపూసగల జంతువులన్నింటికి మెదడు (A Mass of nerve tissue filling the cratial cavity of the skull) ఉంది. కనుకనే వాటికి మనస్సు (Mood) ఉంది. అవి రజోగుణ ప్రధానాలు. మనిషికి మాత్రమే బుద్ధి (Intellect) ఉంది. బుద్ధియే సత్త్వం.

ప్రశ్న : మనిషికి బుద్ధి ఒక్కటే ఉందా ?

జ : బుద్ధి ఒక్కటే కాదు, మనస్సూ ఉంది. ఆత్మావుంది. సర్వప్రాణులలోనూ వుంది. మనస్సు పశుపక్ష్యాదులలో ఉంది. మనుష్యులకు మనస్సు, ఆత్మ, బుద్ధి వున్నాయి. సర్వ తాత్మకమయిన ఆత్మ అవ్యక్తమై ఉంటుంది. మనస్సు భోధనాత్మకంగా ఉంటుంది. బుద్ధి హేతుబద్ధమై ఉంటుంది

ప్రశ్న : జ్ఞానేంద్రియాలన్నీ ఒకేసారి పనిచేస్తాయా? అప్పుడు వాటినుంచి లభించిన జ్ఞానం కలగా పులగంగా ఉంటుందా? తేటతెల్లంగా ఉంటుందా?

జ : జ్ఞానేంద్రియాలన్నీ ఒకేసారి పనిచేస్తాయి. అవి అందజేసిన అనుభవజ్ఞానం ఏకకాలమందే లభిస్తుంది. ఈ అనుభవాగారమే "ఆత్మ" అని చెప్పుకున్నాం గదా! ఇంద్రియజ్ఞానం ఆత్మీయమై ఉండిపోతుంది. అదేదీ మనస్సుకు పట్టదు

ప్రశ్న : మనస్సుకు పట్టకపోతే కళ్ళున్నా మూసుకు పోయినా ఒకటే. ఎదురుగా ఉన్న ఏ వస్తువూ కనబడదు గదా!

జ : మనస్సు అన్యాయత్తంగా ఉన్నప్పుడు. ఇంద్రియ జన్యజ్ఞానం నిరుపయోగమైపోతుంది అపుడు మనిషి కళ్ళువిప్పి చూస్తున్నా కళ్ళముందు ఉన్నవేవీ అతనికి లభించవు అందుకే మనస్సు పట్టని సమయంలో మనిషి కళ్ళు ఉన్నా. లేనివాడె అవుతాడు చూస్తున్నా చూడనివాడే అవుతాడు. మనస్ — the అంతఃకరణ of perception and cognition, through which thoughts enter or by which the objects of the sense affect the soul, In this sense మనస్సు is always regarded as distinct from ఆత్మ (Soul) and పురుష (Spirit) and belonging only to the body. అందుకే చిత్తగించమని అంటున్నాం। చిత్తగించడమంటే ఇంద్రియముల ద్వారా పొందిన జ్ఞానాన్ని మనస్సుకి అందించడమన్న మాట.

ప్రశ్న ; బాగానే ఉంది. మనస్సు, జ్ఞానేంద్రియాలన్నీ ఏకకాలమందు అందించిన జ్ఞానాన్ని అందుకో గలదా?

జ : మనస్సు అన్ని ఇంద్రియాలు ఏకకాలమందు స్వీకరించిన జ్ఞానాన్ని అందుకోలేదు. కనుక అది ఏదో ఒక ఇంద్రియంపైనే కేంద్రీకరించి. దాని నుంచి గ్రహించిన ఇంద్రియ జ్ఞానాన్నే అందుకో గలుగుతుంది.

ప్రశ్న : అదేమిటి? మీ కంటికి ఎదురుగా ఉన్న వ్యక్తి మాట్లాడుతూంటే, కనబడదంటారా?

జ : అలా అనను కనబడుతున్నప్పుడు వినబడదు. వినబడుతున్నప్పుడు కనబడదు. మనస్సు అతి వేగంగా చూపులనుంచి చెవులకి, చెవుల నుంచి చూపులకి మారుతున్నప్పుడే ఏకకాలమందు ఆరెండు జ్ఞానాలు లభిస్తున్న భ్రాంతి కలుగుతుంది.

ప్రశ్న : జ్ఞానేంద్రియాలను విడిచి మనస్సు స్వతంత్రంగా వ్యవహరిస్తుందని మీరు రుజావు చెయ్యాలి. మనస్సు వేరూ, ఆత్మ వేరూ అన్నారు గదా!

జ: ఒక విద్యార్థి పుస్తకాన్ని తీసి చదువుతున్నాడనుకుందాం. అంటే అతని కళ్ళు ఆ పుస్తకంలోని అక్షరాలను ఏదేక దృష్టితో చూస్తున్నాయి. అతని నోరు ఆ అక్షరాలను పట్టిపట్టి చదువుతోంది. ఆ సమయంలో అతని మనస్సు అతని ప్రియురాలితో ముచ్చటలాడుతూ ఉంటుంది. ఈ రకం అనుభవం అందరికి కలిగేదే! కళ్ళు అందించే ఇంద్రియార్థాన్ని మనస్సు స్వీకరించడం లేదనే గదా అర్థం మనస్సు స్వతంత్రంగా వ్యవహరిస్తోందన్నమాట. మనిషి గుండెలాగే మనస్సు కూడా స్వతంత్రమైపోయింది అందుకే ఆత్మ వేరు. మనస్సు వేరు అని చెప్పవలసివచ్చింది.

మనస్సు "అన్యాయత్తంగా ఉన్నంతసేపూ అతను చదివిందేమిటో అతనికి తెలియదు. స్పృహ రాగానే తన తప్పిదాన్ని గ్రహించి మనస్సును కేంద్రీకరించి చదువుతాడు. అప్పుడే ఆ చదివింది అర్థమవుతుంది.

ప్రశ్న: జ్ఞానేంద్రియాలన్నీ ఏక కాలమందు పనిచేస్తున్నప్పటికీ మనస్సు మాత్రం ఒకే కాలమందు ఒకే ఇంద్రియార్థాన్నే గ్రహిస్తుందన్నారు గదా. రుజావు చేయండి.

జ: ఒకడు ఎర్రని జిలేబి పట్టుకుని ఉన్నాడు అతను ఎండలో ఉన్నాడు. ఆ జిలేబీ అందాన్ని అతను మెచ్చు కుంటున్నప్పుడు దాని రుచి గాని. తన మీద పడుతున్న ఎండగాని స్ఫురించవు, దానిని తింటున్న సమయంలో ఆ జిలేబీ అందంగాని. ఎండవేడిగాని స్ఫురింపవు పూర్తిగా తిన్నాక ఆ జిలేబీ అందంగాని, రుచి గాని స్ఫురింపవు ఎండవేడి మాత్రమే బాధిస్తుంది. ఇంద్రియార్థాలన్నిటినీ మనస్సు ఏక కాలమందు గ్రహించదని చెప్పటానికి ఈ ఉదాహరణ చాలు,

ప్రశ్న: ఇంతకీ మీరు ఆత్మ స్వరూపాన్ని నిర్దేశించనే లేదు.

జ: ఇచ్ఛాద్వేష ప్రయత్న సుఖదుఃఖ జ్ఞానా నాత్మనోలింగమ్ ఆత్మ ప్రత్యక్షమైన వస్తువు (దృష్టార్థం) గాదు. కొన్ని ప్రమాణాలను పురస్కరించు కొని ఉన్నట్లుగా రుజువు చేయవలసిన ప్రమేయమే అని చెప్పకున్నాం. ఆ ప్రమాణాలివి:

1. ఇచ్ఛ ( Libido ).
2. ద్వేషం ( Bias ).
3 ప్రయత్నం (Aptitude).
4. సుఖ దుఃఖ జ్ఞానం (Feelings).

అను లక్షణములను ఏది కలిగి ఉన్నదో అది ఆత్మ. కర్మేంద్రియాలకు ఆశ్రయమయినది శరీరం. నాసిక, జిహ్వ, చక్షువు, త్వక్కు శ్రోత్రము అను అయిదు జ్ఞానేంద్రియములు పంచభూతముల వల్ల ఏర్పడ్డాయి. పృథ్వి. జలము, తేజస్సు, గాలి, ఆకాశం అను అయిదూ పంచభూతాలు. గంధ, రస, రూప, స్పర్శ. శబ్దాలే పృథ్వి మున్నగు వాటి గుణాలు, అవే ఇంద్రియార్థాలు.

బుద్ధిరుపలబ్ధిర్ జ్ఞానమిత్యనర్థాంతరమ్- అర్థమనగా Object of senses అర్థాంతరమంటే Different malter అని అర్థము జ్ఞానేంద్రియాలద్వారా లభించిన జ్ఞానాన్ని ఇంద్రియార్థమంటున్నాము.

బుద్ధిని ప్రయోగించి పొందిన (ఉపలబ్ధి) జ్ఞానాన్ని "అర్థాంతరమ్" అంటాము

అటు ఇంద్రియార్థ జ్ఞానమూ, ఇటు అర్థాంతర జ్ఞానమూ ఒకేసారి కలగవు దానికి కారణం మనస్సు. మనస్సు ఇంద్రియార్థాలను బుద్ధికి అందించినపుడే అర్థాంతర జ్ఞానమ్ కలుగుతుంది. అందుకే ఇంద్రియార్థ జ్ఞాన స్వరూప మగు ఆత్మ, మనస్సు అర్థాంతర జ్ఞానదాయకమగు బుద్ధి ఈ మూడు ఒక్కటి కావు.

## ప్రవృత్తి

ప్రశ్న: ప్రవృత్తి అంటే ఏమిటి?

జ: ప్రవృత్తి (Tendency) అనేది మరో ప్రమేయం. ఒక లక్షణం తనకుతా అంకురించి క్రమశః విస్తరించటాన్ని "ఆరంభ" మంటాము ప్రవృత్తిర్ వాక్ బుద్ధి. శరీరారంభయితి- The commencement of action which awakens an interest in the progress of the principle is ఆరంభ.

మనో ప్రవృత్తి, వాక్ ప్రవృత్తి శరీర ప్రవృత్తి అని ఇది మూడు రకాలుగాఉంది. అందులో పుణ్య ప్రవృత్తులున్నాయి. పాప ప్రవృత్తులూ ఉన్నాయి. శరీర ప్రవృత్తి మూడు రకాలు. మనుష్యులు తమశరీరాన్ని ఒడ్డుపెట్టి యితరులకు రక్షణ కలిగిస్తారు అది పరిత్రాణం. తాము ప్రేమించిన వారికి తమకు తెలియకుండానే తమ శరీరాన్ని స్వాధీన పరుస్తారు. అది పరిదానం. ఆర్తులకు పరిచర్యలు చేస్తారు. అది పరిచరణం—ఇవన్నీ శరీరికంగా పుణ్య ప్రవృత్తులు.

అదే శరీరాన్ని కొందరు పరహింసకు వినియోగిస్తారు, దొంగతనానికి, వ్యభిచారానికి వినియోగిస్తారు. అవి పాప ప్రవృత్తులు.

కొందరు తమ వాక్కును సత్యానికీ, హితానికి, ప్రియానికీ, వినియోగిస్తారు. ఇవి పుణ్య ప్రవృత్తులు. కొందరు అబద్ధాలకీ, కావేషీలకీ, దుర్భాషలకీ, అంకితం చేస్తారు, అవి పాప ప్రవృత్తులు.

అలాగే మనస్సును దయకూ, అస్పృహకూ, శ్రద్ధకూ అంకితం చేస్తారు ఇది పుణ్య ప్రవృత్తి. మరి కొందరు ద్రోహానికి. పరద్రవ్యాపహరణానికి, క్రౌర్యానికి అంకితం చేస్తారు. అది పాప ప్రవృత్తి.

ప్రశ్న: "అస్పృహ" అన్నారేమిటి? సామాజిక స్పృహ లేకుండా ఉండటమని మీ అభిప్రాయమా?

జ. "స్పృహ" అనే మాటకు ఈర్ష్య అని అర్థం అస్పృహ అనగా ఈర్ష్య లేకుండా ఉండటం.

## దోషాలు

ప్రశ్న: ఈర్ష్యాదులు దోషాలే కదా?

జ; అవును, ప్రవర్తనా లక్షణా దోషః ప్రవర్తనా లక్షణమంటే ప్రవర్తింప జేయు లక్షణ మని అర్థం. ఇన్‌స్టింక్టు ( Instinct ) అంటారే అది. దానినే దోషమని చెపుతున్నాం. రాగ ద్వేషాలు రెండూ మోహం నుంచి పుడతాయి. రాగమనగా ఉద్వేగస్థితి ( Passion ), కామం. క్రోధం లోభం, మదం, మాత్సర్యం మున్నగునవి మానవ సహజాలే అయినా వాటిలో రాగం కనబడిందంటే ఆవ్యక్తి మోహాంధుడయి నాడని అర్థం. అలాగే ఈర్ష్యా అసూయలనబడే ద్వేషం సహితం ప్రవర్తనను చెడగొడుతుంది. కనుకనే రాగద్వేషాలను జయించాలని చెప్పటం జరుగుతోంది. వాటిని జయించినప్పుడే మానవ ప్రవర్తన నిష్కళంకంగా ఉంటుంది.

ప్రశ్న: అయితే మనిషి చచ్చినట్లుండా లంటారా?

జ: కామక్రోధాదులు సహజమని నేను ముందే చెప్పాను. నన్ను సరిగా అర్థంచేసుకోండి. అవి హద్దు తప్పినప్పుడే మనిషి ప్రవర్తన నీచాతినీచమవుతుంది. అది దోషమన్నాను.

## ప్రేత్యభావం

ప్రశ్న: ప్రేత్యభావం అంటారేమిటి? అంటే చచ్చినట్లు పడి వుండటమనేగా అర్థం?

జ: ప్రేతి అనగా మరణం, అభావమనగా లేకుండా ఉండటం. అది సంతానకారకత్వం ద్వారా జీవుడు పొందగలుగుతున్నాడు. అందుకే పునరుత్పత్తిః ప్రేత్యభావః అని చెప్పబడింది.

## ఫలం

ప్రశ్న: ఫలమంటే ఏమిటి?

జ: ఇంతకు ముందు ప్రవృత్తి అంటే యేమిటో చెప్పుకున్నాం. పుణ్య ప్రవృత్తివల్ల పుణ్యమూ, పాప ప్రవృత్తివల్ల పాపమూ లభిస్తాయి. ఫలమంటే యిదే వీటి వల్లనే సుఖమూ, దుఃఖమూ, కలుగుతున్నాయి. వీటిని అనుభవించక తప్పదు. అదే ఫలభోగం. అందుకే ప్రవృత్తి దోష జనితోర్థఃఫలమ్—అనిచెప్పటం జరిగింది.

## దుఃఖం

ప్రశ్న: ఏది సుఖం? ఏది దుఃఖం?

జ: బాధనాలక్షణం దుఃఖమితి-దేనిని అనుభవిస్తూన్నప్పుడు శరీరానికి మనస్సుకీ పరితాపం కలుగుతుందో అది దుఃఖం. ఆనందం కలుగు

తుందో అది సుఖం. ఈ రెండూ వేదనాత్మకమయినవి. అనుకూల వేదనను సుఖమనీ, ప్రతికూల వేదనను దుఃఖమనీ అంటాము.

ప్రశ్న: దుఃఖాన్ని ఎవరు కోరి తెచ్చుకొంటారు?

జ: ఎవరూ కోరి తెచ్చుకోరు. కాని మానవ సహజ ప్రవృత్తులలో దుఃఖం కూడా ఒకటి. ఊరికే కుమిలి పోతూవుండేవారు లేరా? అకారణంగా వారు పుట్టెడు దుఃఖంతో జీవిస్తారు. వారినే దుఃఖభాగులని అంటున్నాము. వారిలో నిత్యశంకితుడొకడు.

## అపవర్గం

ప్రశ్న: అపవర్గమంటే ఏమిటి?

దేహమే ఆత్మ యని చార్వాకులంటారు చార్వాకులు హేతువాదులు కాదు. దేహానికి దహ్యగుణం వున్నది. కనుక మరణమే మోక్షమని వారంటున్నారు. అపవర్గమనగా సమాప్తి అని వారి అభిప్రాయం.

భావన వల్లనే దుఃఖం కలుగుతుంది. కనుక, దుఃఖాన్ని నశింపజేసే జ్ఞానాన్ని పెంచుకొని అభావంతో జీవించటమే అపవర్గమని యోగాచార్యులు అన్నారు. ఎలాగోలా దుఃఖం నుండి పూర్తిగా తొలగిపోవటమే అపవర్గమని గౌతముడన్నాడు. దుఃఖ విముక్త స్థితియే అపవర్గం.

ప్రశ్న: మీరింత వరకూ చెప్పినవన్నీ సాధ్యాలుగానే కనిపిస్తున్నాయి. ఎందుచేత?

జ: ఇవి ప్రమేయాలని మీకు తెలుసుకదా! ప్రమేయాలు కారణాత్మకాలు: కనుకనే సాధ్యాలు, ఒకడు నిన్ను లెంపమీద కొట్టాడనుకో అది ప్రత్యక్షమే, అపుడు నీలో దుఃఖం కలుగుతుంది. ఈ దుఃఖమే

ప్రమేయం దుఃఖానికి కారణం లేనప్పుడు దుఃఖం కలగదు. అందుకే కారణాత్మకమన్నాం.

ఇక ఈ ప్రమేయాల ప్రసంగం విడిచి పెడదామా?

## సంశయం

ప్రశ్న: దేనినయినా విమర్శించి చూచినపుడే సంశయం కలుగుతుంది విమర్శగా చూడకపోతే సంశయం కలగదు అవునా?

జ: హేతువాదానికి సంశయమే జీవగర్ర ఇది తర్కసాధనలలో మూడవది. ఒక వస్తువు యొక్క నానాధర్మాలను విడమరచి చూడటమే "విమర్శ" రెండు వస్తువుల్ని పరీక్షించేటప్పుడు సాధర్మ్యం కనిపించినట్లే వైధర్మ్యం కనిపిస్తుంది అట్టి విరుద్ధ ధర్మజ్ఞానానికి విప్రతిపత్తి అని పేరు. సమాన ధర్మాన్ని బట్టి ఒక వస్తువుని నిశ్చయించబోతే విశేష ధర్మం వొకటి కనిపించి సంశయాన్ని కలిగిస్తుంది. కనుకనే విశేషాపేక్షో విమర్శః సంశయః-విశేష ధర్మాపేక్షతో చేసే విమర్శయే సంశయమని అర్థం.

పశ్న: సంశయం-ఎన్ని రకాలుగా ఉందోనని నా సంశయం.

జ: అది మూడు రకాలుగా వుందని గౌతమ మహర్షి అభిప్రాయం.

## సమాన ధర్మోపపత్తి

సంధ్యా సమయంలో ఒక వ్యక్తి గోచీ పెట్టుకొని, తలపాగా చుట్టుకొని, చేతికర్ర పట్టుకొని ఊరు బయట నిలబడి ఉన్నాడు. అతని ప్రక్కనే సరిగా అదే విధంగా చెక్కబడివున్న అంతే ఎత్తు శిలా

విగ్రహం వుంది? ఏది మనిషి? ఏది శిల్పం? ఇది సమాన ధర్మాలు లభించటం (ఉపపత్తి) వలన కలిగిన సంశయం.

## 2. అనేక ధర్మోపపత్తి

అనేక మనగా అసాధారణత. శబ్దం వున్నది. అది చేస్తే పుడుతుంది. కనుక కర్మ అవాలి: శబ్దం ధ్వని తరంగాలను ప్రసరింపజేస్తుంది కనుక గుణం కావాలి: శబ్దాన్ని గాలి మోసుకు వెడుతుంది. కనుక ద్రవ్యమవ్వాలి. శూన్య ప్రదేశంలో యిద్దరు మాట్లాడుకుంటే వారి మాటలు వారికే వినబడవు. కనుక శబ్దం ద్రవ్యమే. గుణమేమో? గుణమయితే ద్రవ్యాన్ని ఆశ్రయించి వుంటుంది. శబ్దం ద్రవ్యమే అయితే అది గుణం కాదు. కాదంటామా? అలానూ వీలు పడదు. ఇంతకీ శబ్దం యేమిటి? గుణమా? కర్మయా? ద్రవ్యమా ఈ రకం సంశయం అనేక ధర్మోపపత్తి.

## 3. విప్రతిపత్తి

ఆత్మ ఉన్నదని చెప్పటానికి ఎన్ని ఆధారాలున్నాయో లేదని చెప్పటానికి అన్ని ఆధారాలు వున్నాయి. ఇంతకీ ఆత్మ ఉన్నదా? లేదా? పరస్పర విరుద్ధ కారణాలపై ఆధారపడిసంశయాత్మక స్థితిని కలిగివున్న విషయాన్ని విప్రతిపత్తి అంటాము.

ప్రశ్న : ఇంతకుమించి సంశయకారణాలు లేవా?

జ: గౌతమ మహర్షి చెప్పినంతవరకూ అవే, అయితే వ్యాఖ్యాత యగు వాత్స్యాయన మహర్షి మరో రెండు సంశయాలను చెప్పాడు.

1. ఉపలబ్ధి అవ్యవస్థ-ఉపలబ్ది అనగా **Conception** మనకు కలిగిన జ్ఞానం యదార్థం కాకపోవచ్చు. అది అవ్యవస్థ, వస్తువు

వుంటే కలగటం సహజమే। లేకున్నా కలిగితే అసహజం. చెరువు వుంది అందులో నీరుంటే అది చెరువే. నీరులేకున్నా దానిని చెరువే అంటాము. నీరు లేకపోతే అది చెరువు ఎలా అవుతుంది? చెరువు గట్టు అవుతుంది. కనుక నీరు ఉండటమూ ఉండక పోవటమూ బట్టి చెరువు సంశయంలో పడుతుంది. ఎండమావుల్లో నీరు ఉపలబ్ధి అవ్యవస్థ.

2 అనుపలబ్ధి అవ్యవస్థ—చెట్ల కొమ్మలు నేలమీదకు వాంగి వున్నాయి అలావుంటే అక్కడి నేలలో నీరు పుష్కలంగా వుందన్న మాట. చెట్టుమొదట చూస్తే యే నీరూ కనబడదు. లేని వస్తువు కన బడకపోవటం సహజమే. నీరు ఉండి కూడా కనబడక పోవటం, అనుపలబ్ధి అవ్యవస్థ.

## ప్రయోజనం

ప్రశ్న : ప్రయోజనం అంటే ఏమిటి?

జ: యమర్థమధికృత్య ప్రవర్తతే తత్ప్రయోజనమ్-(Motive) ఏ విషయాన్ని మనస్సులో పెట్టుకుని మాట్లాడతామో అది ప్రయోజనం ఇది అంతరంగికమే గాని బహిర్గతం కాదు.

## దృష్టాంతం

ప్రశ్న : దృష్టాంతమంటే ఏమిటి? ఉదాహరణ కాదా?

జ: కాదు. సమాజంలో లౌకికులు,పరీక్షకులు అని రెండు రకాల మనుష్యులున్నారు. లోక జ్ఞానం కలవారిని లౌకికులంటాము. శాస్త్రపరి జ్ఞానం కలవారు విశితబుద్ధులు. వారిని పరీక్షకులు (Examiners) అంటాము ఉభయులూ అంగీకరించి అందరికి ప్రత్యక్షంగా బుజువయ్యే విషయాన్ని దృష్టాంతమని అంటాము ఉదా: సూర్యుడు తూర్పున ఉద యిస్తున్నాడు.

సిద్ధాంతం

ప్రశ్న: సిద్ధాంతం అంటే ఏమిటి?

జ: తంత్రాన్ని (Experimental Science) ప్రమాణంగా తీసుకొని సంశయంలేని నిర్ణయం ఏదయితే చేయబడిందో అదే సిద్ధాంతం ( Hypothesis that has been largely verified by facts ) దీనినే శాస్త్ర వ్యవస్థితి అంటారు.

ప్రశ్న? రాద్ధాంతమంటే ఏమిటి?

జ: విపులంగా చర్చించి. ప్రతిజ్ఞను స్థిర పరచటాన్నే రాద్ధాంతమని అంటాము. A demonstrated conclusion of an argument (Doctrine).

ప్రశ్న? సిద్ధాంత రాద్ధాంతాలకు ఉదాహరణ చెప్పండి?

జ: సిద్ధాంతం: భూమి తనచుట్టూ తాను తిరుగుతున్నది

రాద్ధాంతం భూమి తనచుట్టూ తాను తిరుగుతున్నది. అంతే కాదు అదే సమయంలో సూర్యుని చుట్టూ తిరుగుతుంది. అలా తిరగటం వల్లనే సూర్యోదయం, సూర్యాస్తమయం కలుగుతున్నాయి. అనిభ్రమతే —ఇది లౌకికులకు అర్థంకాదు, పరీక్షకులకు మాత్రమే అర్థమవుతుంది,

ప్రశ్న: ఈ పరీక్షకులెవరండి?

జ: పరీక్షకులనే శాస్త్రకారులని (ఆగమవేత్తలు) అంటాము. వారు ప్రతిపాదించే సిద్ధాంతాలు నాలుగు రకాలుగా ఉన్నాయి

1 ఏ శాస్త్ర సిద్ధాంతం యితరేతర శాస్త్రాలచే ఖండింప బడదో అది సర్వతంత్ర సిద్ధాంతం.

2. ఏ శాస్త్ర సిద్ధాంతం యితరేతర శాస్త్రాలచే ఖండింప బడుతుందో అది పరతంత్ర సిద్ధాంతం.

3 ఏ సిద్ధాంతం నుండి మరికొన్ని ఉపసిద్ధాంతాలు పుట్టటం జరిగిందో అది అధికరణ సిద్ధాంతం.

4. ఒక సిద్ధాంతపు విశేష ధర్మాలను పరీక్షించి స్థిర పరచేది అభ్యుపగమ సిద్ధాంతం.

## అవయవాలు

ప్రశ్న : తర్కానికి ప్రధానమయిన అవయవాలేవి?

జ : ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణ, ఉపనయం, నిగమనం. ఇవీ తర్కానికి ప్రధాన అవయవాలు. పర్వతం మీద అగ్ని వున్నది. ఇది ప్రతిజ్ఞ (Statement) దానిని నిరూపించటానికి హేతువు కావాలి. అందుకే పర్వతంపై పొగ కనబడుతున్నది కనుక.... అని చెపుతాము. పొగవున్నంత మాత్రాన నిప్పు వుంటుందనటానికి సాక్ష్యమేమిటి?

వంటిల్లే దీనికి ఉదాహరణ అంటాము వంటింట్లో నిప్పువుందికదా! దాని నుండి పొగ వస్తూనే వుంది. నిప్పులేనిదే పొగరాదు ఇది మనం చెప్పుకొనే సమన్వయం: దానికే ఉపనయమని పేరు.

కొండమీద పొగవస్తున్నది కనుక కొండమీద నిప్పు వున్నదని తాత్పర్యం. అది నిగమనం (Inference)

## ప్రతిజ్ఞ

ప్రశ్న : ప్రతిజ్ఞకు ఏమయినా ప్రత్యేకత ఉందా?

జ: ఏదో విషయాన్ని మనం ప్రతిపాదిస్తాము దానినే ప్రతిజ్ఞ అంటారు. ఈ ప్రతిపాదన-విషయం యొక్క మంచి చెడ్డల్ని రుజువు చేయవలసి వుంటుంది. అందుకే సాధ్యనిర్దేశః ప్రతిజ్ఞ అని చెప్పబడింది.

## హేతువు

ప్రశ్న : హేతువునెట్లా ప్రయోగించాలి?

జ : వస్తువు యొక్క ధర్మము మనకు తెలిసే వుంటుంది. వస్తు ధర్మము మాత్రమే కనబడి, వస్తువు కనబడనప్పుడు ఆ ధర్మాన్ని బట్టి

ఆ వస్తువును చెప్పగలము. అదే హేతువు నిప్పుకు పొగరావటం ధర్మం కదా? మనకు పొగమాత్రమే కనబడింది. నిప్పు కనబడలేదు. అయినా పొగకు నిప్పు హేతువు కనుక పొగను చూసి నిప్పు వుందంటున్నాము.

## ఉ దా హ ర ణ

ప్రశ్న : హేతువు మన కళ్ళముందుంటే యెందుకొచ్చిన ఉదాహరణలవి?

జ : మీరు చెప్పిన హేతువును బలపరచటానికి ఉదాహరణకావాలి. మనకు తెలిసిన దానిని జ్ఞాపకం చేసి, తెలియని దానిని తెలియచెప్పటానికి ఈ ఉదాహరణ పనికొస్తుంది. అందుకొచ్చిన ఉదాహరణ అది. నిప్పు వుంటేగాని పొగరాదని చెప్పటానికి వంటింటి పొగను ఉదాహరణగా తీసుకోవటం జరిగింది. నిప్పులేనిదే పొగలేదు అన్న వాక్యానికి విపర్యయం పొగలేనిదే నిప్పులేదని—ఎటు చెప్పినా అర్థం ఒకటే గనుక విపర్యయాన్ని కూడా స్థాపించవచ్చు.

## ఉ ప న య ం

ప్రశ్న : ప్రతిజ్ఞా విషయానికి హేతువుగా ఉదాహరణ ఒక్కటే చెపితే చాలదా?

జ : చాలదు. ఉదాహరణ నుంచి ప్రతిజ్ఞను సాధించటం, అవయవం నుంచి అవయవిని గ్రహించటం ఉపనయం అనబడుతోంది. Induction a process of reasoning from a part to a whole. It is also reaching a general conclusion from particular c ses.

## ని గ మ న ం

ప్రశ్న : అయితే నిగమనం దేనికి?

జ: ప్రతిజ్ఞకు అవసరమయినన్ని ఉదాహరణలనిచ్చి, తద్వారా సాధారణ నిర్ణయాలు సాగించటం. సాధారణ నిర్ణయాల నుండి నిశ్చయార్థాన్ని (Conclusion) సాధించటమే నిగమనం యొక్క ప్రయోజనం. Summing up argument. Deduction works from a general principle through a special case to a conclusion.

## తర్కం

ప్రశ్న: ఇంతకీ తర్కమంటే ఏమిటండీ?

జ: మనకు కొన్ని వస్తువుల తత్త్వం సరిగా తెలియదు. కారణాలనుబట్టి కార్యాన్ని, అవయవాన్ని బట్టి అవయవిని, అనుమాన ప్రమాణాన్ని బట్టి పరోక్ష వస్తువుని సాధించటాన్నే తర్కం అంటాము, ఆ విధంగా ఆ వస్తువు యొక్క తత్వాన్ని క్షుణ్ణంగా తెలుసుకోగలం.

## నిర్ణయం

ప్రశ్న: నిగమనమూ, నిర్ణయమూ ఒకటేకదా?

జ: కాదు, ప్రతిజ్ఞను ఋజువు చేసేది నిగమనం, మనవూహల్ని మనమే సందేహించి, వివిధ సాధనాలద్వారా వాటిని పరీక్షించి సత్యార్థాన్ని గ్రహించటమే నిర్ణయం. పక్షాన్నీ ప్రతిపక్షాన్నీ సమంగా ఊహించి. తర్కించి చేసేదే సరియైన నిర్ణయమవుతుంది.

# రెండవ ఆహ్నికము

ప్రశ్న: వాదం అంటే ఏమిటి? దాని లక్షణం చెప్పండి?

జ: వాదం ( Discourse ) అనగా ఒక విషయం గురించి చేసే చర్చ. ఏదయినా విషయాన్ని ప్రతిపాదించే వాడు వాది. దానిని విమర్శించే వాడు అనువాది. దానిని ఖండించేవాడు ప్రతివాది. అనువాద మనగా అనుసరించి చేసే విమర్శ. ప్రతివాదము అనగా ఖండన. వాదాను వాదాలు (Assertion and criticism) వస్తువును సమగ్రంగా తెలుసు కోవటానికి ఉపయోగపడతాయి, వాద ప్రతివాదాలువివాదాన్ని ( Dispute ) కలిగి ఉంటాయి

సిద్ధాంతాన్ని బలపరచుకునే ప్రయత్నం వాది సాగిస్తే, దానిని భిన్నకోణంలో చూడటానికి అనువాది ప్రయత్నిస్తారు, అయితే అనువాది బాధ్యత యెక్కువ. అతడు అనువాదంలో ప్రత్యక్షాది ప్రమాణాలను అతిక్రమించకూడదు సిద్ధాంతాన్ని విడిచి సాధనచెయ్యకూడదు, వాది అనువాదు లిద్దరూ ప్రతిజ్ఞ హేతువు ఉదాహరణ, ఉపనయం. నిగమనం అను అయిదు అవయవాలను క్రమపద్ధతిలో అనుసరించాలి అలా ఉభయపక్షాలు అనుసరించి చర్చించినప్పుడే వాద ( Discourse ) మని పించుకుంటుంది

తత్వనిర్ణయం లక్ష్యంగా ఈ వాదం జరుగుతుంది. ఇందులో వాది అనువాదులలో ఒకరు జయించటం, రెండవవారు జయింపబడటం అంటూ ఉండదు ఉభయులూ విషయాన్ని విభిన్న కోణాలనుంచి పరిశీలించటమే జరుగుతుంది. ఫలం వస్తుతత్వజ్ఞానమే గనుక ఈ రకం వాదానికి వార్తా లాపమనీ, కథ అని పేర్లున్నాయి

ఏమిటి కథ? అంటే మీచర్చయొక్క విశ్చతార్థం ఏమిటని అర్థం. గురుశిష్యులు. సహాధ్యాయులూ ఈ విధమైన వాదాన్ని పెట్టుకుని విష యతత్వాన్ని బహుకోణాల దర్శిస్తారు. అది సమిష్టి కృషి.

జల్పం:

ప్రశ్న: "జల్పం" అంటే ఏమిటి? దానికి వాదానికీ తేడా ఏమిటి?

జ: వాది తన వాదాన్ని బలపరచుకోవటానికి తగిన ఉపపత్తుల్ని వెతుక్కుంటాడు. అలాగే ప్రతివాది. వాది వాదాన్ని ఖండించి. వాది వినియోగించిన ఉపపత్తుల్ని కూడా ఖండిస్తాడు. ఇందులో ఎవరి వాదా న్ని వారు బలపరచుకోవటం కోసం చూస్తారు. ఎదుటి వ్యక్తి వాదాన్ని దెబ్బతీయటం కోసం ప్రయత్నిస్తారు, ఈ ప్రయత్నంలో జిజ్ఞాస ఉండదు. సత్యాన్వేషణకూడా ఉండదు. కేవలం పాండిత్య ప్రకర్ష మాత్రమే ఉంటుంది. ఒకరు వాడిన శబ్దాలకు ఒకరు పెడార్థాలు తీసి అవహేళన చేయటానికి ప్రయత్నిస్తారు. ఈ ప్రయోగాన్ని "ఛలం" (Preversing the sense of words) అని అంటారు.

ఆలాగే ఎదుటి వాడికి తికమక కలిగేలా అఖర్లేని విషయాలను కలగాపులగం చేసి తన అభిప్రాయమేమిటో సరిగా అవగాహన కాకుండా చెప్పే విధానాన్ని "జాతి" ( Confusing reply ) అంటాము

ఇక అప్రస్తుత ప్రసంగం చేస్తూ వాది ప్రశ్నకు సూటి సమాధానం చెప్పకుండా కొందరు దాటేస్తారు. జవాబు చెప్పటానికి లేని పరిస్థితి అది ఆరకం పరిస్థితులనే నిగ్రహస్థానాలని (Avasions) టాము. ఇవి ప్రతివాద లక్షణాలు.

వితండం

ప్రశ్న: వితండవాదమంటారేమిటి?

జ : వితండ (Captious objection) వాదం చిత్రమైనది. వాది చేసిన వాదాన్ని తూర్పారబట్టి, దానిని సహేతుకంగా ఖండించి, ప్రతిపక్ష స్థాపన చెయ్యాలి. అలా ప్రతిపక్షాన్ని నిర్మించకుండా వాది అభిప్రాయాల్ని మాత్రమే ఖండించి ఊరుకోవడం వితండమవుతుంది. It is idly carping at the arguments and assertions of another without attempting to prove the opposite side of the question. ఇందులో వాది అభిప్రాయాన్ని తిరస్కరించడమేగాని దానికి వ్యతిరేక అభిప్రాయాన్ని స్థాపించటం జరగదు.

## హేత్వాభాస

ప్రశ్న : హేత్వాభాస అంటే ఏమిటి? అది ఎన్ని రకాలు?

జ : హేత్వాభాస అంటే మనం చెప్పిన హేతువు బలమయినది కాకపోవడం. (Semblance of argument) ఆ చెప్పిన హేతువులు ఆ వాదాన్ని సరిగా బలపరచలేవు హేత్వాభాస అయిదు రకాలుగా కనిపిస్తున్నది.

1. వ్యభిచారి : (Deviation) సాధ్యంలేని హేతువును వ్యభిచారి అంటాము. సాధ్యానికి అసాధ్యానికి ఒకే హేతువు పనిచేస్తుంది. అప్పుడే అది అభాసకు పాల్పడుతుంది.

ఉదాహరణకి : శబ్దం నిత్యం స్పర్శకు అందదు కనుక. అని అన్నారు అనుకుందాం. దానికి వ్యతిరేకం శబ్దం అనిత్యం. స్పర్శకు అందదు కనుక అవుతుంది. శబ్దానికి నిత్యత్వం సాధింపబడింది. సాధ్యమే. నిత్యత్వం సాధ్యమయితే అనిత్యత్వం అసాధ్యమయింది. శబ్దం స్పర్శకు అందదు అనటం తప్పు. స్పర్శకు అందనివి నిత్యమయినట్లే అనిత్యం కూడా అవుతాయి. అనిత్యానికి కూడా వర్తించే 'స్పర్శకు అందదు' అనే హేతువు సాధ్యమయిన శబ్దనిత్యత్వానికీ అసాధ్య అనిత్యత్వానికి ఒకే విధంగా వర్తించటంవల్ల ఆ హేతువుకు వ్యభిచారదోషం కలిగింది.

## విరుద్ధ

ప్రశ్న : రెండవ రకం ఏమిటి?

జ : రెండవ దానిని విరుద్ధ హేత్వాభాస అంటాము. ఇది పరస్పర విరుద్ధ (Contradiction) వచనాలలో కనిపిస్తుంది. ఏ ధర్మాన్ని సా స్తామో అది సాధ్యమనబడుతుంది సాధ్యమయిన విషయమే సిద్ధాం మనబడుతుంది

ఉదా : ఈ చెరువులో నిప్పు ఉంది. అందుకే నీళ్ళు యింత వేడిగ ఉన్నాయి. అది చెరువే అయినా అందులో నిప్పును సాధించాము. అయినా నీళ్ళు ఉన్నాయంటున్నాము నీళ్ళలో నిప్పు ఉండదు. నిప్పు ఉంటే అది చెరువే కాదు.

## ప్రకరణం

ప్రశ్న : మూడవదేమిటి?

జ : మూడవ దానిని ప్రకరణసమమని అంటాము. వాది ప్రతి వాదులిద్దరు ఒకే అంశంపై సమానశక్తివంతమయిన పరస్పర విరుద్ధ అభి ప్రాయాలను ప్రతిపాదించటాన్ని ప్రకరణసమమని వాత్స్యాయను డన్నాడు.

ప్రకరణమనగా ( Treatment ) ప్రతిపాదించిన విధానం. వాది ప్రతివాదులిద్దరు పరస్పరవ్యతిరేక ప్రతివాదనల్ని ఒకే విధంగా చేస్తే అది ప్రకరణసమ మనిపించుకుంటుంది. అక్కడ నుంచి కథ కదలదు. ( An assertion by two opponents of some argument which has the same force of the argument pro and con )

ఉదా: శబ్దానికి నిత్యధర్మం లభించటం లేదు. కనుక శబ్దం అ నిత్యమే అంటాడు వాది. శబ్దానికి అనిత్యధర్మం లభించటం లేదు

కనుక శబ్దం నిత్యమే అంటాడు ప్రతివాది. ఈ రెండూ పరస్పర విరుద్ధ వాదాలే రెండూ సమంగా శక్తివంతాలే, ఇక ఆ కథ అంతే

అలాగే శబ్దంఅనిత్యమని వాది అంటాడు, అతని దృష్టిలో శబ్దానికి అర్థం ధ్వని. శబ్దం నిత్యమని ప్రతివాది అంటాడు అతని దృష్టిలో శబ్దమనగా అక్షర రూపంలో ఉండేపదం ఈ యిద్దరివాదాలకు హేతువులున్నాయి. విరుద్ధ అర్థాలను బలపరుస్తున్నాయి. వీటి నుండి శబ్దంయొక్క నిత్యా నిత్యస్థితి సాధింపబడి మరో హేతుపవుతున్నది. అలాకావటాన్ని కూడా ప్రకరణ సమం అని చెప్పుకోవచ్చు

## సాధ్యసమం :

ప్రశ్న? పై రెండు ఉదాహరణలలోనూ హేతువుసాధ్యం కాకుంతా చేయలేమా?

జ: చేయవచ్చు ఏ హేతువు సాధ్యంకాదో ఆ హేతువును అపాదించి, అది సాధ్యమయి ఉన్నట్లుగానే ప్రతిపాదన చేస్తే, అది సాధ్య సమహేత్వాభాస అనిపించుకుంటుంది.

సాధ్యసమం ( Petitio principle ) రుజువు చేయవలసిన అంశంలో తాదాత్మ్యమయి ఉంటే ప్రతిపాద్య విషయాన్ని సాధ్యసమం అంటారు. It is an assertion identical with the point to be proved. దానికే హేత్వాభాస చేరింది.

ఉదా: చీకటి పోయింది.

చీకటి ఎలా పోయింది? నడిచిపోయిందా? నీరులా ప్రవహిస్తూ పోయిందా? గాలిలో ఎగిరిపోయిందా? ఆవిరిలా ఇగిరిపోయిందా?

ఇగిరిపోయిందా అనుకుంటే చీకటి ఆవిరై ఉండాలి. నడిచిపోయిందనుకుంటే దానికి కాళ్ళుండాలి ప్రవహించి పోయిందంటే అది ద్రవం

కావాలి. ఎగిరిపోయిందంటే దానికి రెక్కలుండాలి.

చీకటికి కాళ్ళు, రెక్కలూ ఉన్నాయంటే ఎవరూ అంగీకరించరు. అయినా అది పోయింది. కనుక కాళ్ళూ, రెక్కలూఉన్నట్లు లేదా ద్రవమైనట్లూ సాధింప బడిందన్నమాట. నిజంగాదానికవి లేవు. ఉన్నట్లే వ్యవహరిస్తున్నాము గదా.

అందుకే చీకటి ద్రవం. గతికలదగుటవలన,- అని ఎవరైనా వాదిస్తే ఆ హేతువు అభాసపాలవుతుంది.

## కాలాతీతము :

ప్రశ్న? ఎందుకొచ్చిన వాదమిది? చీకటి పోనేపోయిందికదా। కాలాతీతమయింది.

జ: సంఘటనికీ కాలానికీ సంబంధంలేని పరిస్థితినే కాలాతీతమంటాము

మెరుపు మిరుమిట్లు గొలిపింది. కాసేప్పటికి ఉరుము ఉరిమింది. ఉరుము వినబడగానే పిడుగు పడిందనుకుంటాము. పిడుగు ఎప్పుడో పడింది. మెరుపు మెరవగానే పడింది. ఆతర్వాతనే ఉరుము వినబడింది. పిడుగుకు ఉరుము కాలాతీత హేత్వాభాస.

## ఛలం :

ప్రశ్న ? ఛలం అంటే ఏమిటి?

జ: వచనవిఘాత అర్ధ వికల్పోపపత్త్యాఛలం అని నిర్వచనం, ఒక శబ్దాన్ని వాది ఒక అర్ధంతో వాడాననుకుందా.. అదేవో ప్రతివాదికి తెలుసు, కాని, ఆ శబ్దానికి మరో అర్ధం తీసి వాది చెప్పిన వాక్యాన్ని చెడగొట్టడమే "ఛలం" అనిపించుకుంటుంది.

ప్రశ్న: ఈ ఛలంలో భేదాలేమన్నా ఉన్నాయా? ఉంటే అవి ఏవి?

జ: ఛలం మూడు రకాలుగా ఉన్నది 1. వాక్ఛలం 2 సామాన్యచ్ఛలం 3. ఉపచారచ్ఛలం అని మూడు రకాలు.

పశ్న: వాక్ఛలానికి ఉదాహరణ చెప్పండి ?

జ: కొన్ని శద్దాలు అవిశేషహితాలు అనగా అవి అనేకార్ధాలను యిస్తాయి వాది ఒక శబ్దాన్ని ఒక అర్ధంలో ప్రయోగిస్తే ప్రతివాది మరో అర్ధాన్ని తీసుకొని వాది వాక్యానికి విఘాతం కలిగిస్తాడు. ఇందులో అర్ధాంతర కల్పన జరుగుతుంది.

ఉదాహరణకి ఒకానొక సంగీత సభలో జగదాంబ సంగీత కచేరి చేస్తున్నది. వేలకు వేలు జనం హర్షధ్వానాలు చేస్తున్నారు. మీరు విన్నారు "జగదాంబ గాత్రం బాగుంది" అన్నారు మీ మిత్రుడితో. ఆమె కంఠం వసంతకోకిలకంఠంలా ఉన్నదని మీ అభిప్రాయం. వేంటనే మీ మిత్రుడు అందుకొని "అయితే ఆమెను రమించవలసిందే" అన్నాడు. గాత్రానికి శరీరమని మరో అర్ధం ఉంది. మీకు కోపం వచ్చినమాట నిజం; కాని ఏం చేస్తారు? మీ మిత్రుడు మీరామె శరీరపు సోయగాన్ని మెచ్చుకుంటున్నట్లుగా భావించి, మీ వాక్యాన్ని విచ్ఛిన్నంచేశాడన్న మాట, ఇదీ వాక్ఛలం అంటే.

పశ్న: సామాన్య ఛలానికి ఉదాహరణ చెప్పండి?

జ: మీరేదో గొప్ప విషయాన్ని మాట్లాడుతూంటే. దానిలోతులు తెల్సుకోకుండా తేలికగా తీసుకొని చెత్తగా వ్యాఖ్యానించటం సామాన్య ఛలం అని అంటారు.

ఉదా; కవులు తపస్సంపన్నులు, నిత్యయోచనాపరులు. రస సంపన్నులు: ఋషి కాని వాడు కవి కాలేడు. అని వాది అంటాడు.

"అందుకే కాబోలు కవులు గెడ్డం గీసుకోరు" అని ప్రతివాది అంటాడు. వాదం యొక్క తీవ్రత ( సీరియస్‌నెస్ ) ను ప్రతివాది తృణీకరించాడన్నమాట.

ప్రశ్న: ఉపచారచ్ఛలం అంటే ఎలా ఉంటుంది?

జ: ఒకదాని ధర్మాన్ని మరొకదానికి అపాదించేది కావ్యభాష. ఇది లోక వ్యవహారంలో ఉంటుంది. దానిని అంగీకరించకుండా పట్టుకు సాగదీసి అర్ధ సద్భావంలేదని ఆక్షేపించటం ఉపచారచ్ఛలమవుతుంది.

ఉదా: బస్సుమీద వెడితే అరగంటలో పిఠాపురం వస్తుంది. అన్నాడొక పెద్ద మనిషి. "ఆ పిఠాపురం వస్తూవుంటే మీ రెందుకు బస్సుమీద వెళ్ళటం? అదిరాదు కనుకనే మీరు బస్సు ఎక్కి వెళ్ళాలి. పిఠాపురం రావటానికి దానికి కాళ్ళు ఉన్నాయా? అని ప్రతివాది ఆక్షేపిస్తాడు వాది నిరుత్తరుడై పోతాడు.

ప్రశ్న : వాక్ఛలమూ, ఉపచారచ్ఛలమూ, ఒకటికావా? ఆ రెండింటికీ తేడా స్పష్టంగా లేదుగదా!

జ : వాది ప్రయోగించిన శబ్దానికి అర్థాంతరాన్ని తీసుకోవడం వాక్ఛలమయింది. ఉపచారచ్ఛలం అలాకాదు వాది వాడిన శబ్దం అసందర్భమని ఆక్షేపించటం—కనుక ఈ రెండూ ఒకటికావు. మొదటి దానిలో అర్థాంతరాన్ని తీసుకున్న ప్రతివాది, రెండవ దానిలో యదార్థాన్ని తీసుకున్నాడు. ఈ తేడా ముఖ్యంగా గమనించదగ్గది.

ప్రశ్న : ఈ తేడా చాలా అల్పమని నా అభిప్రాయం.

జ : అల్పబుద్ధికి అలాగే తోస్తుంది. తేడా ఎంత కొద్దిగా ఉన్నా బుద్ధిమంతులు రెండింటినీ వేరువేరుగా చెపుతారు.

ప్రశ్న : అల్పమయిన తేడాను సైతం గ్రహించగల బుద్ధినే అల్పబుద్ధి అంటారేమో?

జ : సూక్ష్మబుద్ధి అంటారు. అల్పమైన తేడాను గ్రహించలేని బుద్ధినే అల్పబుద్ధి అంటాము. కోపగించుకోవద్దు ఇది ఛలప్రకరణమ్: అందుకే చమత్కారంగా అన్నాను.

శబ్దానికి రెండు వృత్తులున్నాయి, శక్తి, లక్షణ అని. శక్తి ముఖ్య వృత్తి. లక్షణ గౌణవృత్తి

ఉదా: ఊరు గోల పెట్టింది.

అంటే ఊళ్ళోని మనుష్యులు గోలపెటారని అర్ధం. మనుష్యులు లేకుండా ఊరు ఉండదు కదా!

ప్రశ్న : అది బాగానే ఉంది. కాని, మీరు 'బస్సు ఎక్కి వెడితే అరగంటలో పిఠాపురం వస్తుంది, అన్నారు. అది దోషంకాదా?

జ : కాదు. మీరు బస్సు ఎక్కి వెడితే అరగంటలో మీ బస్సు పిఠాపురానికి వస్తుంది. అని అర్ధం. అదీ లక్షణ

## జాతి

ప్రశ్న : సూక్ష్మమంటే చాలా చిన్నదనేకదా అర్ధం. అల్పమన్నా అదే అర్ధం నా అల్పబుద్ధికి మీ సూక్ష్మబుద్ధికి తేడా లేదంటాను.

జ : బాగా అన్నావు తర్కభేదాలలో జాతి అని చెప్పబడుతున్న వాదం ఇదే. (It is a induction of fractions to a common denominator, founded merely on similarity or dissimilarity)

జాతి లక్షణాన్ని నీకు ఎలా తెలియజెప్పడమా అని ఆలోచిస్తుంటే నువ్వే దానికి ఉదాహరణ చెప్పావు.

సూక్ష్మబుద్ధి అనగా అతి సూక్ష్మమయిన తారతమ్యాన్ని సైతం గ్రహించగల బుద్ధి అని అర్థం (Keen mind)

అల్పబుద్ధి అనగా తెలివి తక్కువ అని అర్థం. (Feeble mind)

ఇవి ఆ రెండు శబ్దాలకూ ఉండే విశేషార్థాలు. అయితే ఆ రెంటింటికి సామాన్యార్థం ఒక్కటే, సూక్ష్మమన్నా, అల్పమన్నా అతి తక్కువ అని. అర్థసామాన్యతను తీసుకొని నీవు నన్ను టకాయించావు. అది నీ "జాతి" లక్షణం.

ప్రశ్న : మీరు అర్థభేదాన్ని దృష్టిలో పెట్టుకుని నన్ను టకాయించలేదా ? అది మీ జాతి లక్షణం.

జ : అవును. ఈ రకం జాతిలక్షణాన్నే మహర్షి చక్కగా నిర్వచించాడు. సాధర్మ్యవైధర్మ్యాభ్యాం ప్రత్యవస్థానం జాతిః-అని.

రెండు శబ్దాలకు సమానార్థత ఉంటుంది అన్నావు కదా. సూక్ష్మమన్నా, అల్పమన్నా ఒకటేనని, దానినే సాధర్మ్యం అంటాము.

ఆ రెండు శబ్దాలకూ అర్థభేదం ఉంటుంది సూక్ష్మమంటే నిశితమనీ, అల్పమంటే నీచమనీ వేరే అర్థాలున్నాయి. ఇది వైధర్మ్యం.

ఈ శబ్దానికున్న సాధర్మ్యాన్నీ, వైధర్మ్యాన్నీ వినియోగించుకొని, ఎదుటి వ్యక్తి స్థాపించిన సాధ్యధర్మాన్ని ఖండించటమే "జాతి" ( A confusing reply )

## నిగ్రహం :

పశ్న: మాట్లాడవేమి? విప్రతిపత్తి రప్రతిపత్తిశ్చ నిగ్రహస్థానమ్ అని నిగ్రహానికి వ్యుత్పత్తి. నేను చెప్పిన దానిని సరిగా గ్రహిం

చలేక పోగా దానిని విరుద్ధంగా గ్రహించడం విప్రతిపత్తి. దానిని ఖండిస్తూ నేనుచెప్పే సరికి తిరిగి, నోరు మెదపలేకపోవటం అప్రతిపత్తి. ఈ విరుత్తరస్థితినే "విగ్రహస్థానం" అంటాము.

ప్రశ్న: రెండుశబ్దాలకున్న అర్థాలలో సాధర్మ్యమూ, వైధర్మ్యమూ ఉండటంకనిపిస్తూనే ఉంది. అర్థమే శబ్దానికి అంగం, అదే అర్థాంగి. ప్రతి శబ్దానికి నానార్థాలున్నాయి. ఇది బహుపత్నీత్వం కాదా?

జ: ఒకే 'అర్థాన్ని వ్యక్తంచేసే శబ్దాలు చాలా ఉన్నాయి. సలిలం, జలం, ఉదకం నీరు, నారి - ఇవన్నీ ఒకే అర్థానికి పర్యాయపదాలు. ఇది బహుభర్తృత్వంకాదా? మాట్లాడరేమి?

ఇది ప్రకృతి. అందుకు భిన్నమయినది వికృతి.



# మూడవ ఆహ్నికము

ప్రశ్న: జన్మ ప్రవృత్తియగు మిథ్యాజ్ఞానాన్ని పోగొట్టి జ్ఞానోదయం కలిగించేందుకు సాధనాలయిన ప్రమాణాది పదహారు పదార్థాలను మీరు వివరించారు. అయినా ఎందుకో నన్ను "సంశయం" విడిచిపెట్టటం లేదు. సాధనాలయితే చూపించారుగాని ప్రయోగాన్ని చూపించాలి సాధ్యాన్ని పేర్కొననూ లేదు,

జ: బుద్ధిని మేల్కొల్పటానికే ఇవి సాధనాలు. మేల్కొన్నాక బుద్ధి దానికదే తపస్సు ప్రారంభిస్తుంది. ఎవరి తపఃఫలం వారిదే నాయనా!

ప్రశ్న: సంశయం లేకుండా పోవాలంటే ఏమిటి?

జ: మనుష్యులంతా ఒకే జాతి. కనుక సామాన్యధర్మం. అందులో గోవిందుడొకడు. అతని ముక్కు మొకమూ తీరు వేరు, అది అసాధారణ ధర్మం. ఈ అసాధారణ ధర్మాన్ని బట్టి సమానధర్మం గల మనుష్యుల మధ్య గోవిందుణ్ని ఇట్టే గుర్తు పట్టగలము. అది నిశ్చయ జ్ఞానము. దీనివల్లనే సంశయం కలగదు

సాధారణధర్మాలనుబటి తెల్లవాడు, నల్లవాడు, పచ్చవాడు, ఎర్రవాడు, కలిసి ఉన్నా వానిని మనుష్యులనే అంటాము. అసాధారణ ధర్మమైన రంగును బట్టి కాకసాయిడ్, నీగ్రాయిడ్, మంగోలాయిడ్, ఆస్ట్రలాయిడ్ అని విభజిస్తాము.

కనుక సాధారణ ధర్మం వల్లనూ నిశ్చయజ్ఞానం కలుగుతుంది. అసాధారణ ధర్మంవల్లనూ నిశ్చయజ్ఞానం కలుగుతుంది. ఇది నిస్సంశయం.

ప్రశ్న: వస్తువులు ప్రత్యక్షాలే, కనుక సాధర్మ్యాన్నో వైధర్మ్యాన్నో ఆధారంగా తీసుకొని వాటిని గుర్తించగలం. శబ్దం అలాకాదు. దానికి నానార్థాలున్నాయి, కనుక అది వ్యభిచారి. ఒకే అర్థాన్ని పొందిన శబ్దాలుకూడా అసంఖ్యాకంగా ఉన్నాయి. వాటిని పర్యాయశబ్దాలని మీరు అన్నారు అర్థంకూడా వ్యభిచారే కనుక శబ్దం సంశయాత్మకం కాదా?

జ: అది శబ్దశక్తి. లక్షణ, వ్యంజన, అభిద అని మూడు భాగాలుగా వ్యక్తమవుతుంది. "కాస్త బుర్రతోఆలోచించండి" అంటున్నాను. ఇక్కడ బుర్రఅనేమాట బుద్ధికి ప్రత్యామ్నాయంగా వాడాను. ఇది లక్షణం ( Use of a word for another word with a cognate meaning Here. "HEAD" for "Intellect" ) నిజంగా బుర్ర ఉన్న వాడికి ఇందులో సంశయం కలగదు. ఇక అభిద అనగా వ్యుత్పత్తి ( Proper sense ). రుద్రుడు అనే శబ్దం ఉంది. రోదయితి రుద్రః అని వ్యుత్పత్తి ఏడ్చేవాడని అర్థం. రుద్రులు అనే మాటకు ( Suggestive sense ) ఉంది. దానినే వ్యంజన అంటారు. ఆ అర్థంలో పశువులు అని అర్థం అవి ఏడుస్తాయి గాని మాట్లాడవు. ఇక వ్యవహారార్థంఉంది. రుద్రుడు అనగా ఈశ్వరుడు, పశుపతి. శబ్దశక్తి నెరిగినవాడికి సంశయంలేదు.

ప్రశ్న: విరుద్ధ వస్తుజ్ఞానాన్ని మీరు "విప్రతిపత్తి" అన్నారు. దానివల్ల సంశయం కలగదా?

జ: రెండుపరస్పర విరుద్ధ వ్యవస్థలను చూసినప్పుడే వాద వైరుధ్యాన్ని గ్రహిస్తాము. అది విప్రతిపత్తి తేజస్వంతమైన పగలు ఒక వ్యవస్థ. అంధకారబంధురమైన రాత్రి ఒక వ్యవస్థ. ఈ రెండూ పరస్పర భిన్నమైనవి. అందులో సంశయమేముంటుంది?

పశ్న : రాత్రింబవళ్ళు వేర్వేరు వ్యవస్థలే. కాదనను: కాని ఒకటి ఉన్నప్పుడు రెండవది ఉండదు. పగలు ఉన్నప్పుడు రాత్రి ఉండదు. అనగా ఒకటి ఉపలబ్ధమయినప్పుడు రెండవది ఉపలబ్ధంకాదు. ఆ రెండవది సంశయమేకదా!

జ: కాదు. ఒకటి కొంతసేపే ప్రతిష్ఠితమయి ఉంటుంది. రెండవది ఆ తర్వాత ప్రతిష్ఠిత మవుతుంది. అనుభవజ్ఞానాన్ని పురస్కరించుకుని సంశయాన్ని పోగొట్టుకుంటాము.

పశ్న : వెలుతురూ చీకటీ కలిసిన సంధ్యలున్నవి. అవి సంశయాత్మకాలు కావా?

జ: కావు. రానురాను చీకటి తొలగిపోయేది ఉదయ సంధ్య. రానురాను వెలుతురు తొలగిపోయేది సాయంసంధ్య. వివేకంతో సంశయం తొలగిపోతుంది.

ఒక వెండి కంచము. ఒక బంగారు కంచమూ ఉన్నాయి. అది వెండనీ. ఇది బంగారమనీ మనకు తెలుసు. అది విప్రతిపత్తి, ఇక సంశయం ఎందుకు కలుగుతుంది? అలాగే రెండు బంగారు కంచాలను చూపినా సంశయం కలగదు. సాధర్మ్యం వలన.

ప్రశ్న? విప్రతిపత్తి వల్ల సంశయం కలగకపోవటానికి కారణమేమిటి?

జ: రాత్రి ఒక వ్యవస్థ పగలు ఒక వ్యవస్థ. ఈ రెండూ ఉన్నవి. అవి పరస్పర విరుద్ధంగా ఉన్నాయను అంగీకారమే (సంప్రతిపత్తి) సంశయాన్ని కలిగించదు. విప్రతిపత్తౌచసంప్రతిపత్తేః అని చెపుతున్నాము. వ్యవస్థలు విరుద్ధమైనా వాటికి సంబంధించి మన మనసుకు లభించిన విజ్ఞానం ఒకటే కదా. రాత్రింబవళ్ళు వేర్వేరని. రాత్రికి సంబంధించిన

జ్ఞానంవేరు. పగలుకు సంబంధించిన జ్ఞానంవేరు ఆ రెండిటివి విప్రతిపత్తి. రాత్రింబవళ్ళు వేరు అను ఏకజ్ఞానం వెంటనే కలుగుతుంది. అది సంప్రతిపత్తి (Agreement) ఇక సంశయం దేనికి?

ప్రశ్న : ఉపలబ్ధి అవ్యవస్థ సంశయ హేతువని వాత్స్యాయను డన్నాడు. చెరువు గట్టును చూచి చెరువంటాము. అందులో నీరులేదు. నీరులేకుండా ఉన్నదానిని చెరువని ఎట్లా అంటాము? ఇది సంశయంకాదా?

జ : అవ్యవస్థయందు వ్యవస్థితము ప్రతిష్ఠితమై ఉన్నందున సంశయం కలగదు. ఇప్పుడు ఆ చెరువులోనీరు లేకపోవచ్చు. ఒకప్పుడు ఉండేది. మళ్ళీ వర్షాలు కురిస్తే ఉంటుంది అందుకే అది చెరువు. ప్రస్తుతం నీరులేకపోయినా (అవ్యవస్థ) ముందయినా నీరుండే అవకాశం ఉంది గనుక (వ్యవస్థ) సంశయానికి ఆస్కారంలేదు.

ప్రశ్న : సమానధర్మ ఉపపత్తి వలన సంశయం కలగదని మీరంటున్నారు. రెండు బంగారపు కంచాలున్నవి. అందులో ఒకటి బంగారపు పూత పూసింది కావచ్చుగదా! సమానధర్మాలుగల రెండు వస్తువుల విషయంలో సంశయం కలగటమంటూ జరిగితే అది అత్యంత సంశయం (extreme doubt) అయి తీరుతుంది.

ప్రశ్న : సంశయం ఎందుకు కలుగుతుంది?

జ : ఉపలబ్ధి అవ్యవస్థ, అనుపలబ్ధి అవ్యవస్థ అను రెండూ సంశయస్థానాలని వాత్స్యాయను డన్నాడు. కనుక సంశయం కలగకపోవటం గాని, అత్యంత సంశయం లేకుండా పోవటంగాని జరగవు సంశయం కలిగినప్పుడె విశేషం మీద కుతూహలం కలుగుతుంది.

జ : అదికాదు. రెండు వస్తువుల సమాన ధర్మాలను గ్రహిస్తున్నంతసేపు సంశయం కలగదంటున్నాను. ఏదైనా విశేషధర్మం ఒక

వస్తువులో కనపడినప్పుడే సంశయం కలుగుతుంది. ఆ సంశయాన్ని తీర్చుకునేదాకా మనస్సు ఊరట పొందదు. కనుకనే అది అత్యంత సంశయమన్నారు. సంశయం కనబడినప్పుడు విశేషంమీద కుతూహలం కలుగుతుందని మీరన్నారు. విశేషం కనబడినప్పుడే సంశయం పోతుందని నేనంటున్నాను. ఈ రెండింటికీ తేడా ఉంది. సామాన్య ధర్మాలు గల రెండు వస్తువులలో ఒకదానిలో ఎప్పుడయితే విశేషధర్మం కనబడిందో అప్పుడే సంశయవిచ్ఛేదం కలుగుతోందిగదా! ఇక అత్యంత సంశయం అనగా ఎప్పటికీ తొలగని సంశయం అనే సమస్యలేదు. నిస్సంశయంగా అవి వేర్వేరు ధర్మాలుగల వస్తువులని గ్రహించాలి.

ప్రశ్న : ఏ విశేషధర్మమూ కనబడకపోయినా పూర్వానుభవాన్నిబట్టి ఆ రెండు వస్తువులూగాని, అందులో ఏ ఒక్కటైనాగాని నిజమైనది కాదేమోనన్న అభిప్రాయం సంశయాత్మకు కలుగుతుంది.

జ : నిత్య శంకితుడు దుఃఖ భాగి. అత్యంత సంశయాత్మ అలాంటిది. బుద్ధిమంతుడు సంశయము కలిగిన వెంటనే పరీక్షకు పూనుకుంటాడు. సంశయాన్ని పోగొట్టుకుంటాడు.

ప్రశ్న : విషయం నాకు సరిగా అర్థంకాలేదు. కనుక ఉదాహరణపూర్వకంగా వివరించమని కోరుతున్నాను.

జః సంశయ కారణాలున్నంతసేపూ సంశయం ఉండేమాట నిజమే కాని, మనిషి సంశయాత్ముడై అలా ఉండిపోతాడా, సంశయం కలగగానే విశేష ధర్మాలను పరీక్షించి చూడటం ప్రారంభిస్తాడు.

సమాన ధర్మాలున్నప్పటికీ సంశయం కలిగిందికదా, కనుక సంశయం కలగకపోవటమంటూ లేదు కలిగిన వెంటనే పరీక్షించటానికి పూనుకుంటాడు. కనుక అత్యంత సంశయమంటూ ఎప్పుడే అవకాశం

లేదు. అవి శేషధర్మాలు లభించగానే సంశయనివృత్తి అవుతుంది. విశేష ధర్మాలు లభించకపోయినా సంశయ నివృత్తి అవుతుంది.

రెండూ బంగారపు పళ్ళెల వలే ఉన్నాయి. అవునో కాదో అన్న సంశయం కలిగింది. మోతపెట్టిస్తే తేలిపోతుంది గదా! కంచు మ్రోగు నట్లు కనకం మ్రోగుతుందా? అంతటితో ఆ సంశయం తీరుతుంది.

నోటిలో చుట్టపెట్టుకొని, తలకు పాగా చుట్టుకొని చేతిలో కర్రను ఊతగా తీసుకొని, గోచీ పెట్టుకొని నిలుచున్న మనిషి సంధ్యాసమ యంలో కనిపించాడు. అతని ప్రక్క సరిగా అదేవేషంలో మరొకడు అలాగే నిలబడి ఉన్నాడు. అందులో ఒకటి విగ్రహం. ఒకటి నిజం మనిషే. మొదట్లో సంశయం కలగదు. సమాన ధర్మాలు కనిపిస్తు న్నాయిగదా! సంశయం కలిగినవెంటనే ఒక విగ్రహం పొట్ట మీద చెయ్యివేస్తే చల్లగా రాయిలా ఉంది. రెండవ విగ్రహం మీద చెయ్యి వేస్తే వెచ్చగా, మెత్తగా తగిలింది. సంశయం తీరిపోయింది గదా, ఏది రాయో ఏది మనిషో తేలిపోయింది ఈ మెత్తదనం, వెచ్చదనంవంటి విశేషధర్మాలను ఒకదానిలో గ్రహించగానే అది మనిషే అనుకున్నాం. కాఠిన్యమూ, చల్లదనమూ సోకే సరికి రెండవది నిజమైన విగ్రహమను కున్నాము సంశయం తేలిపోయింది.

ఎవరైనా ఏ సందర్భంలోనయినా ఒకవిషయాన్ని సంశయాత్మక మని ఖండిస్తే సహించకూడదు. తక్షణం ఆ సంశయాన్ని తీర్చుకొని మాట్లాడమనాలి. వాదం నిస్సంశయంగా సాగాలేగాని, సంశయాత్మకం గా సాగకూడదు. అవునో, కాదో తెగేసిచెప్పాలి సంశయం ఉందంటే పరీక్షించి చెప్పమనాలి,

ప్రశ్న: ఒకడు తనకు సంశయంకలగగానే వస్తువును పరీక్షచేయ కుండా అలాగే సంశయంలో ఉండిపోతాడు. వాడిది అత్యంత సంశయ మేకాదా.

జ: అలా ఉండిపోడు, సంశయాత్మా వినశ్యతి అని పెద్దలన్నారు. వాడు సంశయంలోనే నశించిపోతాడు. అది అతి అంతం కావచ్చు.

ప్రశ్న: ఈసారి బాగా అర్థమయిందండీ, సంశయచ్ఛేదమయి పోయింది.

## 2. ప్రమాణ పరీక్ష :

ప్రశ్న? యదార్థ వస్తుజ్ఞానానే "ప్రమ" అంటాము. మాయా వస్తువులు "భ్రమ"లు, ఎండమావులు భ్రమలేకదా ప్రమాణం అంటే ఏమిటి?

జ: వస్తువుకు సంబంధించిన జ్ఞానాన్ని పొందేసాధనం. కళ్ళతో చూడటం, చెవులతో వినటం, ముక్కుతో వాసనచూడటం, నాలుకతో రుచి చూడటం, చేతితో స్పర్శించటం ద్వారా ప్రత్యక్షజ్ఞానాన్ని పొందుతాము. కనుక కళ్ళు, చెవులు, ముక్కు, నాలుక, చర్మం ప్రమాణాలు, సొంతడుతో ఊహించి, అనుభవపూర్వకంగా చేసే నిర్ణయాలు అనుమాన ప్రమాణాలు ఒకదాని స్వభావాన్ని మరొకదాని స్వభావంతో పోల్చి చూసుకుని చేసే నిర్ణయాలు ఉపమాన ప్రమాణాలు. శబ్దంవిని మనస్సులో తెచ్చుకునే అర్థచిత్రాలు శబ్దప్రమాణాలు యదార్థ వస్తువులకు మనము పెట్టుకున్న పేరులే కదా శబ్దాలు.

ప్రశ్న? ప్రామాణ్యం అంటే ఏమిటి?

జ: ప్రమాణాలద్వారా ఋజువయి స్థిరపడిన దానిని ప్రామాణ్యం అంటాము ( Established by proof ) దీనికే ప్రమితి అని పేరు.

ప్రశ్న: ప్రమేయమంటే ఏమిటి?

జ: ప్రమాణాలద్వారా నిర్ణయించవలసిన అంశం.

ప్రశ్న? ప్రమాత్రి అనగా ఎవరు?

జ: ఎవరికయితే ప్రమాణపూర్వకమైన జ్ఞానం ఉంటుందో వారు ప్రమాత్రి.

ప్రశ్న? పూర్వపక్షం, ఉత్తర పక్షం అంటారేమిటి?

జ: పూర్వపక్షం అనగా ప్రతిపాదన, ఉత్తర పక్షమనగా ప్రతిపాద్యవిషయాన్ని మరొక దృక్పథంతో చూడటం. ప్రతిపాద్య విషయాన్ని ఖండించటం కోసం కాదు. దాని సమగ్రతను సాధించటం కోసం. కనుక దానిని గుణ విమర్శగా ( Complimentary ) భావించవచ్చు.

పూర్వపక్షం, ప్రమకు సంబంధించిన జ్ఞానం ప్రమాణం అని. త్రికాల బద్ధమై ఉంటేనే ప్రామాణ్యమవుతుంది. అనగా భూత, వర్తమాన, భవిష్యత్కాలాలలో ఈ ప్రామాణ్యవిషయం ఒకే విధంగా ఉండాలన్న మాట.

ఉత్తరపక్షం: అవును, కుండవున్నది. అది నిన్నా. నేడూ, రేపు ఒకే విధంగా ఉంది. అందుకే అది త్రికాలబద్ధమై ప్రామాణ్యమయింది.

పూర్వపక్షం: అన్నారా? బాగా అన్నారు. కుండ తయారు కాక పూర్వం కుండలేదు. కుండమట్టిమాత్రమే ఉన్నది. అది భూతకాలం. తయారయిన తరువాత కుండఉన్నది అది వర్తమానం ఆ తరువాత కుండ బ్రద్దలయింది. అది అద్యతన భవిష్యత్తు. అప్పుడు కుండలేదు. ఏమంటారు?

ఉత్తరపక్షం: తప్పు అంటాను. కుండ తయారు కాక పూర్వం ఉన్నది కుండ మట్టేగాని కుండకాదు కుండలేకుండా కుండ ప్రసక్తి

ఎలా ఉంటుంది? కనుక కుండకు అది భూతకాలం కాదు. కుండఉన్నంత వరకూ కుండగానే ఉంటుంది. అది ప్రత్యక్షమే గదా! కనుక కుండకు వర్తమానం ఉన్నది. కుండ పగిలిపోయిన తరువాత చిల్లపెంకులంటాము. అవి కుండకాదు. కనుక పగిలిన తర్వాత కుండకు భవిష్యత్తులేదు ప్రమాణాలలో ప్రత్యక్షం ( Sense perception ) ముఖ్యం కనుక ప్రత్యక్షంగా ఉన్నంతవరకూ కుండ ప్రామాణ్యమే అవుతుంది. అది త్రికాల బద్ధమే నిన్న, నేడు, రేపు ఉన్నది కదా.

పూర్వపక్షం: చెట్టున కాయ ఉంది. చెట్టూ, చెట్టున కాయ చూస్తే కనిపిస్తున్నాయి. అది ప్రత్యక్షమే, కనుక అది ప్రమాణం, చటుక్కునముచిక తెగి కాయ క్రిందకు రాలిపోతోంది. అంటే చెట్టునకాయ ఉండటం భూతకాల విషయమయి నట్లేగదా! కాయ రాలుతూండటం ప్రమాణమయింది. నేలమీద కాయ పడగానే రాలి పడటం భూతకాలమయిపోతుంది. చెట్టు అన్నికాలాలా ప్రమాణం కాలేదు. రాలుతూ ఉండటం ప్రమాణంకాదు. నేల మీద కాయప్రత్యక్షమయింది కదా! కనుక ప్రత్యక్ష ప్రమాణం త్రికాల బద్ధంకాదు. నేలమీద పడిఉన్న కాయను భూతకాలంలోనే చెపుతున్నాము. అది ఇంకా అక్కడే ఉంది

ఇక మీ అనుమాన ప్రమాణాల గురించి, నల్లగా ఉన్న రాయిని చూసి అందులో ఇనుము ఉన్నదని అనుమానిస్తారు. అంటే అందులో ఇనుము ఉండితీరాలి. కాని ఇనుము ప్రత్యక్షంగా లేదు కనుక అనుమానించారు. తీరా అందులో ఇనుము లేదు అప్పుడు మీ "అనుమానప్రమాణం" విఫలమయిపోయింది. వస్తువు యొక్క గుణాన్ని బట్టి వస్తువు ఉనికిని నిర్ధారించటం అనుమానం అని మీరన్నారు. మీరు అనుమానించిన వస్తువే లేనప్పుడు అది సంశయమవుతుంది సంశయాస్పదమయిన అనుమానాన్ని ప్రమాణంగా తీసుకో కూడదంటున్నాను.

మూడవది ఉపమానం : ఆమె ముఖం చంద్రుడిలా ఉన్నదని అంటారు కవులు. విదియచంద్రుడా? పున్నమి చంద్రుడా? స్థిరంలేని చంద్రుడితో స్థిరమయిన ముఖాన్ని పోల్చటం దోషమవుతుంది. అది ప్రమాణం ఎలా అవుతుంది? ఉపమానమైన చంద్రుడు నిన్నా, నేడూ, రేపూ ఒకేలా లేడు. కనుక త్రికాలబద్ధమైనది కాదు. తార్కిక పద్ధతిలో ఉపమానం గురించి ఆలోచిద్దాం చంద్రుడు అంటే సుందరుడు అని అర్థం కదా! సుందరుడైన ప్రతీ పురుషుడూ చంద్రుడే అవుతాడు హిమ కరుడు తుల్యార్థప్రతిపాదక మన్నారు. హిమమనగా ఐస్! ఐస్ చేసే వాడు హిమకరుడు కాడా?చంద్రాడెలా అవుతాడు?

అలాగే శబ్దం-"విమానం" గురించి మీరు చెపుతారు. విమానాన్ని ఎవరూ చూడలేదు. విమానాన్ని మీరు చూశారు గనుక అది ఎలా ఉంటుందో మీకు తెలుసు. విమానాలు కూడా నానారకాలుగా ఉంటాయి. మొదట్లో విమానాలు ఒకలా ఉండేవి. ఇటీవల వాటి స్వరూపం మారింది. కొన్నేళ్ళ తరువాత మరొకలా ఉండవచ్చు. కనుక విమానం అనే శబ్దం త్రికాలబద్ధంకాదు. దేవతల విమానాలు వేరు. నేటి ప్రయాణికుల విమానాలు వేరు. యుద్ధవిమానాలు వేరు. డకోటా విమానాలు, జెట్‌విమానాలు, బోయింగ్ విమానాలు, ఎయిర్ బస్‌లు—ఇందులో దేనిని ఉద్దేశించి మీరు విమానమన్నారో విమానశబ్దం వ్యక్తం చేయటంలేదు. కనుక ఇది కూడా ఆభాస అవుతుంది.

ఆ విధంగా ప్రమాణాలేవీ ప్రమేయాన్ని రుజువు చెయ్యలేవు.

అదీగాక ఇంద్రియార్థ సన్నికర్షంవల్ల కలిగే జ్ఞానమే ప్రత్యక్షం అన్నారు అది తప్పు. ఇంద్రియార్థ సన్నికర్షంవల్ల ప్రమ (Reality) కలిగినట్లే భ్రమ (Illusion-Psychological perception in which sensory experiences are misinterpreted) కూడా కలగుతుంది.

అది మిధ్యాజ్ఞానం. మీకు కలిగింది భ్రమయో, ప్రమయో ఎలా నిర్ధారించ గలరు?

ప్రమాణాలను బట్టి ప్రమేయం ఏర్పడుతుందని మీరన్నారు. మంచి నీళ్ళకుండ ఇలా తీసుకురా, అని మీరొకణ్ని ఆజ్ఞాపించారనుకోండి. అది వంటింట్లో ఉంది. ప్రత్యక్షంగా లేదు. అయినా అతని మనసులో మంచి నీళ్ళకుండకు సంబంధించిన భావం (Idea) కలుగుతోంది. ఆ తరువాత వంటింట్లోకి వెళ్ళి ప్రత్యక్షంగా కుండను చూసి, తెస్తున్నాడు. ఈ భావన ప్రమేయమే. ముందుగా ప్రమేయం కలిగిన తరువాతనే ప్రమాణం కలుగుతోంది కదా! కనుక ప్రమాణం వల్లనే ప్రమేయం కలుగుతుందనే సిద్ధాంతం తప్పు.

మరో సంగతి. మంచి నీళ్ళకుండకు సంబంధించిన భావం దానిని చూడకుండానే మీ మనస్సులో ఏర్పడింది గదా! కనుక ఇంద్రియార్థ సన్నికర్షం వల్లనే జ్ఞానం కలుగుతుందని చెప్పటం తప్పే.

బుద్ధికి క్రమప్రవృత్తిత్వాభావముంది. అనగా వస్తువుయొక్క అన్ని కోణాలను ఏకకాలమందు గ్రహించే శక్తి లేదు ఒకదాని తరువాత ఒక దానిని గ్రహిస్తుందని మీరేచెప్పారు. ఎర్రని గులాబీ రంగును చూసి బుద్ధి మురిసిపోతున్నప్పుడు దాని వాసననూ, మృదుత్వాన్ని పరిగణనలోకి తీసుకోదు. దాని వాసనను గ్రహించేటప్పుడు దాని రంగునూ మృదుత్వాన్ని గ్రహించలేదు దాని మృదుత్వాన్ని గ్రహించేటప్పుడు రంగునూ వాసననూ ఉపేక్షిస్తుంది. ఈ విధంగా గులాబీకి సంబంధించిన రంగు వాసన, మృదుత్వం అను మూడు ప్రమేయాలు ఒకేసారి బుద్ధికి ప్రత్యక్షంగావు గదా!

దీనిని బట్టి ప్రమాణ ప్రమేయాలు అన్యోన్యాశ్రయాలు అని అనటానికి కూడా హేతువు కనిపించదు

ఉత్తరపక్షం: ఇంతకీ మీరేమంటున్నారో నాకు సరిగా అర్థం కావటంలేదు. ప్రత్యక్షాది ప్రమాణాలే లేవంటున్నారా? వాటికి ప్రమేయాన్ని సిద్ధింపజేసే శక్తి లేదంటున్నారా? శక్తి లేదంటే, ప్రమాణాలు ఉన్నాయిగాని, వాటికి ప్రమేయాన్ని సృష్టించే సామర్థ్యం లేదని అర్థం గదా! ప్రమాణాలే లేవంటే అన్ని ప్రమాణాలు లేవంటున్నారా? కొన్ని ప్రమాణాలు మాత్రమే ఉన్నాయంటున్నారా? అది స్పష్టం చేయండి.

ఇక ఆ ప్రమాణాలు మూడు కాలాలలోనూ సిద్ధించటంలేదు అనే వాదం కూడా సరియైనది కాదు భూతవర్తమాన భవిష్యత్కాలాలకు ఒకే ప్రమాణం లేకపోవచ్చు అంత మాత్రాన ఏ ప్రమాణమూ ఉండదనటం తప్పు. ప్రత్యక్షాది ప్రమాణాలు మూడు కాలాలలోనూ సిద్ధింపవని చెప్పటం మరీ తప్పు.

మీరు వీణా కింకిణీ నిక్వణాలు విన్నారు. అది శబ్దం, శబ్దాన్ని వినగానే మీకు వీణ స్ఫురించింది. అది ప్రమేయంకదా, ఆ ప్రమేయానికి ప్రమాణమే వీణానాదం. ఇక్కడ ప్రమాణమే ప్రమేయాన్ని నిర్దేశిస్తున్నది

మరొకచోట వీణ ప్రత్యక్షంగా ఉంటుంది. దాని నాదాన్ని మీరు ఊహించుకుంటారు. ఇక్కడ వీణ ప్రమాణమయితే శబ్దం ప్రమేయమవుతున్నది.

ఈ విధంగా ప్రమేయానికి ప్రమాణం ముందో, వెనుకో ఎప్పటికప్పుడు కనిపిస్తూ ఉంది.

త్రాసు ఉన్నది అది ప్రమేయమే. అయినా అది ప్రమాణ మవుతున్నది. బంగారాన్ని తూచటానికి త్రాసును ప్రమాణంగా తీసుకుంటుంటే బంగారం ప్రమేయమవుతుంది. మరో త్రాసు సరియైనదోకాదో

తెలియటానికి ఈ బంగారాన్ని ప్రమాణంగా వాడతాం. అప్పుడు ఆ రెండవ త్రాసు ప్రమేయమవుతుంది.

కనుక సిద్ధికి హేతువు ప్రమాణమవుతుంది. విషయం ప్రమేయ మవుతుంది.

ఇది యదార్ధం అందుకే ప్రమాణాలను తోసిపుచ్చటం సరిగాదు. అలా తోసిపుచ్చటానికి కూడా మీరు వేరే ప్రమాణం చూపాలి.

ఏ వస్తువూ స్వభావతః ప్రమాణమూకాదు, ప్రమేయమూకాదు. నిమిత్తాన్ని (Purpose) బట్టి ప్రమాణమో, ప్రమేయమో అవుతుంది. ఒకే వస్తువు ఒకసారి ప్రమాణమూ, ఒకసారి ప్రమేయమూ అవుతుంది. జ్ఞానానికి విషయమయితే ప్రమేయ (Object of cognition) మవుతుంది. జ్ఞానసాధనమయితే ప్రమాణ (Standard) మవుతుంది.

చెట్టుఉంది. అది ప్రత్యక్షం. అది స్వతంత్రంగా ఉంది. కనుక అది కర్త (Subject) చెట్టు మనచే చూడబడుచున్నది. అది కరణం (Verb). చెట్టును మనము చూస్తున్నాం. చెట్టు కర్మ (Object) అవుతుంది. చెట్టుకు నీరు పోస్తున్నాం. అప్పుడు గ్రహీత అవుతున్నది. అది సంప్రదానం. (Recipient) చెట్టు ఆకుల్ని చూస్తున్నాం. అది అపాదానం (Removal )చెట్టును ఎక్కుతున్నాం. ఇది అధికరణం చెట్టును ఆశ్రయించి ఎన్ని పనులు జరుగుతున్నాయో గ్రహించారుగదా! ఇదీ అంతే.

పూర్వపక్షం! ప్రత్యక్షాది ప్రమాణాలు లేవనటానికి మీరు నన్ను వేరొక ప్రమాణాన్ని చూపమన్నారు ప్రత్యక్షాది ప్రమాణాలు ఉన్నాయనటానికి మీరు వేరొక ప్రమాణం చూపించాలి గదా!

అలాంటి వేరొక ప్రమాణం లేకుండానే ప్రత్యక్షాదులన్నీ వాటికవే కలుగుతాయని మీరు చెప్పే పక్షంలో ప్రమేయాలు కూడా ఏ ప్రమాణం లేకుండానే కలుగుతాయని నేనంటాను.

ఉత్తరపక్షం : దీపం ప్రత్యక్షమే దానిని చూపించటానికి మరో దీపం అవసరంలేదు ప్రత్యక్షంగా ఉన్న దీపాన్ని లేదనటానికి మాత్రమే ప్రమాణం కావాలి.

పూర్వపక్షం : మీరు ఇంద్రియార్థాల సన్నికర్షవల్ల కలిగే జ్ఞానం ప్రత్యక్షమన్నారు అది తప్పు. దారిన నడిచి వెళ్ళేవాడు ఎన్నో చీమల్ని తొక్కుకుంటూ పోతాడు. అన్నిటిని తొక్కుతున్నాననిగాని, అవన్నీ ఛస్తున్నాయనిగాని అనుకోడు. ఎన్నిటిని తొక్కాడో చెప్పలేడు. చీమలన్నీ అతని త్వగింద్రియ సన్నికర్ష (Contact) వల్ల చచ్చినవే కదా! ఆ జ్ఞానం అతనికి కలగదేమి?

ఉత్తరపక్షం : చర్మానికి స్పర్శ జ్ఞానం మాత్రమే ఉంది. కనుక ఏదో కాలికిందపడి నలుగుతున్నదను జ్ఞానం కలుగుతుంది. అవి చీమలో, క్రిములో. ఎన్ని చచ్చాయో అతని నయనేంద్రియ సంకర్షణ కలిగితేగాని తెలియదు. కంటి సంకర్షణతోపాటు ఆత్మ సంకర్షణ కలిగితే అన్ని చీమల్ని అకారణంగా చంపినందుకు విచారిస్తాడు. హస్తసంకర్షణ కలిగితే ఎన్ని చీమలు చచ్చాయో చూసి లెక్కించగలడు.

పూర్వపక్షం : కనుక ఇంద్రియ సంకర్షణ ఒకటి ఉంటే చాలదు. దానితోబాటు ఆత్మసంకర్షణ ఉండాలి. ఆ సంగతి మీ సూత్రములోలేదు. అందుకే మీ సూత్రం సమగ్రంగాలేదు.

ఉత్తరపక్షం : నేను "అదిగో ఆవు" అన్నాను. ఆవు అనే మాట అన్నానేగాని దానికి కొమ్ములు, తోక, పొదుగు, యోని ఉన్నవని చెప్ప లేదు. అయితే ఆవుకు అవన్నీ అంగాలే కదా! అవి లేకుండా ఆవే లేదా. మనిషిని పేర్కొన్నప్పుడు అంగాలను వేరు వేరుగా పేర్కొన వలసిన పనిలేదు. ఇంద్రియ సన్నికర్షమే అంగి! దానిని అనుసరించే ఆత్మ సంకర్షణ మనో సంకర్షణ లున్నాయి అవి అంగాలే

కనుక నా సూత్రం సమగ్రంగా ఉంది. ఆవు అనేది సమగ్రమైన భావనయే కదా.

పూర్వపక్షం: మనస్సుకు ఇంద్రియాలతో ప్రత్యక్ష సంకర్షణ కలిగినందువల్లనే వస్తుజ్ఞానం కలుగుతున్నదని మీరు అన్నారు.

భూమండలాన్ని ఆకాశం వలయాకారంలో ఆవరించి ఉన్నది చతురస్రాకారంలో కాదు అవునా? నయనేంద్రియసంకర్షణ వల్లనే ఈ జ్ఞానం మనకు కలుగుతున్నది: అయినా భూమి చతురస్రాకారంలో ఉన్నట్లుగా మీరు దిక్కులుఉన్నవని అంటున్నారు. దిక్కులేవి ఈసృష్టి మీరు దిక్కుల్ని, మూలల్ని సృష్టిస్తున్నారు. అవి ప్రత్యక్షంకాదు గదా!

అలాగే కాలం: ఆకాశంలాగే కాలం కూడా అనంతమైనది. అదృష్టమానమయిన కాలాన్ని మీరెలా విభజిస్తున్నారు?

ఉత్తరపక్షం: ఆకాశం, దేశం, కాలం, అనేవి అవధుల్లేని విషయాలు. అవి ప్రత్యక్షమే అయినా వాటికి దిక్కులు, ఎల్లలు, కాలమానం ప్రత్యక్షంగా లేవు, ఈ రకం అవధులన్నీ మానవ కల్పితాలు. లోక వ్యవహారం కోసం మనిషి ఏర్పరచుకున్నవి. వాటికీ మన మీమాంసకూ సంబంధంలేదు.

పూర్వపక్షం: ఆత్మ ఉన్నదని మీరంటారు. అది ప్రత్యక్షంగాదు కదా!

ఉత్తరపక్షం. ఆకాశం ( Ether ) ప్రత్యక్షంకాదు. అది శూన్యమే. అయినా ఆకాశం ఉన్నదని అంటున్నాము. ఆకాశం బ్రహ్మ అంటున్నాము. ఆకాశంధ్వనికీ, ప్రాణానికీ ఆధారభూతమయిన ద్రవమనీ. కావున అది బ్రహ్మమనీ పండితులంటున్నారు, అది గ్రాహ్యమే

అలాగే ఆత్మ ఉన్నది. "ప్రాణలక్షణమే ఆత్మ అది జ్ఞాన స్వరూపిణి. ( The principle sensation ) అని ఋగ్వేదం అన్నది.

ఆత్మ అప్రత్యక్షమే. అయినా ఇచ్ఛ ద్వేషం, ప్రయత్నం, సుఖ దుఃఖజ్ఞానమ్ సమస్త ప్రాణి కోటిలోను ఉన్నాయి. అవి ఆత్మ లక్షణాలు. ఈ హేతువులే ఆత్మ ఉనికిని అనుమానింప జేస్తున్నాయి. ఇంద్రియ జన్యజ్ఞానమే ఆత్మ. దానికి మనస్సంకర్షణ కలిగినప్పుడే అది వికల్పమిస్తుంది ( Becomes divided )

ఈ ఆత్మ విశ్వగతమయితే విశ్వాత్మ అనీ, వ్యక్తిగతమయితే ప్రత్యగాత్మ అనీ చెప్పబడుతున్నది.

అలాగే అనంతమైన కాలానికి నిముషాలు. అనంతమయిన దేశానికి ఎల్లలూ, అనంతమయిన ఆకాశానికి దిక్కులూ, ప్రత్యగమవుతున్నాయి

శవానికి ఆత్మ లేదు కనుకనే దానికి ఇచ్ఛాదులుగాని, సుఖదుఃఖ జ్ఞానం గాని లేవు అందుకే ఆత్మకు మనస్సు, మేధ అని అర్థాలు కూడా ఉన్నాయి

పూర్వపక్షం- ముందుగా మీరు ఇంద్రియార్థ సన్నికర్షం వల్లనే జ్ఞానం కలుగుతుందని అన్నారు. ఆత్మమనస్సన్నికర్షం వల్ల జ్ఞానం కలుగుతోందని తరువాత అన్నారు ఈ రెండింటికీ తేడా లేదా?

ఉత్తరపక్షం: ఇంద్రియాలకు వస్తువు (అర్థం)తో సన్నికర్ష కలగటం వల్ల జ్ఞానం కలిగే మాట వాస్తవమే. అది వాస్తవ జ్ఞానమే అవుతుంది. దానినే ఆత్మ అని అంటున్నాము ఇది కేవలం అనుభూతి మాత్రమే, ఈ అనుభూతి మనస్సుచే పరిచ్ఛిన్నమై పరిపూర్ణ జ్ఞానంగా రూపొందుతుంది.

అనుభూతి ఇంద్రియజన్యజ్ఞానమయి మానసిక సంకల్పం వల్లనే పరిపూర్ణత్వాన్ని పొందుతుందని నిర్ధారించటం జరుగుతోంది. అనుభూతి ప్రాథమిక జ్ఞానమే గాని పరిపూర్ణజ్ఞానం కాదు.

ప్రాథమిక జ్ఞాన సాధనాలయినందుననే ఇంద్రియాలను ప్రమాణాలని చెప్పాము.

**అంతేకాదు.** ఆత్మ, ఇంద్రియాలు, అర్థాలు ఒకదానితో ఒకటి ఏకకాలమందు సంకర్షమయి ఉన్నప్పటికీ వస్తువుకు సంబంధించిన జ్ఞానాన్ని అన్ని ఇంద్రియాలూ ఒకే కాలమందు అందివ్వవని చెప్పాను. ఒకదాని తరువాత ఒకటి అందిస్తాయని చెప్పాను. కనుకనే ఇంద్రియ సన్నికర్షంలేని వారికి ఆత్మజ్ఞానం పరిపూర్ణంగా ఉండదని వేరేచెప్పనక్కర లేదు. పుట్టుగ్రుడ్డివారికి తేజోజ్ఞానంగాని, ఆకారవికార జ్ఞానంగాని ఉండదు కదా. ఆ జన్మ బధిరునికి శబ్దజ్ఞానం కలగదు.

పూర్వపక్షం: సమస్త వస్తువులకు సంబంధించిన జ్ఞానాన్ని ఇంద్రియాలద్వారా గ్రహించటమే ప్రత్యక్షాది ప్రమాణాల ప్రయోజనమనీ, అదేజ్ఞానమనీ అన్నారు అది సాధారణ కారణమేగాని. విశేషకారణంకాదు.

ఉన్నవస్తువు జ్ఞానాన్ని కలిగించినట్లే లేని వస్తువుకూడా జ్ఞానాన్ని కలిగిస్తుంది. మీ ఇంట్లో ఉండే ఒక వస్తువు అకస్మాత్తుగా కనపడకుండా పోయింది, అది ఇప్పుడు లేదు. కనుక ఆ వస్తువు పోయిందన్న విశేషజ్ఞానం కలుగుతున్నది ఈ విధంగా లేని వస్తువు వల్ల జ్ఞానం కలగటం లేదా?

ఆ వస్తువును ఎవడో ఒకడు దొంగతనం చేశాడని మీకుసంశయం (Suspicion) కలగవచ్చు అతగాడు దానిని దొంగతనం చేయటం మీరు కళ్ళారా చూడలేదు చూసిన వాళ్ళెవరూ మీకు చెప్పలేదు,

అయినా అతడే దొంగలించి ఉంటాడని మీ మనస్సుకు విశేషజ్ఞానం కలిగింది. ఇంద్రియార్ధసన్నికర్షం లేకుండానే కలిగే ఈ రకం జ్ఞానాన్ని మీరు ఏమంటారు?

ఉత్తరపక్షం: వస్తువువేరు, జ్ఞానంవేరు వస్తువుకు సంబంధించిన జ్ఞానం ఒకసారి కలిగిన తరువాత ఆ వస్తువు ఎదురుగా ఉన్నా లేక పోయినా దానికి సంబంధించిన జ్ఞానం మనస్సులోంచి తొలగిపోదు.

ఏ వస్తువు అపహరింపబడిందో దానికి సంబంధించిన జ్ఞానం మనస్సులో ఇది వరకే ఉంది. అది సాధారణజ్ఞానమేగాని. విశేష జ్ఞానంకాదు. కుండ అనే శబ్దం వినబడే సరికి కుండకు సంబంధించిన జ్ఞానం మన మనస్సులో కలుగు తున్నదని ఇది వరకే చెప్పాను. దానిని శబ్దజ్ఞానమని అన్నాను. పోయిన వస్తువుకు సంబంధించిన జ్ఞానం కూడా శబ్దజ్ఞానమే అవుతుంది, ఏమాత్రం విశేషజ్ఞానం కాదు

ఇక దొంగ విషయం. అతను దొంగ అని సంశయించటానికి అతని పూర్వప్రవర్తన ఆ వస్తువు పోయిన సమయమూ సందర్భమూ ప్రధాన కారణాలవుతాయి. పొగను బట్టి నిప్పు ఉనికిని మనం అనుమానించి నట్లే అతని ప్రవర్తనని బట్టి ఆతను దొంగ అని సంశయిస్తాము ఇది నేను లోగడ చెప్పిన సంశయజ్ఞానమేగాని విశేషజ్ఞానం కాదు.

పూర్వపక్షం : అవమానానికి ఇంద్రియార్థ సన్నికర్ష ఉండనక్కర లేదా?

ఉత్తరపక్షం : ఇంద్రియార్థాల సన్నికర్ష ప్రత్యక్షంగా కలిగినందు వల్ల కలిగే జ్ఞానాన్ని ప్రత్యక్షజ్ఞాన మన్నాము. పరోక్షంగా కలిగే దానిని "అనుమానజ్ఞాన"మన్నాము. పొగ మాత్రమే ప్రత్యక్షంగా ఉంది. నిప్పు ప్రత్యంక్షంగా లేదు. అయినా పొగను చూసి నిప్పు ఉన్నదనుకుంటు న్నామా, లేదా? అదే అనుమానజ్ఞానం.

నిద్రపోతున్న మనిషికి ఇంద్రియాలు నిద్రపోతూ ఉంటాయి. అప్పుడవి అర్థాలను (Object) గ్రహించలేవు అనగా నిద్రపోతున్న మనిషికి జ్ఞానంలేదు.

ఆ సమయంలో పెద్ద చప్పుడయింది. ఆ చప్పుడుకు అతని చెవులు మేల్కొని మనస్సును మేల్కొల్పాయి. అతను ఉలిక్కిపడి లేచి ఏమిటా చప్పుడని ఆలోచిస్తాడు. నూతిలో మనిషి పడ్డాడా? దొంగలు పడ్డారా? ఇంటి దూలం విరిగిపడిందా?—అని చూస్తాడు. అది సంశయం. అనుమానానికి కూడా ఇంద్రియార్థ సన్నికర్షం ఉంది దొంగను చూడకపోయినా అతను వేసిన కన్నాన్ని చూడాలి.

పూర్వపక్షం : ఎన్నో దృశ్యాలు చూస్తాము. ఎన్నెన్నో శబ్దాలు వింటూనే ఉంటాము. అనగా ఆ సమయంలో ఇంద్రియాలకు అర్థాలతో సన్నికర్ష ఉంటూనే ఉంటుంది. అయినా వాటిని మనస్సుకు పట్టించుకోము.

దీనిని బట్టి ఏమితేలుతోంది? ఇంద్రియార్థ సన్నికర్షంవల్ల లభించే జ్ఞానాన్ని (ఆత్మను) మనస్సు పట్టించుకోక పోవటంవల్ల ఆ విధంగా ఆత్మ మనసన్నికర్షం లభించక పోవటంవల్ల నిష్ప్రయోజనమవుతుంది. అందు ఇంద్రియార్థ సన్నికర్షం హేతువు కాదని నా అభిప్రాయం.

ఉత్తరపక్షం : మనస్సు పట్టించుకున్నదా, లేదా అన్నది ప్రధాన విషయంకాదు. ఇంద్రియార్థ సన్నికర్షంవల్ల జ్ఞానం కలుగుతున్నదా, లేదా అని ఆలోచించండి అదే జ్ఞానమనీ ఆత్మ అని అంటున్నాము. దానిని మనస్సు పట్టించుకోకపోతే దాని ఖర్మ!

ఆత్మ మనః సన్నికర్షం ఐచ్ఛిక విషయమయినందున సాధారణ కారణమేగాని లక్షణంకాదు. ఇంద్రియాలకు అర్థవ్యాపారాలను గ్రహించటమే లక్ష్యం. అది వాటికి సాధారణ ధర్మమే కనుక నా సూత్రంలో దోషం లేదు.

చెవిటివాని వెనుక శంఖం ఊదినా అది వానికి వినబడదు శంఖ నాదం లేదనే అతను అనుకుంటాడు చెవిటివాని చెవిలోకి శబ్దం ప్రవేశించక పోతే మనస్సు మాత్రం ఏంచేస్తుంది? ఇంత విడమరిచి నేను చెపుతున్నా మీ మనస్సు గ్రహించటంలేదు.

పూర్వపక్షం : నాది మందబుద్ధి అందుకు సందేహంలేదు. తమది సూక్ష్మబుద్ధి అదే సందేహాస్పదమైనది సూక్ష్మమనగా నిశితం కావచ్చు. అల్పం కావచ్చు అలా ఎందుకన్నానో చెపుతాను

మీరు ప్రత్యక్షజ్ఞానాన్ని ఇంద్రియార్థ సన్నికర్షంవల్ల పొందుతున్నా మంటున్నారు. అది అనుమాన జ్ఞానమే అని నా అభిప్రాయము. దానికి ఏక దేశగ్రహణమే కారణం. అనగా వస్తువు యొక్క కొంత భాగాన్ని మాత్రమే గ్రహించి, మొత్తం వస్తువునంతా గ్రహించినట్లు మాట్లాడటం అల్పబుద్ధి పోనీ సూక్ష్మబుద్ధి అందాం ఇట్లా అల్పవిషయం నుంచి అనల్ప విషయాన్ని గ్రహించటం అనుమానం కాకపోతే ఏమిటిస్వామి?

చంద్రుడు మీ కంటికి దూట బిళ్ళలాగో, రూపాయి నాణెంలాగో కన్పిస్తాడు. నిజంగా చంద్రుడలా లేడు. గోళాకారంలో ఉన్నాడు. చంద్రు నికి సంబంధించి ఒక భాగమే మీకు కనిపిస్తోంది. రెండవ భాగం మీకు కనబడటంలేదు. చంద్రుడు సమగ్రంగా కనిపించినట్లే మీరు మాట్లాడు తున్నారు. ఇది అనుమాన జ్ఞానమేగాని, ప్రత్యక్షజ్ఞానంకాదు. పున్నమి నాడు మీ వంక వెలుగుతున్నట్లుగా కనబడిన చంద్రుణ్ని పూర్ణుడుగా భావించి, పూర్ణమి చంద్రుడంటున్నారు. అవతలి వంక చంద్రుడు పూర్ణమి నాడు గాఢాంధకారంలో ఉంటాడని మీకు తెలియదు. విదియ చంద్రుడు నెలవంక మాత్రంగా ఉంటాడు అయినా అతన్ని చంద్రుడే అంటున్నారు. అప్పుడు చంద్రునిలో పూర్ణత్వం ఉందా? విదియ చంద్రుడు మీకు అల్పంగా కనబడినందున నెలవంక అని మీ రంటున్నారు. ఆ సమయంలో చంద్రుని

ఆవలి భాగం దేదీప్యమానంగా వెలుగుతున్నదని మీరెరుగరు. అమావాస్య నాడు చంద్రుడు లేడనే మీవంటి ప్రత్యక్షజ్ఞానవాదు లంటారు. ఆ రోజున చంద్రుని కవతలి పక్షం పూర్ణమి అవుతుందిగదా! అందుకే ఈ మంద బుద్ధి తమ సూక్ష్మబుద్ధిని అభిశంసించగలుగుతున్నది. మీది ఏక దేశగ్రహణ మని అభియోగం చేస్తున్నది.

మీరు ఒక చెట్టుకేసి తేరిపార చూసారు. దాని పార్శ్వభాగమే మీకు ప్రత్యక్షంగా కనిపించింది. ఓహో! ఈ చెట్టు ఎంత అందంగా ఉంది, అనుకున్నారు. దాని రెండవ పార్శ్వం నేను చూసాను. అటు పైపు కొమ్మల్ని ఎవరో నరుక్కుపోయారు. చెట్టు ఎంత బోడిగా ఉంది! అని నేను అనుకున్నాను.

వస్తువుయొక్క కొంత భాగాన్నే ఇంద్రియాలు గ్రహిస్తున్నాయి. అంతమాత్రాన వస్తువు మొత్తాన్ని గ్రహించినట్లుగా మాట్లాడుతున్నాము. కనుక మీరు చెప్పిన ప్రత్యక్షజ్ఞానం ఇంద్రియార్థాల ఏకదేశ సంకర్షణ వల్ల కలిగిన అనుమానజ్ఞానమేగాని పరిపూర్ణజ్ఞానం కాదని నాకనిపిస్తున్నది.

ఉత్తరపక్షం : చెట్టును చూసేవాడు చెట్టులో కొంత భాగాన్ని మాత్రమే చూస్తున్నాడు. అది నిజమే ఆ కొంత భాగమయినా ప్రత్యక్షమే కదా! ఆ భాగమే చెట్టుకు అవయవం. అవయవాన్నిబట్టి అవయవి గ్రహింప బడుతున్నది. ఇందులో "సంశయానికి తావులేదు.

నిప్పునుండి పొగ పుడుతున్నది. నిప్పువేరు. పొగవేరు. ఆ రెండూ వేర్వేరు పదార్థాలు. నిప్పులేని పొగ, పొగలేని నిప్పు ఉన్నాయి. పొగ మంచు నిప్పులేని పొగకాదా? ఈ వేర్వేరు పదార్థాల సహజ సంబంధమే అనుమానానికి హేతువవుతున్నది.

జ్వాల అలాకాదు. అది నిప్పుకు అవయవం. జ్వాలలు గలది నిప్పు కనుక నిప్పు అవయవి అవుతున్నది. జ్వాలను బట్టి నిప్పును మనము పేర్కొంటే అది ప్రత్యక్షజ్ఞానమే గాని అనుమానజ్ఞానం కాదు.

చెట్టును చూసినా అంతే. మనకు కొమ్మలు రెమ్మలు, ఆకులు కనిపిస్తాయి. మాను కూడా కనిపిస్తుంది అది కనబడకపోయినా లేదని అనుకోము. మాను కొమ్మలు, రెమ్మలు, ఆకులు వేళ్ళుచెట్టుకు అవయవాలే, అన్నీ కలిస్తేనే చెట్టు అవుతుంది. అవయవాలను బట్టి అవయవి గ్రహింపబడటాన్నే "సద్భావం" అంటాము

ఏకదేశగ్రహణం సద్భావాన్ని ( Comprehensive Image ) కలిగించదనటం తప్పు.

పూర్వపక్షం: చెట్టును మీరు చూసినప్పుడు అవయవాలే కనిపిస్తాయి ప్రతీ అవయవానికి ప్రత్యేకమైన పేరు ఉంది. ఆ పేర్లన్నీ మీరు చెపుతూనే ఉన్నారు. అవి కాక చెట్టు ఎక్కడున్నది! అవయవాలే తప్ప అవయవి అంటూ వేరే లేదనే నా అభిప్రాయం.

ఉత్తరపక్షం: అవయవాల సంపుటమే అవయవి. అవయవే లేనప్పుడు అవయవాలు ఏవీ ఉండవు, చెట్టులేకుండా వేళ్ళులేవు మాను లేదు. కొమ్మలూ రెమ్మలూ లేవు, ఆకులులేవు వీటిలో ఏ ఒకటి లేకపోయినా చెట్టుఉంది, ఆకులులేని చెట్టు కొమ్మలూ రెమ్మలూ లేని చెట్టు మానులేని చెట్టు. వేళ్ళులేని చెట్టూ ఉండవచ్చు. కాని. ఇవన్నీ ఏకకాలమందు లేనప్పుడు చెట్టేలేదు ఒక వస్తువుకు సంబంధించిన సమస్త అవయవాలు కలిసి ఆ వస్తువును ఏర్పరుస్తున్నాయి.

అవయవాలు ఆశ్రయాలు ఏవి ఆశ్రితం లేకుండా ఉండలేవో అవి ఆశ్రయాలు అనగా వాటికవి స్వయంగా సిద్ధింపలేనవని అర్థం. ఏది ఆశ్రయాలకన్నా భిన్నంగా ఉండజాలదో అది ఆశ్రితం. అవయవాలను ఆశ్రయించుకుని ఉండేదే అవయవి ఈ ఆశ్రయాశ్రితభావాన్ని "సమవాయం" ( Intimate union ) అంటాము.

అందుకు ధారణ, ఆకర్షణలే ఉపపత్తులు.

ఒక అవయవాన్ని మాత్రమే మనం పట్టుకులాగితే మిగతా అవయవాన్నీ దానితోబాటు హస్తగతమవుతాయి. అదేసమవాయ సంబంధం అట్టి సమ వాయ సంబంధంగల వస్తువునే అవయవిఅంటాము. మనిషి పిలక పట్టుకు లాగితే దానితో బాటు అతని అవయవాలన్నీ వస్తాయి. గదా: అలారావటాన్ని ఆకర్షణ అంటారు, ఒక అవయవంతో ఇంకో అవయవం అనుబంధించి ఉండటాన్ని ధారణ అంటాము చెట్టు అనేది కొమ్మలు రెమ్మలు, మాను, వేళ్ళు, ఆకులు మున్నగు అవయవవాలతో కూడిన అవయవి కనుక దానికి ధారణ ఆకర్షణ ఉన్నాయి.

పూర్వపక్షం: బాగా చెప్పారు. "అడవి" ఉన్నది. అందులో ఎన్నెన్నో చెట్లున్నాయి. అలాగే "సేన" ఉన్నది. అందులో వేల కొద్ది సైనికులుంటారు. ఈ అడవిలోగాని, ఆ సేనలోగాని ధారణ, ఆకర్షణ లున్నాయి. కొమ్మపట్టుకులాగితే చెట్టు కదిలినట్లు అడివిలో మొక్కను పట్టుకులాగితే అడివంతా కదులుతుందా? ఒక్క సైనికుణ్ని జుట్టుపట్టుకు లాగితే సేనంతా వంగుతుందా?

ఉత్తరపక్షం: సమవాయం వేరు. సముదాయం వేరు.

నూలు పోగులు రాశిగా ఉన్నాయి అందులో దారాన్ని ఎక్కడ లాగినా దారమే చేతికొస్తుంది. కనుక అట్టి నూలుపోగులరాశిని సముదాయమంటారు. ఆ నూలు తోనే బట్టను నేస్తారు. బట్టను పట్టుకుంటే అన్నినూలుపోగులూ హస్తగతమవుతాయి. ఒకదాని నుంచి ఒక దానిని విడిదీయలేము అట్టి స్థితినే "సమవాయం" అంటాము. ఒక దానిలో ఒకటి పెనవేసుకొని అంతర్లీనముగా ఉండేస్థితి, అడివి, చెట్ల సముదాయమేగాని చెట్టుకు కొమ్మలవలె సమవాయం కాదు. అలా సమవాయమే అయిన పక్షంలో మొత్తం అడివి అంతా ఒకే చెట్టు అవుతుంది. గాని, రకరకాల చెట్లయొక్క గుంపు కాలేదు. సేనకూడా ఇలాంటిదే.

చెట్టులో అతి సూక్ష్మమయిన కణాలు ఉన్నాయి. ఒకే రకం కణాలు ఆ చెట్టులోని సమస్త అవయవాలలోనూ ఉండి, వాటిని ఏకభాగం చేశాయి. అందుకే వేళ్ళుపీల్చిన నీరు ఆకులోనికి వెడుతున్నది. ఆకులు పీల్చిన ప్రాణవాయువు వేళ్ళలోకి వెడుతున్నది. ఆడవి కూడా ఇదే విధంగా సమవాయమే అయితే ఒక చెట్టు పీల్చిన నీరు అన్ని చెట్లకు ప్రసారకం జరగాలి. అలా జరగటంలేదు కదా. జరిగితే అడివిచెట్లు అన్నింటికి కలిపి ధారణ ఉన్నట్లే. అప్పుడు ఆకర్షణ కూడా ఉంటుంది.

అలాలేదు. అందుకే అడవి చెట్లసముదాయమేగాని సమవాయం కాదు. సైనికుల సముదాయమే సేన. సైనికులు ఎందరు చచ్చినా కడగొట్టు సైనికుడు చచ్చేదాకా సేనచావదు.

పూర్వపక్షం : ఆధారాన్ని బట్టి అధేయాన్ని కనుక్కోవటమే అనుమానం. పొగనుబట్టి నిప్పును గ్రహించటమంటే అదేకదా. ఆనకట్ట మీద నీరు పొర్లి ప్రవహించటాన్ని చూసినవారు ఎక్కడో వర్షం కురిసిందని అనుకుంటారు. అలాగే చీమలు బారులు తీర్చి వెడుతుంటే చూసి వర్షం కురిసి తీరుతుందను కుంటారు. నెమళ్ళు సంతోషంతో కేకలు పెట్టటం విన్నా అలాగే అనిపిస్తుంది. ఇవన్నీ వర్షానికి అనుకూల ప్రమాణాలే. కాని, నిజంగా వర్షం కురవదు. కురియనూలేదు. ఈ మూడు చోట్లా అనుమానం వ్యర్థంకాలేదా?

ఉత్తరపక్షం : ఏకదేశ జ్ఞానమంతా ఇంతే. అనగా ఏదో ఒక అంశాన్ని మాత్రమే ఆధారంగా తీసుకుని నిర్ణయానికి రావటం అంతకన్నా గ్రుడ్డితనం లేదు.

ఆ మనిషి ఆనకట్టమీంచి నీళ్ళుపొర్లి ప్రవహించటం చూస్తున్నాడు.

ఆ నీళ్ళు నీలంగా వినిర్మలంగా ఉన్నాయా? బురదగా ఉన్నాయా? మరుగు ఉందా? చిన్నచిన్న కొమ్మలూ, రెమ్మలూ కొట్టుకొస్తున్నాయా? అని చూడాలి అలా కనిపిస్తే ఆ నదికి ఎగువభాగాన ఎక్కడో వర్షం కురిసిందని అర్థం. అదేదీ చూడకుండా ఆనకట్టమీద నీళ్ల ప్రవహించటం చూసి వర్షాన్ని అనుమానించాడంటే ఏమనాలి?

చీమలుండే కన్నంలో ఎవరైనా ఏ నీరైనా పోస్తే అందులోంచి చీమలు బయటకొచ్చి, భయంతో పరిగెడతాయి అది చూసి వర్షాన్ని అనుమానించేవాడు మూర్ఖుడు ఈ రకం ఉపద్రవమేదీ లేకుండా చీమలు తమ అండాల్ని తీసుకుని ఉన్నత ప్రదేశాలకు పోతూండాలి. దానికితోడు ఆకాశం మేఘావృతమై ఉండాలి. నేలవాసనలు గాలిలో కలిసి ముక్కుకు సోకాలి. అప్పుడు వర్షం ఖచ్చితంగా కురుస్తుంది. అదే నిజమైన అనుమానం.

ఆకాశం మేఘావృతమైన సమయంలో మయూరి కూత పెడుతూ నాట్యంచేస్తే తప్పకుండా వర్షం కురుస్తుంది. అలాకాక మండుటెండలో కూత పెడితే ఏదో కలకలమయి ఉంటుంది.

హేతువు సరిగా లేకున్నా, సమగ్రంగా లేకున్నా కలిగే అనుమానం అనుమానం కాదు. అది సందేహం (అనుమానం **Induction** సందేహం **Doubt**).

## కాలం

పూర్వపక్షం: మీరు భూత, భవిష్యత్, వర్తమాన కాలాలంటూ కాలాన్ని మూడు భాగాలు చేశారు. నాదృష్టిలో వర్తమాన కాలం లేదు.

ఎలాగంటారా?

ముచికను విడిచి చెట్టుకాయ చెట్టునుండి నేలమీదకు రాలుతున్న దనుకోండి. తొడిమకూ, భూమికీ మధ్యగల అంతరాన్ని మార్గమని అందాం. ఫలం ప్రయాణిస్తూ ప్రవేశిస్తున్న ప్రతి క్షణం భవిష్యత్కాల మవుతుంది, తొడిమకూ, నేలకూ మధ్యసరళరేఖను ఊహించుకున్నట్లు అయితే అదే మార్గమవుతుంది, మార్గాంతరమ్ కాలాంతరం కూడా, ఆ మార్గములో ఆ కాయ ప్రయాణిస్తున్నప్పుడు గడిచిన దూరం భూతకాలం అయితే గడవనున్న దూరం భవిష్యత్తే అవుతుంది. ఇంక వర్తమాన కాలం యెక్కడుంది?

ఉత్తరపక్షం: అయ్యా, కాలంవేరు, దూరంవేరు, కాలం దూరం చేత వ్యక్తంకాదు. రాలి పడుట క్రియ. పండు పడగానే క్రియ సమాప్త మవుతుంది పడుతూఉన్నంత సేపూ అది వర్తమాన కాలమే అవుతుంది. భూత, భవిష్యత్కాలాలందు పండు పడటంలేదు. పండుపడి ఉంటుంది. లేదా పడ నుంటుంది. పడుతూ ఉండదు క్రియకు. కర్తకూ గల ప్రత్యక్ష సంబంధాన్ని తెలిపేది వర్తమాన కాలమే గాని భూత భవిష్యత్కాలాలు కావు. అవి నిష్క్రియకాలాలు. కనుక క్రియాత్మకమైన వర్తమాన కాలానికి ఇటూ అటూ నిష్క్రియాత్మకమయిన భూత భవిష్యత్కాలాలుంటాయి అవి వర్తమానం లేకుండా ఉండవు. నిష్క్రియాత్మకాలు శూన్యమే గనుక.

మరొకటి భూత కాలం భవిష్యత్కాలాన్ని గాని, భవిష్యత్కాలం భూతకాలాన్ని గాని అపేక్షించవు. వర్తమాన కాలమే అనుక్షణమూ అటు భవిష్యత్తులోకీ, ఇటు భూత కాలం లోకీ ప్రవేశిస్తూఉంటుంది. ఇది అతివ్యాప్తి. భూతభవిష్యత్తులకు పరస్పరవిరోధమే గాని, పరస్పరాపేక్షలేదు. వర్తమానం భూతకాలానికి ఎంత కోల్పోతున్నదో అంతభవిష్యత్తునుంచి సేకరించుకుంటుంది.

పూర్వపక్షం: భూత భవిష్యత్కాలాలకు పరస్పరాపేక్ష లేకపోతే పోనివ్వండి. వర్తమానాపేక్ష అయినా ఉందికదా! వస్తువే నశించిపోతే దానికి భూతకాలమేగాని వర్తమానమూ, భవిష్యత్తులేవు.

ఉత్తరపక్షం: వర్తమానమే లేకపోతే ఈ ప్రపంచంలో ఏవస్తువూ ప్రత్యక్షంగా సిద్ధించదు. వస్తువు ఉన్న క్షణంలో ఉన్నదున్నట్లు చూసేదే వర్తమానం. గతంలో ఆవస్తువు ఒకవిధంగా ఉండవచ్చు. ఇప్పుడొక విధంగా ఉండవచ్చు, భవిష్యత్తులో అది మరొకవిధంగా మారిపోవచ్చు. అది కాలానుగుణమయిన పరిణామం. బాల్యం నుంచి వార్ధక్యానికి మనిషి పరిణమించటం లేదా?

కొన్ని వస్తువులు అన్నికాలాలలోనూ ఒకే విధంగా ఉండవచ్చు. ఉదాహరణకి బండరాళ్ళు.

వస్తువుయొక్క ఉనికిని యథాతథంగా తెలియజేసే గుణాన్ని అర్థ సద్భావవ్యంగ్యం అంటాము. సద్భావమనగా సమగ్రరూపం. ఘటం, పటం మొదలైనవి. వీటికి స్థితి మాత్రమే ఉంటుంది అందుకే అవి స్థావరాలని చెప్పబడుతున్నాయి ఆవు, గుర్రం, హరిణం మున్నగు వాటికి గతికూడా ఉన్నది. గతిలో వేగభేదం ఉంది. అవి జంగమాలు.

## ఉపమానం

పూర్వపక్షం : అయ్యా మీరు ఉపమానాన్ని ప్రమాణంగా తీసుకున్నారు. అదే నాకు నచ్చలేదు.

అత్యంతసాధర్మ్యమూ, ప్రాయస్సాధర్మ్యమూ, ఏకదేశసాధర్మ్యమూ ఉపమాన హేతువులు. ఈ మూడింటివల్లా ఉపమానం ప్రమాణం కాదు. ఎలాగో మనవి చేస్తాను.

ఆవుకున్న ధర్మాలన్నీ ఆవుకే ఉంటాయి. కనుక "ఆవు ఆవులా ఉంటుంది" అని చెప్పాలి. అలా ఎవరూ చెప్పరు. ఆవుకు ఆవు ఉపమానం కాదు.

ఒక జాతిలో ఉండు అనేక ధర్మాలు మరొక జాతిలో ఉంటాయి. ఒకటి రెండు ధర్మాలు మాత్రమే ఉండకపోవచ్చు. దానిని ప్రాయస్సాధర్మ్య మంటాము. "ఆవు గేదెలా ఉంటుంది" నిజమే. కాని అలా ఎవరైనా ఉపమానం చెపితే నవ్విపోతాము. ఆవూ, గేదె—ఈ రెండూ పాడి పశువులే. అయినా వీటికి జాతిభేదమూ, వర్ణభేదమూ ఉన్నాయి. ఆ రెండూ తప్ప మిగిలిన ధర్మాలు సమానమే కదా! అయినా అవి విజాతివి. ఆవు గేదెలా ఉండదు. గేదె ఆవులాగా ఉండదు ఆవులోనే జాతిభేదాలు ఉన్నాయి. జెర్సీ ఆవులు వేరు, ఒంగోలు ఆవులు వేరు, పడమటావులు వేరు. కొండల్లో పెరిగే ఆవులు వేరు. ఒక ప్రాంతపు ఆవు మరొక ప్రాంతపు ఆవులా ఉండదు. దేనికేది ఉపమానం?

వస్తువునందలి ఏ కొంచెం ధర్మమో మరొక దానిలో ఉంటే అది ఏకదేశసాధర్మ్య మవుతుంది, "ఆవగింజ మేరుపర్వతంలా ఉంటుంది" అని చెపితే నవ్వులపాలవదా?

ఉత్తరపక్షం : ఉపమానం ప్రయోజనాన్ని ఆశ్రయించి ఉంటుంది.

"రామరావణుల యుద్ధం రామరావణుల యుద్ధంలాగే ఉంది" అంటాడు వాల్మీకి. ఇక్కడ ఒక యుద్ధవిధానం సాటిలేనిదని చెప్పటమే ప్రయోజనం. రామరావణుల యుద్ధంతో మరెవరి యుద్ధమూ సరిపోల్చదగినది లేదని చెప్పటం జరిగింది.

"ఆవులాగే గేదెకూడా పాలిస్తుంది. అనటంలో పాలు ప్రయోజనం. క్షీరసామ్యం ఇందులో స్ఫురిస్తుంది. అప్పుడు నవ్వొస్తుందా?

"సత్తాలో ఆవగింజలాంటిదే మేరువుకూడా" అన్నట్లు అయితే అక్కడ సత్తా ప్రయోజనమవుతుంది. కనుక అది కూడా హాస్యాస్పదం కాదు. ఈ రకం ఉమ్మడి ప్రయోజనాలనే ప్రత్యక్షసాధర్మ్యలని అంటాము

పూర్వపక్షం : ప్రత్యక్షంచేత అప్రత్యక్ష విషయం ఈ ఉపమానంలోనూ, అనుమానంలోనూ ఒకే విధంగా సిద్ధిస్తున్నాయి. కనుక రెండూ ఒకటే అని నా అభిప్రాయం.

ఉదాహరణకి : గోవులాంటిదే గవయం. అని చెప్పారనుకుందాం. గవయం ఎలా ఉంటుందో ఎవరూ చూడలేదు. గోవును అంతా ఎరుగుదురు. ప్రత్యక్ష విషయమైన గోవుతో పోల్చి అప్రత్యక్ష విషయమైన గవయాన్ని చెప్పటానికి ఈ ఉపమానం ఉపయోగ పడలేదా?

చూడని నిప్పుయొక్క ఉనికిని, చూసిన పొగను బట్టి ఊహించటం "అనుమాన"మని మీరు అంటున్నారు గదా! ఇక్కడ పొగ మాత్రమే ప్రత్యక్షంగా ఉంది. నిప్పు అప్రత్యక్షంగా ఉంది. ఉపమాన వాక్యంలో కూడా గోవు ప్రత్యక్షంగా ఉంది. గవయం అప్రత్యక్షంగా ఉంది. ఏమంటారు!

గవయం (The gayal Boes gavaeus) అడివి గోవు దీనికి "గోమృగి" అని పేరు కూడా ఉంది. పాలు పుష్కలంగా యిచ్చే అడివి మృగం.

ఉత్తరపక్షం : నేను అంగీకరించను. మనము చూడని వస్తువును చూపించటంకోసమే చూసిన వస్తువుతో పోల్చిచెప్పటం ఉపమానం యొక్క లక్షణంకాదు అలా అయితే అది మీరు చెప్పినట్లు "అనుమానం"

అవుతుంది.

పొగ ఉన్నచోట నిప్పు వుంటుంది. గోవుఉన్నచోట గవయం ఉంటుందని. నిప్పునుంచి పొగ వస్తుంది. గవయం నుంచి గోవురాదు. పొగనుబట్టి దానికి మూలకారణమైన నిప్పుకు మన మనస్సు వ్యాపిస్తుంది. ఈ రకం వ్యాప్తి అనుమానంలో ఉన్నది. ఉపమానంలో లేదు. నిప్పుకూ పొగకూ సామాన్య ప్రయోజనం కల్పింపబడలేదు.

ఉపమానం అలాకాదు. "గవయం గోవులాంటిదే" అని చెప్పటం ద్వారా ఆ రెండూ ఒకే విధంగా పోలిచ్చే జంతువులని చెప్పటం జరిగింది. ఇక్కడ సాదృశ్యం పోలివ్వటం, కనుక ఇది ఉపమానం.

గోవు, గవయం సజాతీయమైనవి. వాటికి పోలికలు ఉన్నాయి. పొగ, నిప్పు విజాతీయమయినవి. ఆ రెండింటికి పోలికలేవు పరస్పరానుబంధంగల రెండు విజాతి వస్తువులలో ఒకటి తెలిపినప్పుడు రెండవ దాని ఉనికిని ఊహింపజేసేది అనుమానం. రెండు వస్తువుల్లో పరస్పర పోలికల్ని బట్టి సమత్వాన్ని అపాదించేది ఉపమానం. ఆ రకం అపాదనకే వాక్యజ్ఞానమని పేరు. అనుమానానికి వ్యాప్తి ఉంటుందేగాని వాక్యజ్ఞానం వుండదు కనుక ఉపమానం అనుమానంకాదు.

## శబ్దం

పూర్వపక్షం : అర్థమనగా వస్తువు. దానికి మనం పెట్టుకున్న ఏ పేరయినా శబ్దమే. "బల్ల" అన్నప్పుడు ఆ వస్తువు ప్రత్యక్షంగాలేదు ఉండనూ అక్కర్లేదు. బల్ల అనే మాటకి అర్థాన్ని మనం గ్రహిస్తాం. ఆ వస్తువును ఊహిస్తాం.

పొగని బట్టి నిప్పును ఊహించినట్లే శబ్దాన్ని (Word) బటి

అర్థాన్ని (Thing) ఊహించటం జరుగుతున్నదిగదా కనుక శబ్ద ప్రమాణమంటూ వేరే లేదు. అది కూడ అనుమాన ప్రమాణమే.

కాదయ్యా, ఆ వస్తువునుఊహించవలసినపనిలేదు. అదీ ఎదురుగానే ఉన్నది అనుకుందాం, "బల్ల" అన్నప్పుడు ఆ బల్ల ఎదురు గుండా ఉన్నా లేకున్నా ఏ వస్తువయితే మనస్సుకు స్ఫురిస్తుందో అది శబ్దాన్ని అనుసరించే వున్నది గదా. మనం ఊహించే బల్ల వేరు, ఉన్నబల్ల వేరు కాదు గదా.

దీనిని బట్టి బల్ల అనే శబ్దానికి బల్లకూ ప్రత్యక్ష సంబంధం వుంది బల్ల అంటే గాలిపటం అనుకోము గదా. కాబట్టి శబ్దం కూడా అనుమానమేనని నాఅభిప్రాయం.

ఉత్తర పక్షం. యదార్థ జ్ఞానాన్ని కలిగింటాన్నే అప్తోపదేశామని (Trusty instruction) దేశ సామర్థం వుంది. శబ్దం వల్ల విషయజ్ఞానం కలుగుతుంది. ప్రతీ శబ్దం ఏదో ఒక వస్తువుకు, లేదా క్రియకు సంబందించినదేఅయివుంది.

బల్ల అను మాటకు బల్లకూఉన్న సంబంధం పొగకూ నిప్పుకూ వున్న సంబంధం వంటిది కాదు. శబ్దంవల్ల అర్ధసంప్రత్యయం (Firm conviction) కలుగుతుంది పొగవేరొక వస్తువయిన నిప్పును నిరూపిస్తుంది, శబ్దం తాను ఏ వస్తువుకు సంకేతమో దానినే నిరూపిస్తుంది.

అర్దమూ శబ్దమూఅన్యోన్యాశ్రితాలు.

పూర్వపక్షం : అర్థమూ శబ్దామూఅన్యోన్యాశ్రితాలు అని మీరంటున్నారు అంటే అది ఒకదానిని విడిచి ఒకటి ఉండవి కదా అర్థం అయితే వాటికిఅవినాభావ (Indivisible) సంబందం వుంటుంది.

కుండలో రేగుపళ్ళు వున్నట్లు అర్ధం (వస్తువు)లో శబ్దంఉందా? ఉంటే అది సంయోగ( Fusion ) సంబంధం అవుతుంది.

కాదయ్యా. నీటిలో ఉదజని ఆమ్లజని, సంలీనమయి వున్నట్లు శబ్దమూ, అర్ధమూ. (వస్తువు) సంలీనమయి వున్నాయని మీ అభిప్రాయ మా? ఉంటే అది సమవాయ సంబంధమవుతుంది,

అర్ధం (వస్తువు) ఎక్కడో దూరంగా వుంటున్నది. శబ్దం మన గొంతుకలో పుడుతున్నది. వస్తువుకు కంఠంలేదుగదా, కనుక సంయోగ సంబంధంలేదు,

కాదు, సమవాయసంబంధం వున్నదంటారా? అగ్ని అని మనం అనేసరికి నోట్లోంచి మంటలురావాలి. "చెరువు" అనే సరికి మన నోట్లోంచి నీరు వరదలెత్తి వెలువడాలి. అలాగూ కనపడటం లేదు.

కనుక శబ్దార్ధాలకు సంబంధంలేదు. పూర్తిగా అలా అనటానికి వీల్లేదు. "చెరువు" అనే సరికి చుట్టూ పెద్ద గటుతో ఏర్పడిన జలాశ యం స్ఫురిస్తున్నది. కనుక శబ్దార్ధ వ్యవస్థ ఉన్నది.

అదయినా నిక్కచ్చిగా ఉన్నదా? లేదు. శబ్దానికి నానార్థాలున్నాయి.

ఉదాహరణకి; "కరము" అనే శబ్దం ఉంది. దానికి చేయి, కిరణం, ఏనుగు తొండం, ఇంటిపన్ను, అడుగుబద్ధ హస్తానక్షత్రం, తెల్ల వరి, హింస, ముద్ర, ఇంద్రధనస్సు. అన్నము–అని అర్థాలున్నాయి. ఆ ఒక్కమాటతోనూ పదకొండు అర్థాలు (వస్తువులు) స్ఫురిస్తున్నాయి. ఒక శబ్దానికి ఒకఅర్థమంటూ లేని ఆ వ్యవస్థకూడా ఈ శబ్దార్ధ సంబంధంలో కనిపిస్తున్నది.

కనుక శబ్దార్థాలకు అవినాభావ సంబంధం అయినా ఉన్నట్లు తోచదు.

ఒక శబ్దానికి అనేక అర్థాలున్నట్లే ఒక అర్థానికి అనేక శబ్దాలు కూడా ఉన్నాయి. నీటికి నీరు, సలిలం, జలం, ఉదకం—ఎన్ని శబ్దాలయినా వున్నాయి.

బహుభర్తృత్వం అర్థానికీ, బహుభార్యాత్వం శబ్దానికీ ఉంటే శబ్దార్థాలకు శీలం నశించినట్లే కదా!

ఉత్తరపక్షం: కాదు. లోక వ్యవహారంలో ప్రతి వస్తువుకి కొన్ని ఆప్రాంతాలలో ఒకొక్క పేరు వాడకంలోకి వచ్చింది. ఆ ప్రాంతంలో ఆ వస్తువును ఆ పేరుతో పిలవటం సంప్రదాయం. ప్రాంతంలో ఆ వస్తువును ఆ పేరుతో పిలిస్తేనే అక్కడి వారికి అర్థమవుతుంది. అలా అర్థకావటాన్ని శబ్దార్థ సంప్రత్యయమని అంటాం. ఆ సంప్రదాయాన్ని సమయమని అంటాము. కనుక శబ్దార్థ సంబంధం సామయికమే ( Conventional ) గాని అవినాభావంకాదు.

సామయికత్వాచ్ఛబ్దార్థ సంప్రత్యయాస్య ఒకేవస్తువుకు ఒక్కొక్క ప్రాంతంలో ఒకే పేరుండటంవల్ల భాషా శాస్త్రవేత్తలు వాటినన్నిటినీ సేకరించి పదకోశం తయారుచేశారు. వాటినన్నిటినీ ఆ వస్తువు పేరుకు పర్యాయపదాలన్నారు. ఈ విధంగా వివిధ ప్రాంతాలవాచక పదాలను అందరికి అందుబాటులోకి తెచ్చారు.

ఆలాగే ఒకే పదాన్ని వివిధప్రాంతాలలో వేరువేరు అర్థాలకు వినియోగించటాన్నికూడా భాషాశాస్త్రకోవిదులు కనిపెట్టారు. కనుక ఆ పదానికి నానార్థాలుగా వాటిని పేర్కొన్నారు. మీదృష్టికది వ్యభిచారముగా కనిపించినా ఒకే ప్రాంతంలో వాడబడె ఒకేశబ్దానికి ఒకే నియమితార్థం ఉండటం గమనించాలి అందులో దోషంలేదు.

శబ్దానికీ అర్థానికీ ఉండే సంబంధం సంప్రత్యయము అనిచెప్పటం యిందుకే.

ప్రపంచంలో ఎన్నెన్నో జాతులున్నాయి. జాతిభేదాన్నివున్నా యో భాషా భేదాలన్నీ వున్నాయి. అన్నిదేశాలలోనూ, అన్ని భాషల్లోనూ ఒకే వస్తువుకు ఒకే పేరులేదు ? అలా ఉండాలన్న నియమమూలేదు. అలా చూసినా శబ్దార్థాల సంబంధం సామయికమే (According to context) గానీ, అవినాభావంకాదు. (Inseperable)

పూర్వపక్షం : శబ్దాలకు అనృత దోషం, వ్యాఘాతదోషం, పునరుక్తి దోషం ఉన్నట్లు కనిపిస్తుంది. చాలామాటలు ఏ వస్తువు మాద్యోతకంచేయ లేవు. ఉదాహరణకి అదృష్టం, ఐశ్వర్యంవంటి మాటలు వట్టిదొంగమాటలు నిరర్ధకాలు, కుండ, పెంకు, చెప్పువంటి మాటలకు ప్రత్యేకించి అర్థాలు (వస్తువులు) న్నాయి. కానీ ఈ అదృష్టం, ఐశ్వర్యంవంటి మాటలు కేవలం నిరర్థకాలేగదా అని ఏ వస్తువులకీ పేర్లు కాదు. ఆకాశం దిక్కులు వంటివి లేనేలేవు. ఉన్నట్లుగా చెప్పేపదాలన్నీ అనృత దోషానికి పాల్పడుతున్నాయి. ఆ మాటలు అబద్ధం చెప్పుతున్నాయిగదా. అందుకే వాటిని అదృష్టార్థ ప్రవక్తకములని అంటాము. దృష్టార్థ ప్రవక్తములయినవస్తువుల పేర్లలో అనృత దోషంలేదు. వస్తువులు మన కళ్ళముందే ఉన్నాయి గనుక.

రెండవది వ్యాఘాతం అసంబద్ధంగా చెప్పటం. ఉదాహరణ "దాని భరతం పడతా ''

ఇందులో భరతం పట్టటమంటే శిక్షిస్తానని అభిప్రాయం. కాని భరత శబ్దానికి ఆ అర్థంలేదు. భరతం ఒకానొక నాట్య విశేషం. ఇక్కడ భరత శబ్దాన్ని అసందర్భంగా అసంబద్ధంగా వాడినట్లు స్పష్టమవుతుంది.

ఈ వాక్యంలో "పట్టటం" మళ్లీ అసంబద్ధం వట్టుట అంటే పట్టుకొనుట అని అర్థం. ఇందులో పట్టుకోవలసిందేముంది ? భరతం పట్టువడ వలసిన విద్యయేగాని పట్టుకోవలసిందికాదు.

మూడవది పునరుక్తి: అనగా చెప్పిందే మళ్ళీ చెప్పటం సలిలం, జలం, ఉదకం. వారి-అనే పదాలన్నీ నీరుకు పర్యాయపదాలే. ఘనంగా చెప్పాలని ఒక అసామి నిర్మలోదక, సలిల, జల పూరితంబులైన తటా కంబులు అంటూ వ్రాశాడు. ఘోరం కదా.

అందుకే శబ్దాలకు అనృత దోషం, వ్యాఘాత దోషం, పునరుక్త దోషం ఉన్నాయని మనవిచేస్తూ శబ్దాన్ని ప్రమాణంగా తీసుకోరాదని హెచ్చరిస్తున్నాను.

ఉత్తర పక్షం అదృష్టం, ఐశ్వర్యం వంటి మాటలకు అనృతదోషం లేదు గాలి విద్యుత్తు ఆకర్షణవంటివి అదృష్టాకార ప్రవర్తృతములే. గాలి కంటికి కనబడనంత మాత్రాన అది లేకుండా పోదు. చర్మాన్ని తడుము తోనే ఉంది. విద్యుత్తుకూడా కనబడటం లేదని స్పర్శిస్తే ప్రాణాంతక మవుతుంది. అయస్కాంతానికి గల ఆకర్షణ కంటికి కనబడదు. అంత మాత్రాన లేదంటామా? సంపద అదృష్టమే అది గోప్యంగా ఉంచబడు తున్నది. ఈశ్వరశక్తియే ఐశ్వర్యం. అదిసర్వ వస్తుగతమై వ్యాపించి ఉంది. అదే విధంగా ఎల్లలు. దిక్కులు అదృష్టార్థాలుగా ఉన్నాయి. అవి నయనగోచరం కానంత మాత్రాన అనృతాలుకావు.

పూర్వపక్షం: నృతము కానిది అనృతం ఆ అర్థంలో చూస్తే చాలా వాక్యాలు అనృతంగానే తోస్తాయి. "అవును, తీసుకురా!" అని ఒకడన్నాడు. అది అనృతమే అవును ఎట్లా తీసుకురావాలో స్పష్టంగా

నిర్దేశించిలేదు. అందుకే ఆ వాక్యానికి అనృత దోషముందని మేమం టాము. ఈ రకం వాక్యాలు బద్ధంకానివి కనుక అబద్ధాలని కూడా అంటాము.

ఉత్తరపక్షం: ఏకార్యానికైనా కర్త, కర్మ సాధనం అనేవి ఉన్నాయి (ఈ సాధనాన్నే క్రియ అని అంటున్నాము.) ఇవి మూడూ అన్ని వాక్యాలలోనూ ఉంటాయి. ఎటొచ్చి కొన్ని వాక్యాలలో లుప్త మయి వుంటాయి. అట్లా లుప్తమయిన దానిని పూరించుకోవలసిందే.

తీసుకురా-అను సాధనం (క్రియ) "నీవు"కు వర్తిస్తుంది. 'నేను' కు తీసుకురా సాధనంకాదు. కనుక "(నీవు) ఆవును తీసుకురా" అని పూరించుకోవాలి, ఎలా తీసుకురావాలి?

"(నీవు) ఆవును (మెడకు త్రాడుకట్టి) తీసుకురా" అని పూరిం చుకోవాలి. ఈ వాక్యంలో కుండలీకరణాల మధ్యవున్న మాటలు అనృ తాలే. అనగా చెప్పబడినవి. అయినప్పటికి విధానాన్ని బట్టి అది విధి వాక్యం (Order) గనుక అందులో ఇమిడిఉన్నది కర్త. కర్మ. క్రియలు తమగుణాలు తప్పనందున ఆ వాక్యానికి అర్థదోషం కలగటం లేదు. అనృతం నృతమే అవుతున్నది.

పూర్వపక్షం: "చదువుతున్నాం" అను క్రియ ఉంది. ఎప్పుడు? నిన్ననా? నేడా? రేపా? నిన్నను చదువుతుంటే నేడు చదువుతున్నట్లు అవుతుందా? నేడు చదువుతుంటే రేపు చదువుతామని హామీ ఉందా? అందుకే మీరు చెప్పిన సాధనాలకు కూడా వ్యాఘాత దోషముంది. సాధ నకు కాలభేదం ఉండటమే కారణం.

ఉత్తరపక్షం: ప్రతిజ్ఞకు అస్థిరత్వం కలగటమే (Inconsistency of statement) వ్యాఘాతమని అంటాము.

సాధన (క్రియ)కు కాలభేదం ఉండటం వ్యాఘాతంకాదు. సాధనకి భూత, వర్తమాన, భవిష్యత్తులున్నాయి. నిన్న నీపాటికి చదువు చుంటిమి, నేడీ వేళ చదువుతున్నాము. రేపీపాటికి చదువుతూ వుంటాము. అని మూడు వాక్యాలలోనూ నిరంతర భూతకాలం ( Past continuous ) నిరంతర వర్తమానకాలం ( Present continuous ) నిరంతర భవిష్యత్కాలం ( Future continuous ) గుణాలు ఉన్నాయి. వాటిని అభ్యుపేత్యకాల భేదాలని అంటాము. భూత, వర్తమాన, భవిష్యత్కాలాలకు అవి ఏ మాత్రం వ్యాఘాతంకావు. కనుక దోషవచనాలూ కావు

పూర్వపక్షం : నిరంతర భవిష్యత్కాలం భవిష్యత్కాలంకన్నా భిన్నమయినదేకదా. "రేపు చదువుతాం" "కీ" రేపు చదువుతూ ఉంటాము. కూ తేడా ఉంది. అయినా రెండూ ఒకే కాలానికి చెందినవి కనుక వ్యాఘాతం లేదంటున్నారు. అనండి.

శబ్దవ్యాఘాతం సంగతి ఏమంటారు ? నాట్యం చేసేవాడు తన శరీరాన్ని వివిధ భంగిమల్లో త్రిప్పుతాడు. గురువుచేత దెబ్బలు తినేవాడుకూడా తన శరీరాన్ని వివిధ భంగిమలలో త్రిప్పుతాడు. అది కూడా భరతమేనా ?

ఒకే శబ్దంనుండి పరస్పర విరుద్ధ ఫలితాలు ఉత్పన్నంకావటంకంటే వ్యాఘాతమేముంది ? (శబ్దవ్యాఘాతం) (Contains opposite effects arising from the same word)

ఉత్తరపక్షం : వాఙ్మయం చిత్రమైనది. అది ప్రజల వాడుకనుంచే ఉత్పన్నమయింది. భాషలోగల పదాలన్నీ పదార్థాలకు సంకేతమే అయినా సంకేతం కానివి కూడా చాలా ఉన్నాయి వాటికే అనృతదోషముందని మీరన్నారు, అదృష్టముందని నేనన్నాను. పదార్థాలను ముందుగా గుర్తించి వాటికి పదాలను సృష్టించిన వారు ప్రజలు. పదార్థలు కాని వాటిని కూడా

గుర్తించి వాటికి పధార్ధలను సృష్టించిన వారూ ప్రజలే. తొలి చర్య కేవలం వస్తుపరమైనది. గనుక వాస్తవ (Materialistic) శబ్ధలయినాయి. మలి చర్య అవాస్తికం గనుక అధ్యాత్మిక శబ్ధాలు (Spiritual) ఉత్పన్నమయినాయి. అయాపదాలకు గల పరిమితార్ధలను గమనించి విశేషప్రయోజనాన్ని ఆశించితారు మారుగా ప్రయోగించటం ఉల్లాస ప్రక్రియ. అందులో ఆనందం ఉంది. అదే కవిత్వం.

వీధి అరుగుమీద గుక్కపెట్టి ఏడుస్తున్న పిల్లాడి గురించి తల్లి అంటుంది. వాడు సంగీతం తీస్తున్నాడని, దెప్పిపొడుస్తున్న పెళ్ళాన్ని మొగుడు "ఆమె సన్నాయినొక్కులు తొక్కుతోంది." అంటాడు. అల్లరి చేస్తున్న విద్యార్ధిని మందలించటానికిగాను గురువు "వాడి భరతం పడతా"నంటాడు. భాషకివి ఉల్లాస క్రీడలు. ఇందులో వ్యాఘాతదోషంలేదు. కొన్ని కొన్ని సందర్భాలలో శబ్దాలకు అర్ధాలనేకాదు. అర్థాంతరాలనికూడా గ్రహించపలసి వుంటుంది.

ఇక పునరుక్తి గురించి

ఇది రెండు విధాలుగా ఉంది. ఒకటి అర్ధవంతం. రెండవది అనర్ధవంతం. మీరుచెప్పిన పునరుక్తి అనర్ధవంతమే. కనుక దోషమే. అందుకు సందేహంలేదు. ఒకే భాషలో ఒక వస్తువుకు చాలా పేర్లుంటాయి. నీటికి సలిలం, ఉదకం, జలం వారి - ఇలా చాలా పేర్లున్నాయి. ఇవి పర్యాయ పదాలే. వాటిని కలగుచ్చి వాడటం తప్పుగాని ఒక్కొక్క పదంచొప్పున వాడటం తప్పుగాదు. వాడు, అతడు, ఆమె, అది వంటి సర్వనామాలకు పునరుక్తి దోషంలేదు. "నిర్మలోదక సలిలజల పూరితంబులైన తటాకంబులందు" అంటూ ఎవ్వడైనా చెపితే వాడికి భాషాజ్ఞానం లేనట్లు. ఉదకమో, సలిలమో. జలమో-ఏదో ఒకదానితో చేతులు కడుక్కుంటే ఈ పునరుక్తి దోషం పట్టేదికాదు.

అయితే వివిధ భాషలున్నాయి. ఒకే వస్తువుకు అన్ని భాషల్లోనూ తలో పేరూవుంది. ఆ పేర్లన్నీ ఆ వస్తువుకు పర్యాయ పదాలుకావుసుమా। ఆలా పొరబడేరు, ఒకే వస్తువుకు ఒక భాషలో వాడబడిన పేరుకూ మరో భాషలో వాడబడిన పేరుకూ మధ్య అనువాద సంబంధం మాత్రమే ఉంది, అవి పునరుక్తులు కావు.

ఒక్కొక్క చోట పునరుక్తి ఉక్తికి ద్విగుణీకృతబలాన్ని యిస్తుంది అప్పుడది గుణమే కాని దోషం కాదు. "రావయ్య రా రా." అని మిమ్మల్ని పిలిచాడనుకోండి, అందులో ఆప్యాయత ఆనందం కనిపిస్తాయి. మీ కోసం ఎదురుచూస్తున్నాని వ్యక్తమవుతుంది. తొందరగా రమ్మంటున్నాని అర్థమవుతుంది. అదే పునరుక్తిలోని అందం అది అర్థవంతం.

మళ్ళీ చెబుతా.

శబ్దాన్ని అర్థం అనుసరిస్తుంది. అలాగే వాక్యాన్ని కూడా అర్థం అనుసరిస్తుంది. "ఇలా రా. నీ భరతం పడతా" అని నేనంటే కొడతానని మీరనుకుంటున్నారు. భరత శబ్దాన్ని అనుసరించిన అర్థం నాట్యం. ఆ అర్థం నా వాక్యంలోంచి తొలగిపోయింది. భరత శబ్దానికి లేని అర్థం "కొడతా" అని కొత్తగా వచ్చింది. ఈ కొత్తగా వచ్చిన అర్థం వాక్యాన్ని అనుసరించి వచ్చింది ఆ వాక్యం చేసే అర్థాన్నిబట్టే ఆ శబ్దం సార్థకమో, విరర్థకమో అర్థాంతమో అవుతుంది,

వాక్యాలు ముఖ్యంగా మూడు రకాలుగా ఉన్నాయి. అవి 1. విధి వాక్యం 2. అర్థవాదవాక్యం 3. అనువాదవాక్యం అని ఇవి ప్రతిజ్ఞావాక్యాల Assertive sentence కన్నా భిన్నమయినవి.

నిజంచెప్పు : అబద్ధంచెప్పకు అను ఈ రెండు వాక్యాలతోను విధి, నిషేధాలు ఉన్నాయి. ఈ రకం విధి నిషేధవాక్యాలను Imperative sentences అజ్ఞాపక వాక్యాలని గుర్తించండి.

ఇక అర్ధవాద వాక్యాల (Purportive sentences) గురించి చెపుతాను ఇవి స్తుతి, నిందా, పరకృతి, పురాకల్పములని నాలుగు రకాలుగా ఉన్నాయి.

ఒక వాక్యాన్ని మరొక వాక్యం దీప్తమంతం చేస్తున్నట్లయితే ఆ రెండవ వాక్యాన్ని స్తుతి వాక్య ( Complementary sentence ) మని అంటాము. ఉదా: విద్వాంసులు సత్యవ్రతులు: సత్యవ్రతులు స్తవనీయులు మొదటి వాక్యం ప్రతిజ్ఞ. రెండవ వాక్యం స్తుతి.

పతిజ్ఞను రెండవ వాక్యం కృంగదీసినట్లయితే అది నిందావాక్యం ( Accusatory sentence ) ఉవుతుంది.

ఉదా: నిజంచెప్పటం అవసరం. నిజం చెప్పనివాడు దొంగ.

ఇక పరకృతి ( An Example ) ఉదాహరణ. వాక్యమే. అది నిదర్శనాన్ని ( Precedent ) వ్యక్తం చేస్తుంది. ఈ పరకృతి వాక్యాలను ( Exemplary sentences ) గమనించాలి. ఉదా: కర్పూరం తెల్లగా ఉంటుంది ఉప్పులాగ.

ఏ మార్పూలేకుండా అమ్రకుంతగా వస్తున్న వాక్యాలున్నాయి. సామెతలల్లాంటివి వీటిని పురాకల్పవాక్యాలు ( Proverbial sentences) అంటాము ఉదా: అయ్య వచ్చేదాకా అమావాశ్య ఆగదు.

ఇవీ అర్ధవాద వాక్యాలు ( Purportive sentences. )

ఇక అనువాద వాక్యాలు ( Corroborative sentences) గురించి చెప్పుకుందాం. వివరణాత్మకంగా తిరిగి చెప్పటాన్నే అనువాదమంటారు ప్రతిభాషలోనూ ఈ రకం విచిత్రమయిన అనువాద ధోరణికనిపిస్తుంది.

విధివాక్యానికిది వ్యాఖ్యగా ఉద్దేశింపబడుతున్నది. ఇది తప్పుకాదు. విషయ ప్రాచుర్యానికి దీని ఆవసరం ఎంతయినా ఉంది.

ఉదా: అన్నం తిను (విధివాక్యం)

అన్నంతింటే ఆయుష్షు పెరుగుతుంది: తేజస్సు కలుగుతుంది. బలం పుంజుకొంటుంది శరీరం సుఖపడుతుంది. శక్తి లభిస్తుంది. (అనువాదవాక్యాలు)

తిను, తిను, (పునరుక్తి)

ఈ రకం పునరుక్తి (Emphasis) అనువాదవాక్యాలను అనుసరించి వస్తూ విధి వాక్యాన్ని ద్విధా బలపరుస్తుంది. కనుక పునరుక్తి గుణమే కావి దోషం కాదు.

పూర్వపక్షం: ముంజేతి కంకణానికిఅద్దమెందుకని సామెత, పురాకృతం. అనువాదవ్యాక్యాలు విధి వాక్యాన్ని ఎలా బలపరస్తున్నాయో అలాగే పునరుక్తులు కూడా విధి వాక్యాన్నే బలపరుస్తున్నాయి చూస్తున్నాంగదా। ఆ రెండూ ఒకే ప్రయోజనాన్ని సాధిస్తుంటే వాటికి తేడా చెప్పటం అర్థం లేని పని అంటాను.

ఉత్తరపక్షం: అనువాద పునరుక్తులకు ప్రయోగం (Application) ఒకటే అయినా ప్రయోజనంలో తేడావుంది. అనువాదం విధి వచనం యొక్క అర్థాన్ని విస్తరింపజేస్తుంది. కర్మఫలాన్నివివరిస్తుంది అన్నంతింటే ఆయుష్షు పెరుగుతుంది-మున్నగు అనువాద వాక్యాలన్నీ అన్నం తినటం యొక్క ప్రాముఖ్యానే చెపుతున్నాయి తిను, తిను, అను పునరుక్తి క్రియను త్వరపెడుతోంది

ఇందుకు మంత్రశాస్త్రం ప్రమాణం, ఆయుర్వేదాదులు ప్రమాణం. అవి ఆప్త వాక్యాలు.

# నాల్గవ ఆహ్నికము

## ప్రమాణసంఖ్యలు

పూర్వపక్షం: మీరు ప్రత్యక్షం, అనుమానం, ఉపమానం శబ్దం అనునాలుగే ప్రమాణాలని చెప్పారు. ప్రత్యక్షానుమానోపమాన శబ్దాః ప్రమాణాని అని కదా చెప్పారు.

నా దృష్టికి 1. ఐతిహ్యం 2. అర్థాపత్తి 3. సంభవం 4. అభావం అని మరో నాలుగు ప్రమాణాలు కూడా ఉన్నట్లు తోస్తుంది.

వస్తువుకు చరిత్ర ఉంది. భవిష్యత్తు ఉంది. ఈ రెండూ ఆ వస్తువుకు పూర్వాపరాలై వున్నాయి. ఈ పూర్వాపరాలే ఆ వస్తువుయొక్క పరిణామాన్ని ( Evolution ) తెలియజేస్తాయి. వస్తువు యొక్క ఉత్పత్తి స్థితి, లయలకు సంబంధించిన జ్ఞానమే ఐతిహ్యం.

ఒక కుండ ఉన్నది. దానిని తయారు చేయటంలో ఏమట్టివాడ బడింది? ఏ కుమ్మరి తయారు చేశాడు? ఏ విధంగా ఏ సాధనంతో ఆ మట్టిని ఆ కుమ్మరి కుమ్మాడు? ఏసారెపై ఏ విధంగా కుండను తయారుచేశాడు? ఎంతకాలం ఆ పచ్చికుండను ఆరబెట్టాడు? ఎన్ని డిగ్రీల ఉష్ణోగ్రతలో దానిని కాల్చాడు? ఇదంతా తెలుసుకోవాలి. అలా తెలుసుకున్న జ్ఞానాన్నే ఐతిహ్యజ్ఞానమని అంటాము. ఈ రకం ఐతిహ్యజ్ఞానం ( Historical knowledge ) అవసరం.

రెండవది: అర్థాపత్తి ( Invention ) ఇది ఉపపాద్యం ద్వారా ఉపపాదకాన్ని నిర్ణయిస్తుంది. ఉపపాద్యమనగా తెలిసిన విషయం. ఉపపాదకమనగా మనంచేసే ఊహ. శాస్త్రజ్ఞులు తమకు తెలిసిన శాస్త్ర జ్ఞానాన్ని ఆధారం చేసుకొని క్రొత్త వస్తువుల్ని నిర్మించటానికి ప్రయ

త్నిస్తారు. ఆ కొత్త వస్తువు అంతకు పూర్వం ఉనికిలో లేదు. ఫలానా విధంగా నిర్మిస్తే ఆ వస్తువు ఫలానా విధంగా పనిచేస్తుందన్న ఊహయే ఉపపాదక విషయం. అలా ఊహించి సాధించిన శాస్త్రజ్ఞులు ఎందరో ఉన్నారు. దీనినే అర్థాపత్తి ( Invention ) అంటాము.

వాఙ్మయంలో అర్థాపత్తి ( Deduction ) ఉంది. తెలిసిన రెండు విషయాలను ఆధారం చేసుకొని తెలియని మూడవ విషయాన్ని సాధించటం. అదెలాగో చెపుతా!

"రాముడు వచ్చివెళ్ళాడు" ఇదొక విషయం.

"ఆమె నగలు పోయాయి" - ఇదొక విషయం - ఈ రెండూ ఉపపాద్యాలు, వాటికి సందేహంలేదు. రాముడు వచ్చి వెళ్ళిన తరువాతనే ఆమె నగలు పోయాయి. ఇదిజ్ఞానం. దాని నుండి "రాముడు ఆమె నగలని అపహరించాడు" అను ఉపపాదకం కలుగుతోంది వాస్తవ పరిస్థితుల్ని ఆధారంగా తీసుకుని చేసే నిర్ణయాన్నే అర్థాపత్తి అవి వాఙ్మయ బహిష్కృతలంటున్నారు. ఈ విధంగా అర్థాపత్తి ప్రమాణం మవుతున్నది.

మూడవది : సంభవం ( Possibility ) ఇది రాగి తీగె అనుకుంటాం, అందులో విద్యుత్తు ఉండవచ్చు. రాగి తీగెలో విద్యుత్తు సంభవమే గదా, ఒక వస్తువు యొక్క సత్తాజ్ఞానంలో మరొక వస్తువు యొక్క సత్తా ( Existence ) జ్ఞానం ఇమిడిఉంటుంది ముడిరాగిలో బంగారం ఉండే అవకాశం ఉంది. కుంచెడు బియ్యంలో నాలుగు మానికల బియ్యం లేవా?

నాల్గవది: అభావం ( Nonexistence ) ఇత్తడి యందు బంగారం లేకపోవడం: లేక పోవటమే అభావం.

గుర్రాల్నీ గాడిదల్నీ బయటకు తోలమన్నారు,

గు ర్రా ల్నీ బయటకు తోలివేశాం, గా డి ద లు న్నా యి. వాటినీ తోలివేశాం, అశ్వతరులున్నాయి (ఆడ గాడిదకు మగగుర్రం వల్ల పుట్టిన జంతువులవి) వాటిలో గుర్రము అభావం, గాడిద అభావమే. వాటిని తో లి వే యా లా, అక్కర్లేదా? ఈ సందిగ్ధస్థితి అభావం వల్ల కలిగింది. కనుక అభావం ప్రమాణమవుతున్నది. విద్యుత్తులేని రాగి తీగెల్లో విద్యుత్తు ఉండదు. అది అభావమే. అయినా వాటిని విద్యుత్తు తీగలనే అంటాము ఈ విధంగా కూడా "అభావం" ప్రయాణమవు తున్నది.

ఉత్తరపక్షం: శబ్దము నందు ఐతిహ్యం అంతర్భావమయి వున్నది అనుమాన ప్రమాణంలో అర్థాపత్తి, సంభవం, అభావం యిమిడి ఉన్నాయి.

ఐతిహ్యాదులు ప్రమాణాలే. కాని, అవిఇంతకు ముందుమేము చెప్పిన నాలుగు ప్రమాణాలలోనూ యిమిడి ఉన్నాయి. కనుక వాటిని వేరే పేర్కొనవలసిన పని లేదు.

"కుండ" అన్నామనుకోండి దానిని ఏ మ ట్టి తో. ఏసారెపై ఏ కుమ్మరి తయారు చేసినా, ఏ ఉష్ణోగ్రతలో కాల్చినా, ఏ ప్రయోజ నాన్ని సాధించినా ( ఉదా: మంచి నీళ్ళ కుండ, ఊరగాయకుండ ) అది కుండయేకదా! కుండతో బాటు దాని ఐతిహ్యమూ, ప్రయోజనమూ అను సరించే ఉన్నాయి. అవసరమయితే అయా విషయాలను ఆలోచిస్తాం, అవసరం లేకపోతే కేవలం కుండ గురించే ప్రసంగిస్తాం.

పొగను అనుసరించి నిప్పు ఉండటం అనుమానమే కదా? రాముడు వచ్చి వెళ్ళగానే వస్తువులు పోవటం జరిగితే - ఆరెండింటినీ

అనుసరించి రాముడు దొంగ అనే అనుమానం కలుగుతోంది. కనుక అర్థాపత్తి అనుమానమే గాని వేరే ప్రమాణం కాదు. ఉపపాద్యాన్ని అనుసరించి ఉపపాదకం ఏర్పడుతున్నది; పొగను అనుసరించే నిప్పు ఊహింపబడుతున్నది. పొగ ఉపపాద్యమయితే నిప్పు ఉపపాదకం కాదా? అందుకే అర్థాపత్తి అనుమానమవుతున్నది.

ఏది సంభవమనుకుంటున్నామో అది కూడా వస్తువులోనే ఉంది. కుంచంలో నాలుగుమానికలున్నాయి గదా! ఇది భావసంభవమే కనుక అనుమాన ప్రమాణమయింది.

అసంభవతే "అభావ" మయింది. ఒక వస్తువులోగాని, ఆ వస్తువును అనుసరించిగాని మరో వస్తువు ఉన్నదను భావం ఎంతఅనుమానమో, లేదను భావం కూడా అంతే అనుమానం. కనుక "అభావం" కూడా అనుమానమే.

మీరు చెప్పిన నాలుగూప్రమాణాలే. అవి నేను చెప్పిన నాలుగు ప్రమాణాలలోనూ రెండింటికి అంతర్భాగాలు. కనుక వాటిని అంగీకరించవలసిన పనిగాని, తృణీకరించవలసిన అగత్యంగాని కనిపించటంలేదు. వాటి యందు నాకు "అభావ"మే కలుగుతున్నది.

పూర్వపక్షం: "అర్థాపత్తి ప్రమాణమ్ అనైకాంతికత్వాత్ అంటున్నాము.

నేను అర్థాపత్తిని ప్రమాణంగా ప్రతిపాదించాను. మీరు దానిని అనుమానభాగంగా అంగీకరించారు. అది అన్యాయం.

అర్థాపత్తికి వ్యభిచారదోషముంది అందుకే అది అనుమాన ప్రమాణంకాదు. మేఘాలు లేకపోతే వర్షాలు కురియవు అవునా? కనుక ఈ మేఘం వల్ల వర్షం అనుమానింపబడుతున్నది. పొగకీ, నిప్పుకీ, మధ్య సంబంధమే

అనుమానమయితే మేఘం పట్టినప్పుడల్లా వర్షం కురిసి తీరాలి. ఒక్కొక్కప్పుడు మేఘాలు గంభీరంగా పట్టినప్పటికీ వర్షం కురవదు. మేఘం లేకుండా వర్షం కురవదనేది సత్యమే అయినా మేఘం ఉన్నప్పటికీ వర్షం కురవక పోవటం సత్యమవుతుంది. పొగ వుంటే నిప్పు ఉండి తీరాలి నిప్పులేనిదే పొగ ఉండదు ఇదే అనుమానానికీ, అర్థాపత్తికీ తేడా. అనుమానానికి వ్యభిచారదోషం లేదు. అర్థాపత్తికి వ్యభిచారదోషం ఉన్నది కనుక అర్థాపత్తిని వేరే ప్రమాణంగా తీసుకోవాలేగాని, దానిని అనుమానంలో అంతర్భాగం చేయకూడదు.

ఉత్తరపక్షం: దోషం మీ ప్రతిపాదనలోనే ఉన్నది. అర్థాపత్తి లేని దాని యందు మీరు అర్థాపత్తిని అపాదించటం వల్లనే వ్యభిచార దోషం కనిపిస్తుంది. కారణం లేకుండా కార్యం జరగదు. కార్యానికి తగిన కారణాలున్నప్పటికీ, విపరీత కారణాలవల్ల కార్య భంగమవుతుంది. ప్రతిబంధక కారణాలనే విపరీతమని అంటాము. కారణముండీ కార్యం జరగక పోవటం అర్థాపత్తి కాదు. అది అర్థాపత్తి యొక్క అభాస అవుతుంది. దానినే అనర్థాపత్తి అంటాము

వర్షమేఘములువున్నమాట నిజమే ఏదైనా విపరీత కారణ ముంటే తప్ప వర్షం కురుస్తుంది. అకస్మాత్తుగా గాలివీచింది. ఆ మేఘాలు చెల్లాచెదురై వర్షం కురియలేదు. ఇది అనర్థాపత్తి.

కనుక వ్యభిచారదోషం ఉండటం వల్లనే అర్థాపత్తి ప్రమాణం కాలేదన్న అభిప్రాయం సరియైనది కాదు అర్థాపత్తి ఉన్నది. అనర్థాపత్తి ఉన్నది. అర్థాపత్తికి గల విపరీత కారణాలు దాని వ్యక్తిత్వాన్ని తొలగించలేవు.

అర్థాపత్తికీ, అనర్థాపత్తికీ తారతమ్యాన్ని గ్రహించండి అర్థాపత్తి అభావమయినపుడు అనర్థాపత్తి అవుతుంది. కనుక అర్థాపత్తికి వ్యభిచార

దోషము లేదని చెప్పవచ్చు. దానికి విపరీత కారణాలు లేనప్పుడే కార్యము జరుగుతుంది. అట్టి అర్థాపత్తి అనుమానంలో భాగమే అనడానికి సందేహంలేదు.

పూర్వపక్షం: అభావమనగా లేనిది లేనిది ఉన్నట్లు ఎలా అవుతుంది? లేని దానిని అనుమానంలో ఒక భాగంగా ఎలా చెపుతారు? అనుమానం, ఉన్నదాని లక్షణాలలో ఒక దానిపై ఆధారపడి ఉంటుంది. కనుక అభావానికి ప్రమేయంలేదు. ప్రమేయంలేని దానికి ప్రమాణం లేదు.

పూర్వపక్షం: లక్షితులు. అలక్షితులు కలిసి ఉంటారు. లక్షణ అభావము వల్లనే లక్షితులైనవారు. లక్షితులు కానివారు వేర్పడుతున్నారు లక్షణమే లక్షితుల్ని అలక్షితుల్ని వేర్పరుస్తున్నది.

లక్షణమనగా గుర్తింపు, లేదా సూచన, కనుచూపు అను లక్షణంతో లక్షితులైనవారు, ఆవిధంగా లక్షితులుకానివారు అను రెండు వర్గాల వారు వున్నారు. లక్షితులు కాని వారియందు ఈక్షిత లక్షణం (కనుచూపు) ప్రసరింపబడలేదు. ఈ విధంగా లక్షితులు, అలక్షితులు ప్రమేయములే అవుతున్నారు. భావప్రమేయము లక్షితులయందును. అభావ ప్రమేయము అలక్షితుల యందును ఏర్పడుతున్నది.

కొందరు యువకులు గుమిగూడి ఉంటారు వారినందరిని గురువు కలియచూసి అందులో విద్యార్థులైన వారిని తన చూపులతో లోపలకు రమ్మంటాడు. వారు లక్షితులు, గురువు అలక్షితులను కూడా చూడటం జరిగింది. వారు విద్యార్థులు కారని గ్రహించి, విద్యార్థులను మాత్రమే లోపలకు రమ్మనటం జరిగింది. కనుక విద్యా (అ)భావమునకు లక్షితులైనవారు అలక్షితులయ్యారు. అనగా వారు అభావమునకు ప్రమేయములయ్యారు. లక్షితులైన విద్యార్థులు కూడా విద్యాభావమునకు

లక్షితులయినందున ప్రమేయములే అయ్యారు. కావున అభావమునకు ప్రమేయము లేదనటం సరికాదు.

యో యస్యఅభావః సతస్య ప్రతియోగీ అని సూత్రము. ఏది లేదనుకున్నామో అది గల వస్తువు దానికి ప్రతియోగి అని చెప్పబడు చున్నది. గిన్నెను చూపి అది కుండ కాదనుకొంటాము. కుండ గిన్నెకి ప్రతియోగి. అనగా ఒక వస్తువుకు పూర్తిగా విరుద్ధమయిన మరియొక వస్తువు.

కుండకు సంబంధించిన జ్ఞానం మనకు ఉన్నది. అలాగే గిన్నెకు సంబంధించిన జ్ఞానము కూడా మనకున్నది. కనుక గిన్నెలో మనకు కుండకు సంబంధించిన జ్ఞానం కలుగదు. అది అభావమే. ఒక వస్తువునకు సంబంధించిన జ్ఞానము కలగటాన్నే ప్రతియోగికాభావం అంటారు.

కుండకు సంబంధించిన అభావము కుండలో కలుగదు గిన్నెలో కలుగుతుంది గిన్నెను చూపి ఇది కుండ కాదు — అనుకుంటాము. అభావము ఈ విధంగా ప్రమేయమయి ప్రమాణవంత మవుతుందనుటలో దోషం లేదు.

ప్రతియోగి (A thing dependent on another and not existing without it) కుండ అనుభావన కుండ ఆకృతిపైనే ఆధారపడి ఉంటుంది : ఆ ఆకృతి లేకుండా కుండలేదుగదా !

పూర్వపక్షం : గురువు విద్యార్థులను లోపలికి రమ్మన్నారు. విద్యార్థులు తమకుగల విద్యార్థనా (అ)పేక్ష లక్షణమును పురస్కరించుకొని లోపలికి వెళ్ళారు. అదే సమయంలో పామరులు తమలో విద్యార్జనాపేక్ష

లక్షణములేక పోవటం చూసుకొని వారు లోపలికి వెళ్ళలేదు అది అభావ ప్రతిపత్తి (Knowledge of non-existence కావున విద్యార్థులకు భావ ప్రతిపత్తి కలిగినట్లే, విద్యార్థులుకానివారికి అభావప్రతిపత్తి కలగటంలో దోషం లేదు.

పూర్వపక్షం : ఒకే లక్షణాన్ని అనుసరించి భావము. అభావము కలగటం వ్యాఘాతమే (Contradiction) కదా ?

ఉత్తరపక్షం : లక్షణాన్ని అనుసరించి వచ్చే భావాభావములందు పరస్పర వ్యాఘాతములేదు. విద్యార్థులు పామరులు గుమిగూడి వున్నప్పుడు విద్యార్థి ప్రతిపత్తిలేదు విద్యార్థులుకాని వారికి తాము విద్యార్థులము కాము అన్న ప్రతిపత్తికూడా లేదు. అందరిలోనూ ఏకభావమే వున్నది. అందరిలోనూ విద్యాసంబంధమైన అభావము మాత్రమే వున్నది దీనిని ప్రాగభావమని అంటారు గురువు విద్యార్థుల్ని ప్రత్యేకించి లక్షించటంతో విద్యార్థులలో తాము విద్యార్థులమన్న ప్రతిపత్తిన్నీ, విద్యార్థులుకానివారిలో తాము విద్యార్థులం కామన్న ప్రతిపత్తిన్నీ ఏకకాలమందు కలిగాయి ఈ విధంగా ఒకే లక్షణం రెండింటికీ హేతువైంది. అభావ Is non-entity. A proof from Non-existent calls కణాద. Gowthama denies it stating అభావ as the knowlenge of the existing from its non-existence.

ఈ విధంగా ప్రాగభావమునుంచి భావం అభావం విడిపోయిన తరువాత తిరిగి ఏకమైతే అప్పుడు ప్రధ్వంసాభావము ఏర్పడుతుంది. ఆ తరువాతనే వారు అన్యోన్యాభావముతో కలిసివెళ్ళిపోతారు. ఈ విధంగా గురువు పిలవకముందు ఉన్న ప్రాగభావంకన్నా పిలిచివెళ్ళిన తరువాత కలిగిన అన్యోన్యాభావమే అత్యంతాభావమని చెప్పబడుచున్నది. భూత,

వర్తమాన, భవిష్యత్కాలములందు ఏది ఒకే విధంగా ఉండదో అది అత్యంతాభావమే. ఏ శబ్దమయినా అత్యంతాభావాన్నే కలిగివుంటుంది.

పూర్వపక్షం : శబ్దం త్రికాలబద్ధంకాదు. కనుక అనిత్యమని చెప్పవచ్చా ?

ఉత్తరపక్షం : శబ్దానికి ఆది వుంది. అది ఇంద్రియంచే గ్రహింపబడుతున్నది. ఉత్పన్నంచేయబడుతున్నది. కృతకమయి ఉన్నది. ఈ కారణాలవల్ల శబ్దం అనిత్యమేగాని, నిత్యంకాదు.

పూర్వపక్షం : ఆది (Beginning) కలిగినంతమాత్రాన అనిత్యమనటం సబవుకాదు. ఒకసారి తయారయినకుండలు బద్దలుకాకపోతే యుగాంతందాకా ఉంటాయి. ఆ తరువాతకూడా ఉండవచ్చు.

ఇక ఐంద్రియకత్వం సంగతి-

ఇంద్రియాలచేత గ్రహింపబడునది ఐంద్రియకమనిగదా అర్థం.

ఏ శబ్దమయినా మనకు భావాన్ని కలిగిస్తుంది. "గోవు" అని మనం అన్నా, లేదా ఏదయినా ఆవు "అంభా" అని అరిచినా మన చెవి ఆ శబ్దాన్ని గ్రహించేమాట నిజమే గోవులు మన చెవుల్లో దూరవు కదా! ఆశబ్దం మన చెవుల్లో ప్రవేశించి మనస్సుకు గోత్వాన్ని అందిస్తుంది. గోవుపోయినా మన మనస్సులో గోత్వం శాశ్వతంగా ఉంటుంది. గోవునుంచి గోత్వానీ పటంనుంచి పటత్వాన్నీ ఘటంనుంచి ఘటత్వాన్నీ మన మనస్సు గ్రహిస్తుంది. ఈరకం జ్ఞానం కూడా ఐంద్రియకమే. అట్టిజాతి జ్ఞానము నిత్యమేగాని అనిత్యంకాదు.

"యే నేంద్రియేణ యావ్యక్తిర్గృహ్యతే, తేనేంద్రియేణ తద్గతా జాతిః తదభావశ్చగృహ్యతే-ఏ ఇంద్రియంచేత ఏ వ్యక్తి (వ్యక్తమయి

నది) గ్రహింపబడుతుందో ఆ యింద్రియంచేతనే దానికి సంబంధించిన జాతి, దాని అభావము గ్రహింపబడతాయి.

"అనంతాకాశంలో భూమి ఒక భాగమయి ఉన్నది'' - అనే వాక్యంలో భూమిని ఆకాశంలో భాగంగానే చెప్పటం జరుగుతున్నది. అనిత్యమగు భూమి నిత్యమగు ఆకాశంలో భాగమెట్లాఅవుతుంది? కృత కం కనుక భూమి అనిత్యమే అని అంటే, ఆకాశం అకృతం కదా!

ఈ విధంగా చూస్తే ఆదిమత్వము (Original) ఐంద్రియకం (Organic) కృతకమా (Artificial) అని శబ్దఅనిత్యత్వాన్ని నిరూపిస్తూ మీరు ప్రతిపాదించిన కారణాలకు వ్యభిచారదోషం కనిపిస్తున్న దంటున్నాను.

ఉత్తరపక్షం: నిత్యత్వం రెండు రకాలుగా ఉంది ఒకటి తత్వని త్వత్వము. 2. భాక్తనిత్యత్వం అని తత్వ (Real) నిత్యత్వాన్నికే ముఖ్యనిత్యత్వమని (Primary) పేరు. ఉత్పత్తి వినాశనాలులేని నిత్య త్వమది. ఆకాశం అలాంటిది.

భాక్తనిత్యత్వంలో (Secondary) ఉత్పత్తి వినాశనాలు ఉంటా యిగాని. దాని కతీతమయిన భావన మాత్రం శాశ్వతంగా ఉంటుంది. ఘటానికి (కుండ) ఉత్పత్తి నాశనాలున్నాయి ఘటాత్వాన్నికి ఉత్పత్తి నాశనాలులేవు ఘటత్వం తత్తనిత్యత్వాన్ని కలిగినదవుతుంది. బాక్త (Secondary) నిత్యత్వానికే గౌణ (Which is dependent on some other thing) నిత్యత్వమని మరోపేరు.

పూర్వపక్షం : "ధ్వంసాప్రతియోగిత్వమ్ నిత్యత్వమ్" కుండయొక్క ఉనికి దాని ధ్వంసతమీదనే ఆధారపడివుంది. ధ్వంసత

ఏక్షణంలో ప్రారంభమయినా కుండ ఉనికిలేదు. కనుక ఒక వస్తువుకు ప్రతియోగి( Dependence ) దాని ధ్వంసతయే అని చెప్పాలి.

చరాచర సృష్టియొక్క పరిణామం ఈ అనునిత్యధ్వంసత్వం పై ఆధారపడే సాగుతున్నది· ఉత్పత్తిగల ఏ వస్తువుకైనా నాశనం ఉంది. వస్తువు ధ్వంసంకావటమే కదా నాశనం! అది అనునిత్యంకావచ్చు. ఆకస్మికం ( Accidental ) కావచ్చు

కనుకనే మీ అదిమత్వకారణానికి వ్యభిచారదోషం కలుగుతోంది.

ఉత్తరపక్షం: ఉత్పత్తిలేకుండా ధ్వం స ం లే దు. ధ్వంసానికి నాశనంలేదని మీరంటున్నారు. నేను దానితో ఏకీభవిస్తున్నాను. ఉత్పత్తే లేనప్పుడు ధ్వంసం మాత్రం ఎలా ఉంటుంది? కనుక ఉత్పత్తికూడా అనునిత్యం కావచ్చు, ఆకస్మికంకావచ్చు. అనునిత్యధ్వంసంగలవాటికి అంతమూ, అనునిత్యోత్పత్తి గలవాటికి ఆదీ లేవు.

"సంతానానుమాన విశేషణాత్"

అసంఖ్యాకమైన కుండలు నిత్యమూ తయారు అవుతూనేవున్నాయి ధ్వ సమయేవి అవుతూనేఉన్నాయి. కొత్తవి పుడుతూనేఉన్నాయి. ఇలా పరంపరగా కుండల వ్యవస్థకొనసాగటాన్నే "సంతానం" (Succesion) అంటాము.

ఈ సంతానకారణాన్నికూడా మనం దృష్టిలో పెట్టుకోవాలి ఈ కుండల పరంపర మనకు ఎకాకారబుద్ధిని కలిగిస్తుంది (బహు షేకాకారబుద్ధి సంతవ్యతేనేన ఇతి) ఈ విధంగా కుండరికం నిత్యమే అవుతుంది.

ఈ పారంపర్యభావననే మనం "సామాన్యం" (Common) అంటాము.

శబ్దం ఈ విధంగా సామాన్యవంతమై ఐంద్రియకమవటంచేత అనిత్యమవుతున్నదని మా అభిప్రాయం. గోసంతానం ఉంది. అదే గోసామాన్యం. గోత్వానికి ఆ సామాన్యంలేదు.

అలాగే శబ్దత్వానికికూడా సామాన్యంలేదు. శబ్దసామాన్యం ఉంది. దేనికి సంతానం కలుగుతుందో అది నశిస్తుంది. కనుక శబ్దం అనిత్యమే.

ఇక మూడవ హేతువుగురించి :

కారణద్రవ్యస్య ప్రదేశశబ్దే నాభిధానాత్

ఆత్మ ఉండే చోటును "ఆత్మ ప్రదేశ" మని అంటాము. ఆకాశంలో ఏదో ఒక చోటును "ఆకాశైకదేశ" మని అంటాము. నిజంగా ఇవి ప్రదేశాలేనా ? కావు. అయినా లోక వ్యవహారంకోసం కారణద్రవ్యములు (భూమి వగైరా) కాని వాటిని ప్రదేశశబ్దంద్వారా పేర్కొనటం జరుగుతున్నది.

ఈ రకం ప్రయోగాలను గౌణమని అంటాము. (గౌణం (Attribution) ఆకాశానికీ, ఆత్మకీ ప్రదేశమంటూ లేకపోయినా ఉన్నట్లు చెప్పటం ఆపాదించటమే గదా !

ఆకాశం, ఆత్మ ఆద్యంతాలు లేనివి. ఐంద్రియకములుగావి, కృతకాలుగావి కావు. అవి నిత్యాలే. ఎటొచ్చి శబ్దాలే అనిత్యాలు.

ఎలాగో చెపుతా :

ఉచ్చారణకు పూర్వం శబ్దంలేదు. పోనీ శబ్దాన్ని అలా ఉచ్చరించకుండా నిరోధించే ఆవరణాలేమయినా ఉన్నాయా అంటే అవీ కనబడవు. శబ్దం అనంతవాహినివలె వెలువడటానికి బదులు. ఏ ఆవరణా ఆటంకపరచ

కుండానే, తనంతతా పుట్టకుండా ఎవరోపనిగట్టుకు ఉచ్చరిస్తేనే పుడుతోంది. అందుకే అది నిత్యంకాదన్నాను.

ఉత్తరపక్షం : మంచిపని చేశారు. మనం నోరుమూసుకు కూర్చుంటే శబ్దం ఎలా పుడుతుందండీ ? శబ్దానికి కనబడని ఆవరణ కనబడకుండా ఉన్నందువల్లనే ఉచ్చరిస్తేగాని పుట్టటం లేదు.

శబ్దం ఎప్పుడూ వుంది. ఎటొచ్చీ దానికి ప్రతిబంధకమయిన ఆవరణాదులు నిరోధిస్తున్నాయి. నోటమాట రాకపోయినా మనసులో ఆ మాట వుంటోందిగదా ! ఉచ్చరింపక పూర్వమే శబ్దం ఉన్నట్లు దీనికర్థం. కనుకనే నేను శబ్ద నిత్యమంటున్నాను.

ఉచ్చారణకు పూర్వమే లభించవలసిన శబ్దం లభించకుండా ఉందంటే దానికి ఆవరణ వున్నదని తెలిసిపోతోంది ఆవరణ లేదంటారేమిటి ?

ఉత్తరపక్షం: శబ్ద యొక్క అనుపలబ్దికి కారణం ఉచ్చరింపక ముందు అదిభావాత్మకమయి వుండటమే శబ్దాత్మకంగా లేదు, భావాత్మకమయి ఉన్నదానికి ఆవరణేలేదు.

పూర్వపక్షం: "అస్పర్శత్వాత్ - శబ్దానికి స్పర్శ గుణంలేదు. ఆకాశానికి స్పర్శ గుణం లేదు. అందుకే అవి నిత్యాలు.

ఉత్తరపక్షం "న కర్మానిత్యత్వాత్" ఆకాశానికి కర్మలేదు. శబ్దానికికర్మఉంది. కర్మ అనిత్యమేగాని నిత్యంకాదు స్పర్శలేకపోతేపోతే పోనీ దానికర్మ సంగతి?

పూర్వపక్షం: శబ్దం అణువులాంటిది, దాని పని అదిచేసుకుపోతూనే ఉంటుంది.

ఉత్తరపక్షం: "నా అణునిత్యత్వాత్" అణువులకు మాత్రం నిత్యత్వం వుందా? అణువుకు భాక్త నిత్యత్వంవుంది. అది ఏలిం దంటే....? శబ్దానికి ఆశక్తి లేదు. అది వస్తువే కాదు.

పూర్వపక్షం: "సంప్రదానాత్" - అవునండీ శబ్దంవస్తువే, ఇచ్చే వాడొకడు పుచ్చుకునేవాడొకడు వున్నారు. గురువుగారు శబ్దాన్ని సంప్ర దానంచేస్తారు. శిష్యుడు స్వీకరిస్తాడు.

ఉత్తరపక్షం: ఆ మాట నేను ఒప్పుకోను. గురుశిష్యులు దాత ప్రతిగ్రహీతలు కావటానికి శబ్దం కనబడే వస్తువేంకాదు.

గురువుగారు దానం చేస్తూ ఉంటే, శిష్యుడు తీసుకొంటూ వుంటే ఆ యిద్దరికీ మధ్య అంతరాళంలో ఆ వస్తువు గుమ్మడికాయలా స్పష్టం గా అవస్థితమయి (చతకిలబడి) కనిపిస్తూ వుంటుంది. శబ్దం అలా కన బడదు గనుక నువ్వు చెప్పింది తప్పు.

పూర్వపక్షం: అధ్యాపనా దప్రతిషేధః గురువుగారు గడగడ పాఠం చెపుతూ ఉంటే ఆయన సంప్రదానం చేసిన మాటలన్నిటినీ శిష్యుడు గ్రహించటమే గదా ఆధ్యాపకత్వ ప్రయోజనం? కనుక శబ్దం సంప్రదానమే.

ఉత్తరపక్షం: గురుశిష్యులను ఉభయపక్షాలు మరొక విషయం గురించి సాధనం చేయటమే ఆధ్యాపకత్వం. అందులో సంప్రదానం లేదు.

గురువుగారి ప్రతిమాటా శిష్యుడి చెవిలో పడటం, నృత్యోపదే శంలా శిష్యుడు దానిని అనుకరించటం అధ్యాపనం కాదని వాత్స్యాయ నుడన్నాడు. అధ్యాపనం సంప్రదానానికి సాధనం ( లింగం ) కాదన్నాడు గురుశిష్యులిద్దరి మధ్యా అది చర్చఅన్నాడు.

అందుకే గురుశిష్యులిద్దరూ పాఠ్యారంభసమయంలో

ఓం

సహనావవతు

సహనౌభునక్తు

సహవీర్యంకరవావహై

తేజస్వినా వధీతమస్తు

మావద్విషావహై

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

అని ప్రార్థన చేస్తున్నారు.

పూర్వపక్షం: 'అధ్యాసాత్' ఒకశబ్దాన్ని ఒకవిధంగా ఉచ్చరించినపుడే ఆదిమాట అవుతుంది. ఆమాటను ఎన్నిసార్లు పలికినా అదేవిధంగా ఉచ్ఛరించాలి ఒకమాటను సమస్తజనులూ ఒకే విధంగా ఉచ్ఛరించటం నేర్చారు. ఇది అభ్యాసమే.

ఈ విధంగా సమస్తజనుల అభ్యాసంలో పడి ప్రతిమాటా, ప్రతి శబ్దమూ నిత్యత్వాన్ని పొందింది.

ఉత్తరపక్షం: అన్యత్రే వ్యభ్యాసస్యోపచారాత్ - అభ్యాసం అన్ని విషయాలలోనూ వుంది. అంతమాత్రాన ఏదీ నిత్యంకాదు. కుమ్మరి ఒక మాదిరి కుండల్ని పరంపరగా చేస్తూనే వుంటాడు. అది అభ్యాసమే కదా.

అలాగే మనం మూడు పూటలా భోజనం చేస్తున్నాము. అది కూడా అభ్యాసమే. ముమ్మారు భోజనం చేస్తున్నామని అర్థం. అంతేకాని నిత్యం భోజనం చేస్తున్నట్లు అవుతుందా?

వంద కుండలు, ముమ్మారు భోజనంలాగే శబ్దాన్ని ఎన్నిసార్లు ఉచ్చరిస్తే అన్నిసార్లు అభ్యసించినట్లు అవుతుంది. అభ్యాసం నిత్యత్వాన్ని ఎన్నడూ సాధించలేదు.

పూర్వపక్షం: మీరు అన్యత్వే వ్యభాసనస్యోపచారత్ అన్నారు. ఏమిటా అన్యత్వం?

అన్యంకంటే అన్యమయిన దేదీ తనకంటే అన్యంకాదు. కనుక అనన్యమవుతుంది. అనన్యంలో అన్యత్వం లేదు.

ఉత్తరపక్షం : అన్యత్వం ( Variation ) లేకపోతే అనన్యత్వం ( Identity ) మాత్రం ఎక్కడుంటుందయ్యా? ఈ రెండూ ఒకదానినొకటి ఆశ్రయించి ఉండేవే.

ఏ వస్తువైనా తనకంటే అన్యంకాని మాట నిజమే. కాని మరొక దానికది అన్యమే కదా! అన్నీ ఒకేరకం కుండలే అయినా, ఏ కుండ కాకుండ అన్యం కాని మాట నిజమే. కాని మరొక కుండకు ఈ కుండ అన్యమే అయినట్లు—ఒకే శబ్దం అభ్యాస వశంలో ఎన్నిసార్లు ఉచ్ఛరింపబడినా ఒక మాటకోమాట అన్యమే అవుతుంది.

ఒకే శబ్దం పునశ్చరింపబడినందున శబ్దంలో అన్యత్వం లేకపోయినా. ఒక శబ్దానికొక శబ్దం అన్యమే అవుతుంది. అందుకే శబ్దం నిత్యంకాదు.

పూర్వపక్షం: వినాశకారణా నుపలబ్ధే కుండ తనంత తాను బద్దలై పోవటంలేదు. ఏదో వినాశకారణం కనిపించినప్పుడే వినాశం జరుగుతోంది. కర్రవెళ్ళికుండమీద పడటం వినాశకారణం. సరిగాకుండ కాలకపోవటం, గాలికి దొర్లిపోవటం - ఇలాంటివే ఏదో వినాశ కారణాలున్నాయి.

శబ్దానికి వినాశకారణాలు ఒక్కటీ నాకు కనబడటంలేదు. అందుకే శబ్దం నిత్యమంటున్నాను.

శబ్దానికి తత్వనిత్యత్వం ( Real eternity ) లేకపోయినా భాక్త నిత్యత్వం ( Partial Eternity ) ఉన్నదనిపిస్తోంది. శబ్దానికి ఆది ఉంది. అంతంలేదు. అనుకుందాం.

ఉత్తరపక్షం: అశ్రవణకారణానుపలబ్ధే. సతతశ్రవణ ప్రసంగ శబ్దం వినబడకుండా ఉండటానికి కారణమేదీ కనబడటం లేదంటున్నారు. అది నిజమే అయినా ఒకసారి ఉచ్ఛరింపబడిన శబ్దం పదేపదే దానంతట అది వినబడుతూ ఉండాలికదా! శబ్దం నిత్యం అయితే ఆడినప్పుడే విన బడి ఆ తర్వాత వినబడకపోవటం భావ్యంకాదు. అలా వినబడటం లేదంటే దానికేదో వినాశకారణం ఉందన్నమాట. కనుకనే దానికది నశిస్తుంది. అలా నశించిపోయే దానివి అనిత్యమనటం తప్పుకాదు.

ఉపలభ్యమనే చానుపలబ్ధేరసత్వా దనపదేశః నాశన కారణం లభిస్తూనే ఉండగా "అనుపలబ్ధి" (Non-recognition) అనేదేలేదు. అందుకే మీ వాదం అనపదేశం (An invalid argument) అయింది.

వినాశనానికి ప్రత్యక్షప్రమాణాలు లభించకపోవచ్చు అనుమాన ప్రమాణమయినా వుంటుందికదా! శబ్దపరంపరలో పూర్వశబ్దం నశింప

టానికి అనంతరం శబ్దం కారణంకావచ్చునని వివేకం ఆ మాత్రం మీ వాదంలో కనిపించటంలేదు.

పోతే ప్రత్యక్షకారణా లెక్కడయినా వున్నాయేమో చూద్దాం. పాణి నిమిత్త ప్రశ్లేషాచ్ఛబ్దాభావే నానుపలబ్ధిః—మ్రోగుచున్న కంచుగంటను గంటను చేతితో పట్టుకుంటే శబ్దం తరిగిపోవటం లేదా ? కనుక వినాశ కారణం లభించటం లేదనటంనిజంకాదు. వినాశకారణం యింతప్రత్యక్షంగా లభిస్తున్నప్పుడు శబ్దం నిత్యమవటం హాస్యాస్పదం.

పూర్వపక్షం : అస్పర్శత్వాద ప్రతిషేధః—శబ్దం నోటినుండి పుట్టుతుంది. నోటిని ఎవరూ చేతితో మూయటంలేదు. కనుక శబ్దం నిత్యమే అనటానికి ఆక్షేపణ లేదు.

ఉత్తరపక్షం ; శబ్దం సంయోగ విభాగాదుల వల్లనే జనిస్తున్నది సంయోగవిభాగాదులు ఆగిపోగానే నశిస్తున్నది. మీ నోటిని మరొకరు చేతితో మూయనవసరంలేదు. దానికదే మూసుకుంటుంది. ఏది శబ్దాన్ని పుట్టిస్తున్నదో అదే శబ్దాన్ని నశింపజేస్తున్నది.

పెదవులు రెండూ కలియటం సంయోగం : అవి విడిపోవటం విభాగం: శబ్దోత్పత్తికి ఈ రెండూ అవసరం.

పూర్వపక్షం : మీనోట్లోంచి మాట ఊడిపడటానికి అవసరమైన సంయోగ విభాగాల గురించి మీరు చెపుతున్నారు. మీరు నోరు మూసుకుంటే అవేవీ ఉండవు కదా ! శబ్దానికి వాటితో పనిలేదు.

ఉత్తరపక్షం : మీరు నోరుమూసుకున్నా శబ్దం పుట్టదు నోటికొచ్చినట్లు శబ్దం చేసి ఊరుకున్నా శబ్దం మిగలదు. మిగిలితే ఆ నాదం అనునిత్యం వినబడుతూనే ఉంటాలి. అలా వినబడటంలేదు. కనుక శబ్దం

అనిత్యమే. ఆదిగాక శబ్దానికి ఆత్మనాశక గుణముంది. ఏ అవరోధం లేకుండానే దానంతట అది నశించిపోతుంది. శబ్దజీవితం కూడా బుద్బుద ప్రాయమే.

పూర్వపక్షం : అయ్యా, సంయోగ విభాగాలంటున్నారు. అవన్నీ మీ పెదవి కొసల విషయాలేనా ? వాటికి శబ్దంతో ప్రత్యక్ష సంబంధం ఉందా ?

ఉత్తరపక్షం : సంయోగ విభాగాదుల్ని పొందిన శబ్దమే వర్ణమవు తుంది. వర్ణసమామ్నాయం యావత్తూ ఇలా ఏర్పడిందే. తపః + సంపన్నుడు అను రెండు పదాలను కలిపినప్పుడు విసర్గం ఎగిరిపోయి ద్విరుక్త సకారం ఏర్పడింది. అందుకే తపస్సంపన్నుడు అంటాం. ఈ ద్విరుక్త "స" కారం సంయోగమే. విసర్గ లోపించటం విభాగమే.

అలాగే విభక్త్యంతరోపవత్తే వ్య సమాసే' అని సూత్రం. సమా సంలో పూర్వముండే విభక్తి లుప్తమయిపోతున్నది. ఉదాహరణకి ఆనందసాగరమను సమాసం వుంది. ఆనందము యొక్క సాగరమని పూర్వరూపం. ఇందులో యొక్క "విభాగమయినందున ( Seperated ) "ఆనందసాగర "మయింది.

ఇవన్నీ వ్యాకరణ విషయాలు. ఏది ఏమయినా ఇక్కడొక విష యం గుర్తించండి. ఈ " యొక్క " ఏమయింది? నశించిపోయినట్లే గదా అందుకే శబ్దం అనిత్యమని మేము అభిప్రాయపడు తున్నాము

పూర్వపక్షం: బాగానే వుంది. విభాగ విషయం మాకూ అర్థం మయింది. కాని, సంయోగం సంగతి మీరు సరిగా చెప్పలేదు.

ఉత్తరపక్షం : మీకు సంయోగంలో ఆసక్తి ఎక్కువగా ఉన్నట్లుంది అలాగే కానివ్వండి సంయోగంలో వికారం, దానితో బాటు ఆదేశం తప్పదు చివరికది వికారమో ఆదేశమో చెప్పలేము.

ఉదాహరణకి "అతి" అను రెండుశబ్దాలను కలిపి అత్యంత చేశామనుకోండి: 'అతి' లోని ఇకారం విభాగమయింది. 'అంత లోని' అకారం 'య'కారంగా మారి 'య'వత్తుగా వికారంపొంది, 'అతి' కిఅడుగున త్తిష్టవేసుకుంది. ఈ "అతి" లోని "ఇ" కారం తొలగిపోయి "య" కారాన్ని పొందటంద్వారా 'తి'కి వికారం ఏర్పడిందని అనవచ్చా?

పూర్వపక్షం: నిస్సందేహంగా అనవచ్చు ఏ సంయోగమయినా 'వికారం' లేకుండా జరగదు. అక్షర సంయోగం కూడాఅంతే.

ఉత్తరపక్షం: ఎలాంటి సంయోగానికైనా సద్యః ఫలం ఉండాలి. లేకుంటే అదివట్టి వికారమే. అక్షరసంయోగంలో సద్యఃఫలంఉంది. దానినే 'ఆదేశ'మని అంటాము. ఆదేశమనగా కొత్తగాపుట్టేది, ( Nascent ) ఇక్కడ యకారం ఆదేశమే కాని వికారంకాదు

ప్రకృతి నివృద్ధౌవికారవివృద్ధేః అని సూత్రం

మూలపదార్థానికి ప్రకృతి అనిపేరు. అది వృద్ధిపొందితే దాని వల్ల ఏర్పడే కార్యంకూడా వృద్ధిపొందాలి అది 'వికారలక్షణం' పాల రాశిపెరిగితే పెరుగురాశికూడా పెరుగుతుంది. బంగారం మూలపదార్థ మయితే నగలు వికారాలు. వికారమనగా రూపాంతరం. బంగారం బరువు పెరిగినకొద్ది నగల బరువుకూడా సమనిష్పత్తిలో పెరుగుతుంది. శబ్దంవిషయం అలాకాదు.

1. అతి + అంత—అత్యంత
2 సుధీ + ఉపాస్య—సుధ్యుపాస్య

ఈ రెండవ దానిలో మొదటిమాట రెండవ అక్షరానికి గుడిదీర్ఘ ముంది. మీరు చెప్పినట్లు 'య' కారం 'ఇ' కారం యొక్క వికారమే అయితే ఈ సంయోగంవల్ల సుధ్యూపాస్య కావాలి. సంధిలో యకారం దీర్ఘంకాలేదు

మొదటి దానిలో అతిలోని 'ఇ' కార స్థానంలో ఏర్పడిన "య" కారానికి, రెండవ దానిలో ఈ కార స్థానంలో ఏర్పడుతున్న "య" కారానికి తేడాలేదు. అందుకే "య"కారం వికారంకాదు. ఆదేశమంటున్నాము.

పూర్వపక్షం: మీరుచెప్పిన ఉదాహరణలో "సుధీ" లో ఈ దీర్ఘం ఉండనే ఉంది. అది ఏమాత్రం పెరగలేదు. ప్రకృతి పెరిగితేనే వికారం కూడా పెరగాలి. అక్కడ ప్రకృతి పెరగలేదు. కనుక వికారం కూడా పెరగలేదు.

ఉత్తరపక్షం: అతి + అశ — అత్యాశ. ఇక్కడ "అతి" ప్రకృతి యేకదా! అది పెరగకుండానే "య" కారం వచ్చి దీర్ఘమయింది. అనగా బంగారం బరువు పెరగకుండానే నగలు బరువెక్కాయి. ఇదేమంటారు? ఈ రకం అనమ విప్పత్తి వికారంలో ఉండదు. ఆదేశంలోనే ఉంటుంది.

పూర్వపక్షం: తమ ఆ దే శ ం అలాంటిది. మూల పదార్థానికీ వికారాలకీ సంబధం లేదు. కొన్ని వి కా రా లు మూలపదార్థం కన్నా ఎక్కువగా ఉంటాయి. కొన్ని తక్కువగా ఉంటాయి. అలా ఉన్నందువల్లనే వాటిని "వికారా" లన్నాము.

కొబ్బరికాయ విత్తనమే గదా. మ్రరిగింజకూడా విత్తనమే. ఆ రెండింటి ప్రమాణాలు వేరు. అవి మూల పదార్థాలు. వాటినుంచి వెలువడిన అంకురాలే వాటి వికారాలు కొబ్బరికాయనుండి మొలచిన

మొక్క నిటారుగా స్తంభంలా ఎదుగుతుంది. మర్రిగింజనుంచి మొలసిన మొక్క మహా వృక్షమయి ఆకాశంలో విస్తరిస్తుంది. కనుక ఇవన్నీ వికారాలే కాని ఆదేశాలు కాదు.

ఉత్తరపక్షం: ప్రకృతి పదార్థాలు వేరువేరైనా వాటి వికారాలు వాటికి సంబంధించినవే అవుతాయి. కొబ్బరికాయనుంచి మర్రిమొక్క గాని, మర్రిగింజనుంచి కొబ్బరిమొక్క గాని పుడితే అది ఆదేశమేగాని వికారంకాదు. ఏ బీజమునుంచి ఆ మొక్కే మొలవటం వికారమే.

మనం సంధి చేసిన రెండు పదాలలోనూ 'య' కారము ఎక్కడో లేదు. అది కొత్తగా వచ్చిపడింది. కనుక అది ఆదేశమేగాని వికారంకాదు.

పూర్వపక్షం: గింజ వేరు. మొక్క వేరు. మర్రిగింజలోనూ.

కొబ్బరికాయలోను. ఒకే ద్రవ్యం మొలక రూపంలో ఉంది. అది "య" కారమే అనుకోండి. ఆ "య" కారానికే కదా ఇన్నివికారాలు వస్తున్నాయి?

ఉత్తరపక్షం: నవికారాధర్మానుపపత్తే - వస్తువుయొక్క మూల ప్రకృతిచెడకుండా అదిరూపాంతరం పొందటాన్నే వికారమని అంటాము. పాలు ప్రకృతి పదార్థము. దాని వికృతి పెరుగు, పెరుగులో క్షీర ధర్మాలున్నాయి. పెరుగుగా మారటంతో పాలకు, పాలరూపమేవుండదు. కాబట్టి పాలకు వికృతి పెరుగని చెప్పబడింది. అంతేకాదు

"వికార ప్రాప్తానామపునరాపత్తేః" వికృతి రూపము పొందిన ప్రకృతి వస్తువు లేవి తిరిగి స్వస్వరూపమునుపొందలేవు. పాలు పెరుగైనా, పెరుగు తిరిగి పాలుకాదు. పాలు తన ధర్మాలను పోగొట్టుకొని పెరుగుగా మారుతుంది. పెరుగు కొత్త ధర్మాలను కలిగి ఉంటుంది అందుకే పాలతో చేసే క్షీరాన్నాన్ని పెరుగుతో చేయలేము

పూర్వపక్షం: అది సరికాదు. బంగారంతో ఎన్నెనో నగలు తయారుచేస్తున్నారు వాటిని కరిగించి తిరిగి బంగారం చేసుకుంటూనే ఉన్నారు. వికారం పొందిన వస్తువులు తిరిగి స్వస్వరూపాన్ని పొంద లేవనటం సబబుకాదు.

అతి + ఆశ = అత్యాశ అయింది తిరిగి ఈ అత్యాశకు పద విచ్ఛేదం చేయదలుచుకొంటే అత్యాశ=అతి + ఆశ అవుతుంది. సమాసంతో వచ్చిన 'య'కారం పదవిచ్ఛేదంతో పోయింది కనుక "య" కారం వికారమేగాని, ఆదేశంకాదు.

ఉత్తరపక్షం; బంగారంతో చేసిన నగలు, బంగారపు నగలే అవుతాయి అంతేగాని పాలు పెరుగుగా మారినట్లు వికారం పొందవు. అలా వికారం పొందితే అవి బంగారపు నగలు కావు బంగారానికి ఏ ధర్మాలున్నాయో, ఆ నగలకీ అవే ధర్మాలున్నాయి.

నిత్యపదార్థాలకు వికారం వుండదు. అనిత్యపదార్థాలకు స్థిరత్వం లేదు

అతి + ఆశ=అత్యాశ అయినప్పుడు 'య'వికారమే అయితే తిరిగి మీ అత్యాశ విచ్ఛిన్నం కాదు.

పూర్వపక్షం: నిత్యపదార్థములు అన్నీ అతీంద్రియములు నిత్య పదార్థాలనే ఎలిమెంట్సు అంటాము. వాటి పరమాణుబంధం ఇంద్రియాలకు లభించదు. పదార్థము మాత్రమే ఇంద్రియాలకు గోచరిస్తుంది. నిత్యపదార్థాలన్నీ వేటికవి ప్రత్యేక ధర్మాల్ని కలిగి వున్నాయి. వాటి ధర్మాలు మారవు. అయినప్పటికి పదార్థముల స్థూలస్వరూపం ఇంద్రియ

గోచరమవుతుంది. గోత్వము, అదృష్టము ఐశ్వర్యం మున్నగునవి అతీంద్రియాలే. అయినా వాటినీ అంగీకరిస్తున్నాము శబ్దము నిత్యమైనంత మాత్రాన దానికి వర్ణవికారాలు కలగవని చెప్పటం ధర్మం కాదు.

వర్ణాలు అనిత్యాలనుకున్నా అవిచెపితే గ్రహింపబడే సమయంలో గాని, పలకటం చేతగాని వాడి నోటి నుండి గాని వెలువడుతున్న సమయంలో గాని వికారం పొందే అవకాశం వుంది. ఆవిధంగా వికారానికి వచ్చిన "య" కారం వికారమే గాని ఆదేశం కాదు.

ఉత్తరపక్షం: వర్ణాలకు వికారం వచ్చే అవకాశం ఉన్నందునే అవి నిత్యాలు కావు. కాలాంతరంలో అవి మరింత చెడిపోయే అవకాశం ఉంది.

నిత్యత్వం (Eternity) వికారం (Modification) అను ఈ రెండూ విరుద్ధధర్మాలు. అవి రెండూ ఒకే వస్తువులో ఏక కాలమునందు ఉండవు. అది ప్రకృతి నియమము(Principle of nature).

ఎలాగో చెప్తతా పాలు పెరుగు అవటం ప్రకృతి నియమం. పెరుగు పాలవటం ప్రకృతి విరుద్ధం. ఆకారం నుంచి వికారం వస్తుందే గాని వికారం నుండి ఆకారం రాదు. ఇనుము త్రుప్పుపట్టటం ప్రకృతి నియమం. త్రుప్పును ఇనుము పట్టటం ప్రకృతి విరుద్ధం

పూర్వపక్షం: అనియమంలో కూడా నియమం వున్నది కనుక అనియమం అంటూ వేరేలేదు త్రుప్పు ఇనుముకే పడుతుంది గాని, బంగారానికి పట్టదు

ఉత్తరపక్షం: నియమము, అనియమము అనేవి రెండు విరుద్ధ వ్యవస్థలు నియమం ఒక విధానం. ఇనుముకు త్రుప్పు పట్టటం నియమం. త్రుప్పుకు ఇనుము పట్టడం అనియమం. అనియమంలో వ్యవస్థ ఉన్నంత

మాత్రాన అది నియమానికి చెందిన వ్యవస్థ కాదు. 'య' కారం ఆదేశం కనుకనే, పదవిచ్ఛేదంతో తొలగిపోతున్నది. వికారమయితే అట్లా తొలగి పోదు కొబ్బరికాయనుండి మొలక వస్తున్నది. మొలకను తొలగిస్తే కాయ అవుతుందా? కొబ్బరిచెట్టు, కాయకు వికారమే గాని ఆదేశం కాదు.

పూర్వపక్షం: అయితే శబ్ద సంస్కారంలో వికారాలేవి లేవంటారా?

ఉత్తరపక్షం: లేకనేం ఉన్నాయి. ఉదాహరణకి 'నిర్ణయము' అను శబ్దం ఉన్నదనుకోండి: దానిని 'నిర్నయం' అనిపలికితే అది వికారమే అవుతుంది. కొందరు హృదయం' అని శబ్దాన్ని 'హ్రిదయం' అని పలుకుతారు అది కూడ వికారమే.

పూర్వపక్షం : వస్తువుల పేర్లను పదం అనవచ్చా?

ఉత్తరపక్షం : తేవిభక్త్యంతాః పదమ్ అని సూత్రం. విభక్తి ఏదయినా అంతమందు ఉండేదేపదం. ఇది రెండు విధాలు. ఒకటి నామం: రెండవది ఆఖ్యాతం (Nomenclature).

పూర్వపక్షం: ఒక పదార్థానికి పేరేపదం మీరు 'నామం' అంటున్నారు. నామవాచకమయిన పదాన్ని అనుసరించి వ్యక్తి, ఆకృతి, జాతి అను మూడూ అవినాభావసంబంధాన్ని కలిగి ఉన్నాయి. అయితే పదానికి వీటిలో ఏది అసలైన అర్థమని అడుగుతున్నాను.

ఉదాహరణకి "గోవు" అన్నారనుకోండి. ఈ మాటకు నిజమయిన అర్థమేది? దాని ఆకృతా, వ్యక్తియా.? జాతా?

ఉత్తరపక్షం: కొందరు వ్యక్తియే పదార్థమంటున్నారు. కొందరు ఆకృతే పదార్థమంటురు. న్యాయవైదికులు మాత్రం ఈ మూడూ కలిపి

నదే అంటారు. గోవు యొక్క గోద్రవ్యమే వ్యక్తి. దాని అవ యవ సన్నివేశం ఆకృతి: గోత్వమే జాతి.

పూర్వపక్షం: మొదటిది నిర్దేశం, ఏ పదమయినా వ్యక్తిని నిర్దే శించాలి ఆ ఆవు పడుకున్నది! ఆ ఆవు నిలబడ్డది — అను వాక్యా అలో ఏ ఆవు నిర్దేశింపబడిందో అది వ్యక్తియే. దాని ఆకృతి ప్రధా నంకాదు. అవు ఆకృతిని మీరు ఆవు బొమ్మలో చూస్తారు. బొమ్మలో ఆవు పడుకున్నట్లో, నిలబడినట్లో కనిపించ వచ్చుగాక. కాని అది క్రియకాదు బొమ్మలో అవు తోకాడించలేదు గదా! అవు బొమ్మ అవు ఆకృతేగాని వ్యక్తికాదు.

ఉత్తరపక్షం: ఆవు పడుకున్నప్పుడు ఒక ఆకృతిలోనూ, నిల బడినప్పుడు ఒక ఆకృతిలోనూ ఉంటుంది. ఆవుకు ఆకృతి లేదనటం సరిగాదు.

పూర్వపక్షం: రెండవది సమూహం: ఒక చోట ఆవులన్నీచేరి ఉన్నాయి. ఆ గోసమూహాన్ని చూచినప్పుడు గోత్వం కనబడదు. ఏ ఆవుకాఆవు విడివిడిగా కనిపిస్తాయి. సమూహంలోకూడా ఆవు వ్యక్తి యే అవుతున్నది. అప్పుడుకూడా దాని జాతినీ, ఆకృతినీ పరిగణించం.

మూడవది దానం: ఒకడు ఆవును దానం చేస్తున్నాడు: అంటే ఏమిటి? గోద్రవ్యమే ( Mass ) దానంచేయబడుతున్నది. గోవు ఆకృతి గాని, జాతిగాని కావు.

నాల్గవది పరిగ్రహం: అతను తీసుకున్నాడు. అదికూడా ద్రవ్యమే.

ఐదవది సంఖ్య! పది ఆవులున్నాయి ఇది ఆవు వ్యక్తుల సంఖ్య

ను తెలియజేస్తుంది.

ఆరవది వృద్ధి: ఆ ఆవు బ లి సిం ది. అనగా ద్రవ్యం పెరిగి నట్లేకదా!

ఏడవది క్షయం: ఈ ఆవు చిక్కింది. అంటే ద్రవ్యం తరిగి పోయినట్లు.

ఎనిమిదవది సమాసం: ఆవు పడుకొంది. ఆ ఆవు నిలబడింది- ఇక్కడ ఆవు వ్యక్తియే అయింది.

తొమ్మిదవది వర్ణం: ఆ ఆవు నల్లగా ఉంది. ఈ ఆవు ఎర్రగా ఉంది —ఈ వాక్యాలు కూడా వ్యక్తినే చెపుతాయి.

పదవది అనుబంధం: ఆవు దూడను కన్నది. అది కూడా వ్యక్తియే

కనుక ఈ పది రకాల ప్రయోగాలను బట్టి ఆవు వ్యక్తేగాని జాతి, ఆకృతీకాదని నా అభిప్రాయం.

ఉత్తరపక్షం: మీ అభిప్రాయాలన్నీ విచిత్రంగా ఉం టా యి. మీరు చెప్పిన పది కారణాలూ వ్యక్తిని బోధించేటట్లయితే ఆ వ్యక్తి పదార్థమే ( Mass ) అవుతుంది. నిజంగా వ్యక్తి కాదు. అది వ్యక్తి అయితే దానికొక ఆకృతి కూడా ఉండాలి

'గోవు నిలుచున్నది' అన్నప్పుడు గోత్వం గల వ్యక్తి నిలుచున్నదని అర్థం. గోత్వం జాతి అవుతుంది. గోవు ఎలా నిలబడింది? తన నాలుగు కాళ్ళ మీదా నిలబడింది. అంటే దాని ఆకృతి కూడా వ్యక్తమవుతున్నది.

ఒకానొక వ్యక్తినే మనం ఆవు అనం వ్యక్తులకు వేరు వేరు

పేర్లుంటాయి 'ఆవు' పదం వ్యక్తినే గాక దాని జాతిని కూడా చెపుతుంది. కావున పదార్థమే వ్యక్తి అనటం సబబుకాదు.

భాష చిత్రమయినది. ఒక్కొక్క ప్రయోగం విపరీతార్థాన్నిస్తుంది.

ఉదాహరణకి "ఏయ్ గొడుగూ" అని పిలుస్తున్నాము అక్కడ మనము గొడుగును పిలవటంలేదు గొడుగు వేసుకు వెళుతున్న మరొక వ్యక్తిని పిలుస్తున్నాం. ఇక్కడ గొడుగు ఒక పదార్థము గొడుగు పట్టుకున్న మనిషి మరో పదార్థము. మనం ఉద్దేశించిన పదార్థం వేరు:

"ఊళ్ళు ఏడ్చాయి"—ఊళ్ళోని ప్రజలంతా ఏడ్చారని అర్థం.

"తుంగ పట్టుకురా"—తుంగచాపను తెమ్మని అర్థం

"వాడు దేవుడు"—వానికి దేవతల గుణాలున్నాయని అర్థం.

"కుంచెడు బియ్యం"—బియ్యం యొక్క ఘనపరిమాణం చెపుతుంది.

"నల్లచీర"—చీరయొక్క రంగును చెపుతుంది.

"ఇతడు కులం: ఇతడు గోత్రం"—ఇతడు కులగోత్రాలున్న మనిషి అని అర్థం.

పూర్వపక్షం: ఇది గుర్రం—అని చెపుతున్నప్పుడు పదార్థం యొక్క ఆకృతికే ప్రాధాన్యత నిస్తున్నాం. ఆకృతిని పరిగణించకుండా లోక వ్యవహారం లేదు. శబ్దప్రయోజనం లోక వ్యవహారమే. కనుక ఆకృతియే శబ్దానికి అర్థం.

ఉత్తరపక్షం: ఆవు బొమ్మను మట్టితో చేసి, దానికి ఆవు ఆకృతిని కల్పిస్తాం. అంత మాత్రాన దానికి గోత్వం లేదు. అది గడ్డి

తినదు: పాలివ్వదు. దానిని ఆంబోతుమూచూడదు. కనుక ఆకృతియే ప్రధానంకాదు; పదార్థకూడా ఉండాలి. ఉంటే ఆంబోతు విడిచి పెట్టదు

ఆవుల్లో కొన్ని పొట్టిగా ఉంటాయి కొన్ని పెద్దవి దొడ్డికాళ్ళు గలవి కొన్ని, పొట్టి కొమ్ములవి కొన్ని; నడ్డివిరిగినవి ఉంటాయి.

ఇన్నిరకాల ఆకృతులలో ఏ ఆకృతి "ఆవు" అనే సరికి మీకు స్ఫురిస్తుంది? మీకు ఆకృతి స్ఫురించదు. జాతి జ్ఞానమే కలుగుతుంది.

కనుక వ్యక్తి. ఆకృతి. జాతి అను మూడూ ఒక్కొక్కటి ప్రాధాన్యత పొందుతూ మొత్తంమీద పదార్థాన్నేవ్యక్తం చేస్తున్నాయి.

నిర్వచనాలు: వ్యక్తి : గాలి విస్తరిస్తుంది. పదార్థం విస్తరించదు. అది మూర్తిమంతమయినది. విస్తరించని పరిమాణ రూపాది గుణవిశేషాలు గల ద్రవ్యాన్నే వ్యక్తి అంటాము.

ఆకృతి: దేని ద్వారా ఒక పదార్థం యొక్క జాతి, లింగము తెలియబడుతుందో అది ఆకృతి

మీరు మనుష్యులు అవి పశువులు—అనటానికి జాతి ప్రమాణం. వీరు స్త్రీలు, వారు పురుషులు—అనటానికి లింగం ప్రధానం.

జాతి: సమాన గుణధర్మాలుగల పదార్థాలవన్నిటినీ "జాతి" అంటాము. సమాన ప్రసవాత్మికాజాతిః — ఒకే విధంగా పుట్టినవన్నీ ఒకే జాతివి.

# ఐదవ ఆహ్నికము

ప్రస్తావన

దర్శన స్పర్శనాభ్యామేకార్థ గ్రహణమ్—

ఏ వస్తువైన మనం కంటితో చూస్తాం. దర్శన, స్పర్శన—అనే రెండు ప్రక్రియలూ వస్తుస్వరుపాన్ని మనకు విశదం చేస్తాయి

పూర్వపక్షం: ఇందులో విశేషం ఏముంది? కళ్ళుండి చూస్తే ఏ వస్తువైన కనిపిస్తుంది. ముట్టుకుంటే ఏవస్తువైనా దొరుకుతుంది. ఈ రెండిటితోనే ముందు ప్రతీ శిశువూ వస్తువుల్ని గ్రిహిస్తుంది. అది శిశుప్రవృత్తి. ఇంకా రసన, శ్రివణ, వాసనలున్నాయి. శైశవదశ నుండి మనిషి ఎదిగితేనే గాని వాటికి ప్రాధాన్యతరాదు. అన్నిటినీ అధిగమించిన విద్య భావన అదిపౌఢ మనస్తత్వం. అది చెప్పటం మానేసి తమరు శైశవ స్థితినే చేరుకున్నారు.

కన్ను చూస్తుంది; కనుక కన్నే కర్త కన్ను లేకుండా చూడలేరు కర్తలేకుండా క్రియ ఉండదు

ఇంద్రియాలు మనందరికి ఉన్నాయి. వస్తువుకు సంబంధించిన పరిజ్ఞానమే విషయం. విషయాలకు సంబంధించిన వ్యవస్థ ఉన్నది. అది ఇంద్రియాలకు లభ్యమవుతుంది ఇది సామాన్య విషయమే ఇందులో విశేషం లేదు.

ఉత్తరపక్షం : ఏ వస్తువుకు సంబంధించిన విషయజ్ఞానమయినా ముందుగా దర్శన, స్పర్శనాదుల వల్లలభిస్తుంది. వస్తువుకు సంబంధించిన పరిజ్ఞానమే విషయమని, విషయ వవ్యస్థఉన్నదనీ నేనూ అంగీకరిస్తున్నాను. అలాగే

ఇంద్రియ వ్యవస్థకూడా ఉంది. ఒక్కొక్క యింద్రియం ఒక్కొక్క పనిచేస్తుంది. కన్ను చూస్తుంది. చేయి స్పర్శిస్తుంది చెవి వింటుంది: నాలుక రుచిచూస్తుంది. ముక్కు వాసన చూస్తుంది. ఇది వ్యవస్థ. నాలుక రుచిచూడ గలదేగాని చూడలేదు. చెవి వినగలదేగాని రుచిచూడలేదు. చెవిటివాడు వినలేనట్లు గ్రుడ్డివాడు చూడనూలేడు. గ్రుడ్డివాడికి ఏ యితర జ్ఞానేంద్రియమూ వస్తుస్వరూపాన్ని దర్శింపజేయలేదు. అందుకే ఇంద్రియాలు నియత విషయాలని చెప్పబడ్డాయి. ఒక్కొక్క ఇంద్రియమూ తాను గ్రహించిన విషయాన్ని ఆత్మకు అందిస్తుంది. ఇలా ఉన్ని యింద్రియాలు అందించే విషయజ్ఞానాన్ని గ్రహించ గల శక్తి "ఆత్మ"కు మాత్రమే ఉంది సమస్త యింద్రియాలూ అందించే విషయాలను అది సమన్వయ పరుస్తుంది. ఈ రకం సమన్వయానికే ఆత్మ సద్భావమని పేరు.

చూపుకు కర్త కన్నే అని మేమూ అంగీకరిస్తాము. కళ్ళులేనివాడు చూడలేడు. చెవిటివాడు వినలేడు. వినికిడికి కర్త చెవి. అయినంత మాత్రాన విషయజ్ఞానం కంటికీ, చెవికీ అందటంలేదు. అది ఆత్మకే అందుతోంది. కనుక కంటికీ. చెవికీ కూడా ఆత్మయజమాని అవుతుంది.

ఒకరి కన్ను ఊడబెరకి, ఏదైనా కొయ్యకు అమరిస్తే, ఆ కొయ్య చూడగలుగుతుందా? చూడాలిగదా! కొయ్యకు ఆత్మలేదు. కనుక కళ్ళున్నా కొయ్యకు విషయపరిగ్రహణం లేదు. అందుకే కళ్ళూ, చెవులూ, నాలుకా చర్మము, ముక్కు అనేవి సాధనాలే గాని నిజమైన కర్తలు కావు. ఆత్మ ఒక్కటే కర్త.

చూస్తున్నది కన్నే గనుక కన్నును కర్త అనటం భావ్యం కాదు చీకట్లో దీపాన్ని ఉంచిన పక్షంలో వస్తువులు స్పష్టంగా కనిపిస్తాయి. ఆ దీపం వస్తువుల రూపాన్ని గ్రహించిందా ? దీపం చూస్తున్నదిగదా ! దీపానికి ఆ వస్తువులు కనిపిస్తూనే ఉండాలి. అంతమాత్రాన ఆ వస్తువులకు సంబంధించిన విషయజ్ఞానం దీపానికి కలగటంలేదేమి ? దీపానికి ఆత్మ లేదుగనుక : అది కర్త కాదు !

దీపం ప్రసరించిన వెలుగు కారణంగా వస్తువులు ప్రకాశించటంవల్ల మనకళ్ళు వస్తువును చూడగలుగుతున్నాయి. దానిని గ్రహించగలుగుతున్నాయి. కనుక దీపం సాధనమయింది. అలాగే మన కళ్ళుకూడా సాధనాలే గాని కర్తలు కావు.

చచ్చిపోయినవాడి శవం కళ్ళప్పగించి చూస్తూనే ఉంటుంది. అయినా దానికి విషయ పరిజ్ఞానం కలగటంలేదు. దానికి ఆత్మలేదు.

ఈ విధంగాచూస్తే ఇంద్రియాలన్నీ ఆత్మకు సాధనాలే ఆత్మయే కర్తయైఇంద్రియాలద్వారా విషయ పరిజ్ఞానాన్ని పొందుచున్నదని చెప్పక తప్పదు.

శరీరదాహేపాతకాభావాత్ : సమస్త ఇంద్రియాలతో నిండిన శరీరం ఆత్మను పోగొట్టుకున్న తర్వాత కట్టెతో సమానమే. దానిని దహించినా పాపంలేదు. అందుకే శవదహనం ఆచారమయింది.

పూర్వపక్షం : తదభావః సాత్మకప్రదాహేపి తన్నిత్యత్వాత్-ఆత్మ నిత్యమనీ అదహ్యమనీ పెద్దలంటూనే ఉన్నారు. ఆత్మ అదహ్యమైనప్పుడు ఆత్మవంతమైన శరీరాన్ని కాలిస్తే మాత్రం వచ్చే పాపమేమిటి ?

ఉత్తరపక్షం : నకార్యాశ్రయ కర్తృవధాత్-సుఖదుఃఖాలున్నవి. వాటిని కార్యములంటాము దానికి ఆశ్రయమైనది శరీరం. ఆ శరీరానికి కర్తయే ఆత్మ. ఆత్మకు ఆశ్రయమైన శరీరాన్ని దహించటంకన్నా మహాపాపంలేదు. ఆత్మవంతమైన శరీరం శవంకాదు. కనుక దానిని దహించకూడదు

పూర్వపక్షం : వస్తువును చూసేది కన్నేగాని ఆత్మకాదు కన్ను అనే సాధనం లేకుండా ఆత్మ చూడనూలేదు. స్వతహాగా ఆత్మ గ్రుడ్డిది.

ఉత్తరపక్షం : నవ్యదృష్టస్యేతరేణ ప్రత్యభిజ్ఞానాత్ - ప్రత్యభిజ్ఞ అనగా గుర్తుపట్టటం (Recognition)

ఎడమ కంటితో ఒక వస్తువును చూసాము. అదే వస్తువును కుడి కంటితో చూసినప్పటికీ గుర్తుపడతాము. ఒకసారి ఒక కంటితో చూసిన వస్తువును వేరొక కంటితో చూసినప్పటికీ అదే ఇది అను జ్ఞానం (ప్రత్యభిజ్ఞ) కలగటానికి కారణమేమిటి ? ఎడమకంటితో చూసిన వస్తువును, ఎడమకన్నుమూసి కుడికన్నుతో చూసినా అదే వస్తువని మనకు స్ఫురింపజేస్తున్నదేది? అదే ఆత్మ. కనుక చూసేది ఆత్మయే. చూచితెలుసుకొనేదికూడా ఆత్మయే.

వస్తువుల్ని శ్రద్ధగా చూడటమే సవ్యదృష్టి. చూసీచూడనట్లు చూడటం అపసవ్యదృష్టి. మనం దారివెంటపోతూ ఎదురైన ఎన్నెన్నో వస్తువుల్ని, మనుషుల్ని పట్టించుకోకుండా పోతాము. వాటిని చూడకుండా ఉండటం, చూసినా వాటిపై మనదృష్టిని కేంద్రీకరించటం. అదే సవ్యదృష్టి.

అదిసాధారణంగా కన్నుచేసేపని. అది చూస్తూనేఉంది. కాని, ఆత్మ అన్యాయత్తమై ఉన్నందున కళ్ళు చూసినదానిని స్వీకరించదు, కనుక దారిలో మీకు ముసలమ్మ ఎదురయిందా?" అని ఎవరైనా అడిగితే చెప్పలేవు. నిజంగా ఆ ముసలమ్మ ఎదురయిన మాట నిజమే, మనం చూడనూ చూశాము కాని, సవ్యదృష్టితో చూచి ఉన్నట్లయితే తప్పకుండా ఆ ముసలమ్మ మన ఆత్మతో ఉండేది. దానిని స్మరించి, "అవునుచూశాము" అని చెప్పిఉండేవాళ్ళం.

ఒక మనిషిని చూస్తాం. అతన్ని ఇది వరకే ఎక్కడో చూసిన గుర్తు వుంటుంది. 'మీరు ఫలానాకదూ?' అని గుర్తు పడతాము అది ప్రత్యభిజ్ఞ.

ఈ రకం ప్రత్యభిజ్ఞ ఆత్మకే ఉన్నది: ఇంద్రియాలకు లేదు. కన్ను ఎప్పటికప్పుడు చూచుకుంటూ పోతూనే ఉంటుంది. ఈక్షణంలో చూసినదానిని మరుక్షణంలో మరచిపోతూ ఉంటుంది.

ఆత్మ ఒక కంటితో ఒక వస్తువును చూడగానే దానికి ఆవస్తువుకు సంబంధించిన సంస్కారం కలుగుతుంది. మరో కంటితో అదే వస్తువును చూసినా, అదే కంటితో అదే వస్తువును ఎన్నిసార్లు చూసినా మొదట చూసిన వస్తువదే అను ప్రత్యభిజ్ఞ కలుగుతుంది. దానికి కారణం మొదట ఆవస్తువుకు సంబంధించిన సంస్కారాన్ని ఆత్మ నొదులుకో లేదు. తిరిగి తిరిగి కలిగిన సంస్కారాల్ని ఆ తొలి సంస్కారంతో సరిపోల్చిచూసుకొన్నది. ఈ రకంగా సరిపోల్చుకు గుర్తుపట్టేశక్తి ఆత్మకే ఉండిగాని కన్ను మొదలైన ఇంద్రియాలకు లేదు.

పూర్వపక్షం: మీరు మొదట్లోనేతప్పుచెప్పారు. నూతిగట్టుకు మధ్యగా ఒక దూలంఉంది. ఆవిధంగా ఆమయ్యి రెండు భాగాలుగా కనబడుతుంది

అంత మాత్రాన అక్కడ రెండు నూతులు లేవు. ఒకే నుయ్యి ఉన్నది. మనిషికి రెండు కళ్ళున్నట్లుగా ముక్కు దూలంవలె అడ్డంపడి భ్రమగొలు పుతోంది. అవిరెండు కళ్ళు కావు: ఒకే కన్ను

నైకస్మిన్నాసాస్థి వ్యవహితే ద్విత్వాభిమానాత్ - ఒక్కకంటినే ముక్కు ఎముక రెండుగా విభజించి రెండు కళ్ళుఉన్నట్లు భ్రమ కల్పి స్తున్నది. కనుక మీరు చెప్పింది తప్పు.

ఒక వస్తువును ఆ రెండింటిలో ఏ ఒక కన్నుతో చూపినా ఒకేలా కనిపిస్తుంది. అది ఒకే కన్ను కనుక: దూలంచే రెండుగా విభజింపబడిన నూతిలోకి ఎటువైపునుంచి చూకినా ఒకే అడుగు ప్రాంతానికి చేరతాము గదా!

నిజంగా కళ్ళు రెండయితే ఆవస్తువు రెండు కళ్ళకీ రెండురకాలుగా కనిపించాలి. అలాకనిపించటంలేదు. కనుక ఎడమ కంటితో చూసిన వస్తువునే కుడికన్ను చూచినప్పుడు అదేఇదని గుర్తుపడుతోంది గనుక అలా గుర్తించే ఆత్మ వేరే ఉన్నదని వాదించటంలో అర్థం లేదు.

ఉత్తరపక్షం: రెండు కళ్ళూ ఒకటే అనే మీవాదం సరియైనది కాదు ఏక వినాశే ద్వితీయా వినాశాన్నైకత్వమ్— ఒక కంటిని పొడిస్తే అదొక్కటే నశిస్తుంది. రెండవ కన్ను మామూలుగానే చూస్తుంది. ఆ రెండు కళ్ళూ ఒకటే అయిన పక్షంలో ఒక కన్ను చెడితే రెండవది కూడా చెడాలిగదా! కనుక ఒక కన్నేగాని రెండు కళ్ళు కావనటం తప్పు.

పూర్వపక్షం: చెట్టుకు ఎన్నో శాఖోపశాఖలున్నాయి. వాటిల్లోకొన్ని ఏ కారణం వల్లనో నశించిపోయాయి. అంత మాత్రాన వృక్షం నశిం చిందా? అప్పుడూ అది వృక్షమే: ఇప్పుడూ అది వృక్షమే రెండుశాఖలు

గాఉన్న ఒకే కన్నుకు ఒకశాఖనశించినా, రెండవశాఖ ఉంటూనే ఉంది. అది కన్నే అంతమాత్రాన కళ్ళు రెండుకావు.

ఉత్తరపక్షం : చెట్టుకీ కంటికీ పోలికేలేదు చెట్టుకు మూలం ఒకటే, రెండునేత్రాలకు రెండు మూలాలున్నాయి కపాలాన్ని పరిశోధిస్తే రెండు కళ్ళకు రెండు కంతలు స్పష్టంగా కనిపిస్తాయి ఆ రెండిటికీ ఏ విధమయిన అనుసంధానమూ కనబడదు. కనుక అవి ఒక దానికొకటి అవయవాలుకావు.

వృక్షానికి శాఖలు అవయవాలయినట్లు మనిషికి రెండు కళ్ళూ రెండు అవయవాలు. ఒక అవయవం పోయినా చెట్టు చెట్టే అయినట్లు ఒక అవయవం పోయినా మనిషి మనిషే అవుతున్నాడు.

శాఖలు పోయిన వృక్షానికీ శాఖలుపోసీ క్రితం ఉన్న వృక్షానికీ తేడావుంది మొదటి దానికున్న అవయవలోపం రెండవ దానికి లేదు.

ఒకశాఖ మరొక శాఖకు అవయవం కానట్లు ఒక కన్ను మరో కంటికి అవయవం కాదు.

అన్నిటికీ మించిన మరో ముఖ్య విషయం 'ఇంద్రియాంతర వికారం.'

కంటితో చూచిన ఒకదృశ్యం మనోహరంగా ఉంటుంది: రుచి చూచిన పండు మధురంగా ఉంది. ఒక పువ్వు పరిమళం ఘుమ ఘుమ లాడుతోంది. ఒక శరీర స్పర్శ పులకరింపజేస్తుంది. కల కంఠి కంఠ స్వనం మధుర సంగీతధ్వనులీనుతోంది.

ఈ రకం మాధుర్యానుభవమే ఇంద్రియాంతర వికారం. ఇంద్రి

యాలద్వారా రసం ఉత్పత్తిల్లుతుంది. దానిని ఆత్మ ఆస్వాదిస్తుంది. అది లేని వారికిది సాధ్యంకాదు. కర్త లేకుండా క్రియలేదు. రసాన్ని నిష్పన్నం చేసేవి ఇంద్రియాలు: దానిని అస్వాదించేది ఆత్మ.

కాదయ్యా : ఇంద్రియాలే రసాస్వాదన చేస్తాయని మీరనవచ్చు. అయిన పక్షంలో స్మరణం (Recognition) జరగదు. మొన్నతిన్న మామిడిపండు రుచిని ఇవాళ స్మరించటం ఆత్మవ్యాపారమేగాని ఇంద్రియ వ్యాపారం కాదు.

పూర్వపక్షం : నస్మృతేః స్మర్తవ్య విషయత్వాత్.

స్మృతి స్మరణకు సంబంధించిన విషయం కనుక మీరు చెప్పింది తప్పు. ఒక ఇంద్రియం తానుపొందిన అనుభూతిని నెమరు తెచ్చుకొంటూ ఆనందం పొందుతుంది, అదే స్మరణం. మొన్నతిన్న మామిడిపండురుచి స్మరణకు వచ్చినప్పుడు మళ్ళీ నోరూరుతుంది. మొన్నపీల్చిన పరిమళ గంధం స్మరణకు వచ్చినప్పుడు ముక్కులోకూడా ఆ గంధం వాసనలు స్ఫురిస్తాయి. ఈ విధంగా స్మరణంలో రసం అనుమానింపబడుతున్నది. అవి ఇంద్రియానుభూతులేగాని ఆత్మానుభూతులుకావు. స్మృతికి ఆత్మ కారణముకాదు: విషయమూకాదు. ఇంద్రియానుభూతే కారణం. ఇంద్రియానుభవమే విషయం.

ఉత్తరపక్షం : స్మృతి ఆత్మకు కారణమనిగాని, విషయమనిగాని నేను చెప్పలేదు. చెపితే మీరు చెప్పినదోషంసంక్రమిస్తుంది. నేను స్మృతిని ఆత్మగుణంగా భావిస్తున్నాను. ఆత్మ స్మృతికి ఆశ్రియమని నా అభిప్రాయం. ఇంద్రియాలద్వారా అనుభూతమైన వస్తువుయొక్క సంస్కారం ఆత్మకు కలుగుతుందని నేనిదివరకె చెప్పాను. వివిధ ఇంద్రియాలు పొందిన అనుభూతుల్ని సమీకరించుకోవటమే సంస్కారం. సంస్కృతి

(Perfection) దాని ఫలం.

స్మృతి. సంస్కృతి గుణాలు, గుణాలకు ఆశ్రయమైన దొకటుండాలి. అదే ఆత్మ.

పూర్వపక్షం : నాత్మ ప్రతిపత్తి హేతూనాం మనసి సంభవాత్ ఆత్మయొక్క ఉనికిని నిర్ణయించటానికి మీరు చెపుతున్న కారణాలన్నీ మానసేంద్రియానికి సంబంధించినవేకాని వేరుకాదు.

మనస్సు (1) అన్నింటినీ గ్రహిస్తుంది. ఇంద్రియాలచే గ్రహింపబడు అన్ని విషయాలు మనస్సుకే చేరుకొంటాయి. దర్శించినదానిని స్పర్శిస్తుంది కుడి కంటితో చూసినదానిని ఎడమకంటితో గుర్తిస్తుంది ఇంద్రియాంతర వికారానికి హేతువైన స్మృతి మనస్సులోనే కలుగుతుంది. కంటితో చూస్తుంది: జిహ్వతో ఆస్వాదిస్తుంది. ముక్కుతో వాసనచూస్తుంది. చర్మంతో స్పర్శిస్తుంది. చెవులతో వింటుంది. ఈ పనులన్నీ మనస్సుచేసేవే. కనుక మనస్సు కన్నా భిన్నమయిన ఆత్మ లేదంటున్నాను.

ఉత్తరపక్షం : మనస్సు జ్ఞాత, అనగా గ్రహించునది. అది బాహ్య విషయాలను గ్రహించటానికి ఇంద్రియాలే సాధనాలు. ఆ సాధనాలద్వారా అది బాహ్యవిషయాలను గ్రహించటం సామాన్యమే. అయితే సుఖము, దుఃఖము, ఆనందము, భయము, కరుణ, శోకము, హాస్యము మున్నగు రసానుభూతులు బాహ్యవిషయాలుకావు అవి అంతర్విషయాలే వాటినికూడా అది గ్రహిస్తున్నది. అందుకొక సాధనం కావాలి. అదే ఆత్మ. దానికే అంతఃకరణ (2) మని పేరు.

---

1. మనస్సు in its widest sense comprises all the mental powers like intellect, understanding, perception, sense conscience, and will.

2 అంతఃకరణ is an internal organ of perception and cognition the instrument through which thoughts enter or by which

బాహ్యవిషయాల్ని గ్రహించటానికి మాత్రమే సాధనాలుండాలనీ అంతర్ విషయాలను గ్రహించటానికి అలాంటి సాధనాలేవీ ఉండనఖ్ఖర్లేదనీ అనుకోవటం పొరబాటు.

ఎవడైనా గొడ్డలివి విసరకుండా కొమ్మను నరకలేడు. కొమ్మను నరకటానికి గొడ్డలి సాధనమే. మనస్సులోపల జరిగే క్రియలగురించి అభ్యుక్తులు (Sayings) ఉన్నాయి. సాధనం లేకుండా క్రియలేదు. ఒక క్రియకు సాధనంకావాలి. మరో క్రియకు అవసరంలేదని ఎలాచెప్పగలరు ?

మరో ముఖ్యవిషయం : శైశవావస్థలో ఉన్న శిశువు. ఒక నెల లోపు వయసుగల శిశువులున్నారు. వీళ్ళు అప్పుడప్పుడు నవ్వుతారు. ఒక్కొక్కప్పుడు అదిరిపడతారు. ఇంకొకప్పుడు ఏడుస్తారు. ఆనందం, భయం, శోకం దీనికి కారణాలు. ప్రత్యక్షమైన వస్తువులకు సంబంధించిన జ్ఞానం ఈ శిశువుల్లో ఉండదు. కనుక ఈ అనుభావాలన్నీ అంతఃకరణం వల్ల కలిగినవే అని చెప్పవచ్చు. అవి పూర్వజన్మస్మృతులవల్ల కలిగాయి. పూర్వజన్మలో ఆత్మపొందిన అనుభూతులే ఈ జన్మలోకూడా స్మరణకు వచ్చి ఆ శిశువులో ఈ రకం అనుభూతుల్ని కలిగించాయని చెప్పవలసి ఉంటుంది

ఒకానొక ప్రత్యక్షజ్ఞానం నశించిన తరువాత, తిరిగి అదే జ్ఞానం స్మరణకురావటమే స్మృతి. ఇది భావనాసంస్కారం.

పూర్వపక్షం : తామరపువ్వు మొదలైనవాటియందు వికాస సంకోచాలు సహజంగా కనిపించినట్లే పిల్లల్లోనూ నవ్వు, భయము, శోకము మొ॥

object of sense affect the soul. మనస్సు in this sense is always regarded as distinct from ఆత్మ and పురుష.

వికారాలుకూడా సహజంగానే కనిపిస్తాయి లేనిపోని ఆత్మను సృష్టించటం వృధాప్రయాస.

ఉత్తరపక్షం : వికాస సంకోచాలు పాంచభౌతిక మయినవేగాని, వాటికవి నిర్నిమిత్తంగా పుట్టేవికావు. కనుక సహజంకావు. వాటికి ఉష్ణము, శీతలము, వర్ణము, కాలము నిమిత్తములై (Causes) ఉన్నాయి. నిమిత్తం లేని వికారమంటూ ప్రపంచంలో యెక్కడాలేదు. పిల్లలు నవ్వినా దానికి ఒక నిమిత్తం ఉంటుంది. హర్షం కలిగితే నవ్వుతారు, దుఃఖం కలిగితే ఏడుస్తారు. ఈ హర్షమూ, శోకమూ శిశువులకు దేనివల్ల కలుగుతున్నాయి? స్మృతి వల్ల కలుగుతున్నాయి. అది పూర్వానుభవ స్మృతి అనుకోండి. పూర్వజన్మ స్మృతి అనుకోండి.

చచ్చిన ప్రతివాడు తిరిగి పుడుతూనే ఉన్నాడు అందుకే చచ్చి పుట్టిన ప్రతి వాడికీ "ప్రేత్య" అని పేరు పుట్టీ పుట్టగానే ప్రతిబిడ్డా పెదాలు చప్పరించు కుంటూ స్తన్యంకోసం తల్లి స్తనాలను తడుముతూ ఉంటాడు. తల్లి స్తనాలలో పాలు దొరుకుతాయని వాడికెలా తెలుసు? పూర్వానుభవం వల్ల అనగా పూర్వజన్మానుభవంవల్ల. పూర్వజన్మలోని శరీరాన్ని ఏనాడో పాతిపెట్టడమో, కాల్చి బూడిద చెయ్యటమో జరిగిందికదా ! ఆ శరీరం కాదిది. కాని, ఆ ఆత్మకావచ్చు ఆ ఆత్మయే ఈ శిశువు శరీరంలో ఉన్నందున తన ఆత్మానుభవాన్ని స్మృతిద్వారా పునశ్చరించి, పుట్టినవెంటనే ప్రయోగించింది. అందుకే ఆత్మ ఉందంటున్నాము

పూర్వపక్షం : అచేతనాలయిన ఇనుపముక్కలు సూదంటురాళ్ళని వెతుక్కుంటూపోయి అతుక్కోవటంలేదా ? అలాగే చంటివాడి పెదవులు తల్లి స్తనాగ్రాలను తడుముకుంటూపోయి పట్టుకుంటున్నాయి. అది స్వాభావికమే

ఉత్తరపక్షం : మనిషి బిడ్డ అయినా, ఆవుదూడ అయినా సమస్త క్షీరదాలు ఒకే విధంగా ప్రవర్తిస్తున్నాయి. ఇదే జాతిధర్మం సమస్త లోహాలలోనూ కనబడాలిగదా ! ఇనుపముక్కలొక్కటే అయస్కాంతాన్ని వెతుక్కుంటూపోతాయి. మిగతా లోహాలలా ఎందుకుపోవు ? అది వైపరీత్యమే గాని సహజంకాదు. ఈ వైపరీత్యానికి ఏదో నిమిత్తం ఉంటుంది. అదే అయస్కాంతపు ఆకర్షణశక్తి. ఆ శక్తికి చలించే అర్హత ఇనుము లోనే ఉంది. అదేవిధంగా మాతృస్తనాల ఆకర్షణకు శిశువు పెదవులు చలించటం జరుగుతోంది. దీనికి నిమిత్తం రాగమ్. అనగా తీవ్రమయిన కోరిక (Vehement desire)

"వీతరాగజన్మాదర్శనాత్" రాగం లేనటువంటి జన్మము ఎక్కడా చూడం. అనగా సమస్త ప్రాణికోటికి ఏదో ఒక వస్తువు నందైనా తీవ్రమైన కామన ఉంటుంది. అలా ఎందుకుంటుందో దానికే తెలియదు. పూర్వానుభవం లేకపోయినా ఆ వస్తువును చూసేసరికి శరీరం ఉప్పొంగుతుంది. ప్రియురాలిని చూడగానే పురుషుని శరీరం ఎందుకు ఉప్పొంగాలి ? ఏ స్త్రీనీ ఇంతవరకూ స్పర్శించి ఎరగకపోయినాసరే అలా అతని శరీరం ఎందుకు ఉప్పొంగాలి ? - అదే రాగలక్షణమ్. ఈ లక్షణం సమస్త ప్రాణి కోటిలోను ఉంది.

పూర్వపక్షం : సమస్త ద్రవ్యాలందూ ఏదో ఒక గుణం పుట్టుకతోనే ఉంది. రాగి ఎర్రగా, వెండి తెల్లగా. బంగారం పచ్చగా ఉండటం పుట్టుకతో సంక్రమించిన గుణమే. ఇలాగే గులాబీ, సంపెంగ, మొగలిపువ్వులు తమ పరిమళంలో వైవిధ్యాన్ని కలిగిఉన్నాయి. దేనిగుణం దానిదే ఏ విధంగా ఈ గుణాలన్నీ ద్రవ్యగతమై ఉన్నాయో. జన్మతః రాగం కూడా ఆత్మగతమై ఉన్నట్లు మాకు తోస్తున్నది. కామం గలవాడికి కామ

ప్రకోపం కలుగుతుంది గాని నిష్కాముడైన నపుంసకునికి రంభ ఎదు రయినా ప్రకోపం కలగదు గదా! అందుకే రాగాదులు ప్రాణులకు స్వాభా వికమని మా అభిప్రాయం.

కుండకు నీళ్ళునింపుకునే గుణం స్వాభావికమైనట్లే యిదీని

ఉత్తరపక్షం: నసంకల్ప నిమిత్తత్వాత్ రాగాదీనామ్' - రాగద్వే షాదులు సంకల్ప నిమిత్తములు కావు.

సంకల్పమనగా మనస్సులో ఏర్పడిన దృఢమైనభావన (Con. ception or notion formed in the mind; determination) అట్టి సంకల్పం నిమిత్తంగా పుట్టిన రాగాదుల స్వాభావికాలు కావు.

కొందరిపై ప్రేమా, కొందరిపై ద్వేషమూ, మనకు అకారణంగా కలుగుతూ ఉంటాయి, అవి నిర్నిమిత్తకాలు

తల్లిపాలు త్రాగాలన్నకోరిక అప్పుడే పుట్టినబిడ్డకు అకారణంగా కలుగుతుందనటం సబబుకాదు. పూర్వానుభవం వల్లనే కలుగుతున్నది.

'ద్రవ్యాణి ద్రవ్యాంతర మారభంతే గుణాశ్చ గుణాంతరమ్' అని వైశేషిక దర్శనం చెపుతున్నది. ద్రవ్యాల నుండి ద్రవ్యాంతరాలు గుణాలనుండి గుణాంతరాలు పుడుతున్నవని కణాద మహర్షి చెప్పాడు. ఒక వస్తువునుండి దానికి దగ్గర పోలికలుగల మరోవస్తువు ఉత్పన్నమవు తున్నది. అలాగే ఒక గుణంనుండి దానికి దగ్గర పోలికలుగల మరో గుణం (గుణాంతరం) ఉత్పన్నమవుతున్నది. ఈ విధంగా సృష్టి వ్యాపి స్తున్నదని ఆయన అన్నాడు.

కపాలాన్ని బట్టి కుండ, మూకుడు, దాకలి మొదలైన ద్రవ్యాంత రాలన్నీ ఉత్పన్నం కావటంలేదా? అవి వేర్వేరు ప్రయోజనాలను సాధి

స్తున్నాయి. ప్రతీదానికి ప్రయోజనం ఉన్నది. ప్రయోజనం ఉన్నదేదీ నిర్నిమిత్తంగాని, స్వాభావికంగాని కాదు. కపాలాకారాన్ని మనస్సులో ఉంచుకోకుండా కుండని తయారుచేయటం జరగనట్లే పూర్వానుభవాన్ని దృష్టిలో ఉంచుకోకుండా అప్పుడే పుట్టినబిడ్డ తననోరు తెరచి తల్లి చను మొనల్ని తడుముకోవటం జరగదు.

పూర్వపక్షం : మనం, చిన్నపిల్లలు తల్లి స్తనాలను నోటితో తడుముకోవటం స్వాభావికమా, పూర్వజన్మ అనుభవ స్మరణమా అన్న విషయం చర్చిస్తున్నాము. దానికీ కుండకి పోలికేమిటి? ఆదిమ మానవుడు కపాలాన్నే గిన్నెగా వాడుకొని ఉండవచ్చుగాక! అంత మాత్రాన మీరు అన్నిటికీ కుండ ప్రస్తావనను తేవటం బాగాలేదు.

ఉత్తరపక్షం : 'పార్థివం, తద్విశేషగుణోప లబ్ధేః'- పృథివికి సంబంధించిన విశేషగుణాలు మన శరీరంలో లభించబట్టే మనశరీరాలు కూడా మటికుండలే అని చెప్పాలి. పార్థివ పరమాణువులకు మాత్రమే శరీరారంభశక్తి ఉన్నది. అందుకు శ్రుతి ప్రమాణంకూడా ఉన్నది. 'భస్మాంత్ గ్ం శరీరమ్' ( యజుర్వేదం 40-15 ) శరీరం భస్మాంతం: భస్మం పార్థివమేకదా! కనుక శరీరానికి కుండకీ పోలిక ఉన్నదని గ్రహించండి.

పూర్వపక్షం: వీర్యకణమూ, అండమూ - అను రెండూ పార్థివములే అయినప్పటికీ వాటి కలయికవల్ల ఏర్పడిన పిండానికే శరీరారంభ శక్తి, అనగా శరీరాన్ని నిర్మించేశక్తి, ఉన్నది. కుండలోని పరమాణువులకా శక్తి, లేదే!

ఉత్తరపక్షం : కుండలోని అణువులు కుండయొక్క ఆకృతిని ధరించి, అది విచ్ఛిన్నంకాకుండా చేస్తున్నాయి. దాని అణువులు

విచ్ఛిన్నం అవటమే జరిగితే కుండ బూడిదై పోతుంది. కుండగా ఉండదు. కారణ గుణమేకాదు : ధారణ గుణంకూడా పార్థివమే

పూర్వపక్షం : ప్రతిమనిషి కంటిలోనూ నల్లగుడ్డు (కృష్ణసారం) ఉంది. శరీరం పార్థివమంటున్నారుగదా ! ఈ నల్లగుడ్డుకూడా పార్థివమే. అది ఉంటే దూరంలో ఉన్న వస్తువులు దర్శన మాత్రాన గ్రహింపబడుతున్నాయి. అది లేకపోయినా దూరంలో ఉన్న వస్తువులు స్పర్శాదులద్వారా గ్రహింపబడుతున్నాయి. కాని, కనపడుటలేదు. ఏ యితర శరీరేంద్రియానికీ వస్తువులు కనబడటంలేదు. కంటికిమాత్రమే కనబడుతున్నాయి. ఏ యితర ఇంద్రియానికి లేని విశేషగుణం కంటికి ఉన్నందున కన్ను ఇంద్రియం కాదనవచ్చునా ? శరీరమూ, కుండా పార్థివాలే అయినప్పటికీ శరీరారంభ శక్తి ప్రాణభూతమైన పిండంలోనే ఉంది కనుక శరీరం కుండకాదు.

ఉత్తరపక్షం : నల్లగుడ్డు యింద్రియంకాదు "మహదణుగ్రహణాత్"—దానికన్నా చాలా చిన్నవస్తువుల్ని, చాలా పెద్దవస్తువుల్ని, చాలా పెద్దవస్తువుల్ని కన్ను సునాయాసంగా గ్రహించగలదు. కుండ నీటిని గ్రహించినట్లు. అలా గ్రహించేశక్తి శరీరంలో ఏ యితర యింద్రియానికి లేదు. అందుకే నల్లగుడ్డును ఇంద్రియం అని చెప్పటానికి వీల్లేదు. తైజస పదార్థం ఆ నల్లగుడ్డులో ఉంది. అదిచాలా సూక్ష్మంగా ఉంది, ఆ పదార్థమే సమస్త వస్తువుల్ని గ్రహిస్తుంది. ఎలా గ్రహిస్తుంది ?

"రశ్మ్యర్థ సన్నికర్ష విశేషాత్ తద్గ్రహణమ్"-నేత్రరశ్మితో ఆయా వస్తువులకు సన్నికర్ష కలగటంవలన అవి గ్రహింపబడుతున్నాయి.

పూర్వపక్షం : కంటి నుంచి వెలుగు వెడలి వస్తువులమీద ప్రసరించటం అంటూ ఎక్కడా ఏపరూ చూడలేదు. కనుక తదనుపలబ్ధే రహేతుః నేత్రరశ్మి అంటూ లేదుగనుక మీరు చెప్పింది హేతువుకాదు.

నేత్రరశ్మి అంటూ ఉంటే దీపపుకాంతిలా కంటి కాంతి మరో కంటికి స్పష్టంగా కనబడుతుంది. కనబడితీరాలి.

ఉత్తరపక్షం: ఏవస్తువైనాసరే ప్రత్యక్షంగా కనబడనంత మాత్రాన అది లేదనటంతగదు. చంద్రుని పరభాగంగాని, భూమి అధోభాగంకాని ప్రత్యక్షంకానంత మాత్రాన లేవంటామా? అనుమాన ప్రమాణంచే వాటి ఉనికిని నిర్ధారిస్తాము. శాస్త్ర ప్రమాణం అనుమానమేగాని ప్రత్యక్షం కాదు. గణిత శాస్త్రం యావత్తు అనుమానమే. అలాగే నేత్రరశ్మికూడా అనుమానమే. కంటికీ, ఒక వస్తువుకీ ఏదైనా అడ్డుఉంటే ఆవస్తువు కనబడుతుందా? కనబడదు. ఏదైనా వస్తువు అడ్డంఉంటే దీపపురశ్మి ప్రసరించనట్లే నేత్ర రశ్మి కూడా ప్రసరించదు. అందుకే నేత్రరశ్మి అంటూ ఉన్నదని ఊహించటం జరిగింది. కనుక ప్రత్యక్షంగా లేనంతమాత్రాన నేత్రరశ్మి లేదనటం అవివేకమే.

కాంతి ఏదయినా రూపవంతమేగదా! నేత్రరశ్మి కూడా రూపవంతం కావాలి. రూపవంతమైనదేదైనా ప్రత్యక్షగ్రాహ్యం కావాలికదా! అంటారు మీరు.

'ద్రవ్యగుణధర్మ భేదాచ్చైవ లబ్ధి నియమః- ద్రవ్యగుణధర్మాలలో భేదం ఉన్నంతవరకు అలాంటి నియమం ఏదీ లేదు. రెండు అణువులు కలిసిన వస్తువును 'ద్వణుకం' ( diatom ) అంటాము. అది రూపవంతమే అయినా మన కంటికి కనపడదు. ఎందుచేత? అది అల్పాల్పమైనది గనుక: దానికి మహత్త్వము (పెద్ద శరీరం) లేదు. ద్రవ్యం ఎక్కువగా ఉంది. మహత్త్వం గలదేదైనా ఉద్భూత ( Expressed ) రూపాన్ని కలిగి ఉంటుంది. అది మాత్రమే కంటికి కనిపిస్తుంది.

పూర్వపక్షం : పోనీలెండి రాత్రి మాత్రమేకాదు: పట్టపగలు కూడా ఉల్కాలు పడుతూ ఉంటాయి ఉజ్వలంగా ఉండే సూర్యరశ్మిలో ఉల్కాల కాంతి కనబడనట్లు పగటి వెలుగులో నేత్రరశ్మి కనపడదని అనుకుందాం. అధికకాంతి అల్పకాంతిని మ్రింగివేయటం జరుగుతోంది. దీనినే 'అభిభవ' ( Over powering ) మంటాము. అలా అనుకుందామా?

ఉత్తరపక్షం : నరాత్రావ ప్యనుపలబ్ధేః- రాత్రి సమయంలో పగటి వెలుగు ఉండదుగదా! అప్పుడైనా నేత్ర రశ్మి ప్రత్యక్షం కావాలి. అలా కావటంలేదు.

ఉల్కాపాతం పగలు కనబడకపోయినా రాత్రివేళ కనిపిస్తుంది. నేత్రరశ్మి పగలూ, రాత్రికూడా కనబడటంలేదు కనుక లేదంటామా? అలా అనటానికి వీల్లేదు అలాంటప్పుడు నేత్రరశ్మిఎందుచేత ప్రత్యక్షం కావటంలేదు?

అంటే,

వస్తువులకు స్వయంప్రకాశ శక్తిలేదు అవి వెల్లడి కావాలంటే బయటనుండి వెలుగువచ్చి వాటిమీద ప్రసరించాలి దానినే బాహ్య ప్రకాశ అనుగ్రహం' అంటాము. ఈవిధంగా బయటనుండి ప్రసరింపబడే వెలుగు, అనుగ్రహించనిదే అభివ్యక్తం (Expressed ) కావి వస్తువుల్ని కన్ను పొందలేకపోతున్నది.

స్వయం ప్రకాశం గల ఉల్కాలు మొదలగునవి బాహ్య ప్రకాశ సహాయ్యం లేకుండానే రాత్రివేళ ప్రకాశిస్తున్నవి. పగటివేళ మీరుచెప్పినట్లుగా అంతకన్నా అధికమైన సూర్యరశ్మిలో ఈ ఉల్కాశక్తి అభిభవం అవుతూ ఉన్నది.

న క్తంచర నయనరశ్మి దర్శనాచ్ఛ - పోనీ కళ్ళకు కాంతి లేదను కుందామా అంటే రాత్రివేళ పిల్లులు, గొర్రెలు, పులులు మొదలైన జంతువుల నేత్రాలు కాంతితో ప్రకాశించటం చూస్తూనే ఉన్నాం.

కనుక కళ్ళు రశ్మిద్వారా వస్తువులను చేరి దానిని గ్రహిస్తున్నాయనీ, నేత్రరశ్మికి స్వయం ప్రకాశం లేదని అ ను కో వా లి. ఇది ఇంద్రియ సన్నికర్షమే.

పూర్వపక్షం: చర్మం ఇంద్రియ సన్నికర్షం లేకుండా ( అనగా స్పర్శించకుండా) ఏ వస్తువునూ గ్రహించలేదు. దూరంగా ఉన్న శబ్దాన్ని చెవి గ్రహించినట్లు, దూరంగా ఉన్న వస్తువును కన్ను చూస్తుంది. వస్తువూ కన్నూ ఒకదానికొకటి దూరంగా ఉన్నప్పటికీ కంటిచే వస్తువు గ్రహింపబడుతున్నది. అది ఇంద్రియ సన్నికర్షంకాదు.

కౌచాభ్రపటం స్ఫటికాంతరితోప లబ్ధే-గాజు, అభ్రకము, స్ఫటికం— వీటిల్లో దేనిలోంచి చూసినా వస్తువు కంటిచే గ్రహింపబడుతూనే ఉంది. గాజు, అభ్రకము మొదలైనవి కంటికి వ్యవధానం (అడ్డు) అయి ఉంటే వస్తువుతో కంటికి సన్నికర్షం ఎలా కలుగుతుంది?

వ్యవధానం (అడ్డు) ఉన్నా వస్తువు కంటిచే గ్రహింపబడుతున్నది. గనుక వస్తువు ప్రాపకారి (Effective only when touched) కాదని చెప్పాలి. నేత్రరశ్మియొక్క స్పర్శచేత ఏ వస్తువు గ్రహింపబడటం లేదు

ఉత్తరపక్షం : వస్తువు నేత్రరశ్మి సన్నికర్షం వల్లనే గ్రహింపబడుతున్నదని నేనంటున్నాను. గాజు, స్ఫటికం, అభ్రకం వంటి అవరోధాలు ఉన్నాకూడా అవతలి వస్తువులు కంటికి కనపడుతున్నాయి గనుక వస్తువులు

అప్రాప్యకారులని మీరన్నారు. అయ్యా, వస్తువులకి, మీ కంటిపొరకి పక్క గోడ ఒకటి అడ్డున్నది. అప్పుడు మీకు వస్తువు కనపడదు కదా ! నేత్రరశ్మి గోడలోంచి ప్రసరించకుండా గోడ ప్రతిబంధకమైంది. వస్తువు అప్రాప్య కారయినట్లయితే గోడ అవతలి వస్తువుకూడా ఏ నేత్రరశ్మి సన్నికర్షా లేకుండానే కంటికి కనపడాలిగదా ! అలా కనబడటంలేదు. కనుక వస్తువు ప్రాప్య కారేగాని అప్రాప్యకారి కాదు

గాజు, స్ఫటిక, అభ్రకము మున్నగు పారదర్శక ద్రవ్యాలు నేత్ర రశ్మికి ప్రతీఘాతాలు (అడ్డగించునవి) కావు. నేత్రరశ్మి వాటిల్లోంచి సునాయాసంగా ప్రసరించి వస్తువుతో సన్నికర్షను పొందుతోంది.

కాదంటారా ?

ఆదిత్యరశ్మేః స్ఫటికాంతరితేఽపిదాహ్యేఽవిఘాతాత్-అంటుకుపోయేవస్తువేదో ఒకటున్నది దానినిసూర్యరశ్మినుండి స్ఫటికంఅడ్డగిస్తున్న ప్పటికీ ఆస్ఫటికంలోంచే సూర్యరశ్మిప్రవేశించి ఆవస్తువునుదహించటంలేదా! కనుక నేత్రరశ్మికూడా పారదర్శక (Transinscent) వస్తువులద్వారా ప్రసరిస్తుందనీ, ప్రతీఘాతక (Opaque) వస్తువులద్వారా ప్రసరించదనీ గ్రహించండి నేత్రరశ్మియొక్క సన్నికర్షం లేనిదే ఏ వస్తువూ ప్రాప్యకారి కాదని కూడా అంగీకరించాలి పట్టపగలైనా గ్రుడ్డివాడికి ఏ వస్తువూ కనపడదు గదా ! అతని కంటికి రశ్మిలేదుగనుక.

పూర్వపక్షం : ఇతరేతర ధర్మప్రసంగం వద్దు అన్ని వస్తువులతోనూ ఒక వస్తువు సంబంధం ఒకే విధంగా ఉండాలనిలేదు. కాచం (భూతద్దం) లోంచి సూర్యరశ్మి ప్రసరించి దహింపదగిన వస్తువును దహించివేసేమాట నిజమే. అలా నేత్రరశ్మి దహించగలదా ? కావున మరో వస్తువుకున్న ధర్మాన్ని ఈ వస్తువుకుకూడా ఉన్నట్లు చెప్పకూడదు. సూర్య

రశ్మికి కాచంలోంచి ప్రసరించే గుణము ఉన్నది. దహించే గుణమూ ఉన్నది. నేత్రరశ్మికి కాచంలోంచి ప్రసరించినా మరోవస్తువును దహించే గుణం లేదుగనుక, ప్రసరించేగుణం లేకపోవచ్చుగదా!

ఉత్తరపక్షం : స్వభావగుణమే ధర్మం. కొన్ని వస్తువులకు సమాన ధర్మాలుంటాయి. అంతమాత్రాన ఆ రెండు వస్తువులూ ఒకటి కావు.

ఉదాహరణకి అద్దముంది : నీరుంది. ఒకటి ఘనపదార్థం; మరొకటి ద్రవపదార్థం. ఈ రెండింటికీ ప్రసాద స్వభావం ఉంది. అనగా స్వచ్ఛత (Purity) ఈ స్వచ్ఛతవల్లనే ఏ వస్తువుయొక్క ప్రతిబింబమైనా వాటిల్లో ప్రతిఫలిస్తున్నది అనగా ఆ వస్తువుయొక్క రూపాన్ని ఆ అద్దము (అదర్శం), నీటి ఉపరితలమూ గ్రహిస్తున్నాయన్నమాట!

కాచాదులుకూడా దర్పణంవలె స్వచ్ఛమైనవి కనుకనే అవి నేత్రరశ్మిని అడ్డగించటంలేదు. గోడ అలాకాదు. దానికి స్వచ్ఛత లేనందున నేత్రరశ్మికి ప్రతీఘాతమయింది.

'దృష్టానుమితానాం నియోగ ప్రతిషేధానుపపత్తిః'— దృష్టములు, అనుమితములు అయినవాటికి నియోగ ప్రతిషేధాల ఉపపత్తిలేదు.

ఈసృష్టిలో చాలాపదార్థాలు దృష్టములే ( Visible ) మిగిలినవి అనుమితాలు ( Conclusions ) కంటికి కనబడేవాటిని దృష్టాలని అంటాం గాలి వంటికి తగులుతుందేగాని కంటికి కనపడదు: అది అదృష్టమే. అయినా గాలిఉన్నది. అది పదార్థమే. ఇటుకంటికీ, అటుచెవికీ, స్పర్శకూ అందని ఆకర్షణశక్తి మున్నగునవి ఉన్నాయిగాని అవి పదార్థాలుగావు పదార్థంవేరు. పదార్థగతమైన శక్తివేరు ఇది అనుమితం ప్రత్యక్షపరిణామాలనుబట్టి మనకు కొన్ని పరోక్ష విషయాలు అవగతమవుతాయి వాటిని అనుమానాలని ( Conclusions ) అంటాము. అనుమానంద్వారా గ్రహింపబడిన విషయమే 'అనుమిత' అని చెప్పబడుతున్నది.

వాటికి విధినిషేధాలను ఏర్పరచటం అసాధ్యం. కంటికి కనపడే వస్తువు ముక్కుకు అందాలనటం న్యాయమా? పూల పరిమళం కంటికి కనపడదేమి? - అ న టం స బ బా? పదార్థాలన్నీ నియత స్వభావాలను నియత ధర్మాలనూ కలిగి ఉన్నాయి. వాటి స్వభావాన్నిగాని, ధర్మాన్నిగాని చెరచటం సాధ్యంకాదు. లేదా వాటికి కొత్త ధర్మాలను సంతరించడమూ సాధ్యంకాదు. కంచు మ్రోగినట్లు కనకం మ్రోగదుకదా! మ్రోగాలని ఆశించటం అవివేకం.

ఒక వస్తువులో అనేక స్థానాలుంటాయి. ఆ స్థానాలన్నీకలిపి ఒకే వస్తువుగా పేర్కొబడటం జరుగుతోంది. కాని, అందలి నానాత్వం ప్రత్యక్షమేకదా! కన్నును ఒకే యింద్రియంగా పేర్కొంటున్నారు. కాని ప్రతీకంటికీ ఎన్నోభాగాలు (స్థానాలు) ఉన్నాయి. వాటివాటిపనులు వేరు అయినప్పటికీ ఆ భాగాలన్నిటిపనీ ఒక్కటిగానే భావించి కన్ను అనటం వల్లనే ఇంత గందరగోళం కలుగుతోంది.

శాస్త్ర ప్రసంగం: ఆధునిక శాస్త్రజ్ఞులు కంటినుంచి కాంతి ప్రసరింపబడుతోందని అనరు వస్తువునుంచివచ్చే కాంతికిరణాలు శుక్లపటలంమీద పడి వక్రీభవనంచెంది, కంటిపాప ద్వారా కటకంమీద పడతాయి. అక్కడ నుంచి తర్పనం ద్వారా వక్రీభవనంచెంది నేత్రపటలంమీద తలక్రిందులైన బింబాన్ని ఏర్పరుస్తాయి. అది మెదడుకు ప్రసరించినప్పుడు నిటారుగా ఉన్న బింబం ఏర్పడుతుంది.

శుక్లపటలం, నేత్రోదం, కంటిపాప, కటకం తర్పనం నేత్రపటలం మొదలైనవి కంటిలోని వివిధస్థానాలు. ఈ విధంగా కంటిలోకి ప్రవేశించిన వస్తువుయొక్క రూపం నానాస్థానములందూ ప్రవేశించడం వల్ల, నా నా విధంగానూ చూపబడుతూ సంశయ కారణమవుతోంది.

ఉత్తరపక్షం : 'స్థా నా న్య త్వే నానాత్వా దవయని నానాస్థాన త్వాచ్చ సంశయః'- కంటిలో ఎన్నిభాగాలున్నాయో చూశాంగదా! అన్ని భాగాలూ దేనికది స్వతంత్రమైన యింద్రియాలా? లేక అన్నిభాగాలు కలిసి ఒకే యింద్రియమవుతోందా అన్న సంశయం కలుగుతుంది. కంటి లో ఏఒక్కభాగం చెడిపోయినా మొత్తంచూపుఆనదు. కనుక ఏభాగానికా భాగం స్వతంత్రమయిన అంగమేమో ననిపిస్తుంది.

పూర్వపక్షం: చర్మం సంగతిచూడండి. అదిశరీరాన్నంతనీ ఒకే విధంగా కప్పిఉంటుంది. అందులో నానాత్వమేదీ కనబడదు. వేర్వేరు భాగాలంటూ లేవు. కంటిగ్రుడ్డును. క్రిమ్మిన చర్మానికి సైతం స్పర్శజ్ఞానం ఉంది. ఆ మాట కొస్తే కంటికికూడా స్పర్శజ్ఞానం ఉంది. చెవి, నాలుక, కన్ను, ముక్కు అనేవన్నీ చర్మంలో తయారయినవే. అవిచేసేపనులన్నీ చర్మంచేసే పనులే. కనుక చర్మం ఒక్కటే ఇంద్రియము. తతిమ్మావేవీ యింద్రియాలుకావు.

ఉత్తరపక్షం: నయుగపత్ అర్థాను పలబ్ధే.-చర్మమే ఇంద్రియమనీ అదేచూడడం, వినడం, రుచి చూడడం, వాసనచూడటం చేస్తుందనీ మీరంటున్నారు. అదిసరియైనదికాదు. చర్మమే అన్నిపనులూ చేయగల దయితే అది పనులన్నీ ఏకకాలమందే చెయ్యాలి.

ఒక వస్తువును చూస్తున్నప్పుడు దాని ఆకారం కనిపిస్తుందే గాని దాని కాఠిన్యం తెలియదు అది కఠినమో, కాదోతెలియాలంటే ఆ వస్తువును ముట్టుకోవాలి. దానివాసన తెలియాలంటే ముక్కుకు సన్నికర్షకలిగించాలి. త్వగింద్రియ మొక్కటే ఉండి ఇంద్రియాల పనులన్నీ అదే చేస్తున్న పక్షంలో ఒక వస్తువునలా చూసేసరికి దాని మృదుత్వం తెలియాలి: వాసనతెలియాలి: రుచితెలియాలి లేదా నాలుక చాచితే ఆ వస్తువు కనబడాలి: దాని సవ్వడి నాలుకకే వినబడాలి: దాని వాసన ఆ

నాలుకకే తెలియాలి. చర్మం ఏకైక అవయవమయ్యేపక్షంలో వేరేముక్కు, కళ్ళు, నాలుకా, చెవులూ ఉండవలసిన పనిలేదు అన్నిపనులూ చర్మమే చెయ్యాలి. కనుక చర్మం అనే ఒక్క ఇంద్రియమే ఉన్నదనిచెప్పటంతప్పు.

ఇంద్రియార్థ పంచత్వాత్ - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అయిదూ ఇంద్రియార్థాలు అందులో స్పర్శ చర్మానికితెలిస్తే, దృశ్యం కంటికి తెలుస్తుంది. శబ్దంచెవికీ, రుచినాలుకకీ, పరిమళం ముక్కుకూ తెలుస్తాయి. అందుకే ఇంద్రియాలు కూడా అయిదే అవుతున్నాయి.

పూర్వపక్షం: నతదర్థ బహుత్వాత్ - ఇంద్రియార్థాలు అయిదు కనుక ఇంద్రియాలు అయిదన్నారు. ఇంద్రియాలు అయిదేమిటి? చాలా ఉన్నాయి. వాసన రెండురకాలుగా ఉంది. సువాసన వొకటి: దుర్వాసన వొకటి. రుచులుచాలాఉన్నాయి తీపి, పులుపు, ఉప్పు, కారం, ఒగరు, చేదు అని ఆరు, రంగులు-నీలం, ఎరుపు, తెలుపు, పసుపు, ఆకుపచ్చ, ఊదారంగు, మట్టిరంగు, అని ఏడు, ఉష్ణం, శీతలం, సమశీతోష్ణం - అని, స్పర్శలుమూడు, కాఠిన్యం, మృదుత్వం మరోరెండు. ఇక శబ్దాలు, స్వరాలు ఎన్నైనా ఉన్నాయి. ఇన్ని ఇంద్రియార్థా లున్నప్పుడు ఇంద్రియాలుకూడా అన్నీ ఉండాలి బొత్తిగా అయిదే అనటం సబబుకాదు.

ఉత్తరపక్షం: సువాసన, దుర్వాసన అనేవి వాసనకు సంబంధించినవే కదా! అదే ముక్కు సువాసనను ఎలాగ్రహిస్తుందో దుర్వాసనను కూడాఅలాగే గ్రహిస్తుంది. మీరుచెప్పిన షడ్రసాలనూ ఒకేనాలుక రుచిచూసి చెపుతుంది అలాగే శీతోష్ణాదుల్ని ఒకేచర్మం చెపుతుంది. ఏడు రంగుల్ని ఈకన్నే చూడగలుగుతుంది. రూప, రస, గంధ, స్పర్శ, శబ్దాలలో తేడాలున్న మాట నిజమే ఆ తేడాలన్నిటినీ ఈ అయిదు యింద్రియాలు గుర్తించ గలుగుతున్నాయి. లేకుంటే రెండు ముక్కులు, ఏడు కళ్ళు, ఆరు నాలుకలు, ఎడుచెవులూ, మూడుచర్మాలూ ఏర్పడిఉండేవి.

అలా ఏర్పడలేదు. అయిదే ఇంద్రియాలున్నాయి ఇంద్రియార్థాలు కూడా స్థూలంగా అయిదే ఉన్నాయి.

పూర్వపక్షం : విషయత్వా వ్యతిరేకాదేకత్వమ్ - రంగు, వాసన రుచి మున్నగు ఇంద్రియార్థాలన్నీ ఏకంగా ఏదో ఒక వస్తువు. కుండతం సామాన్యమేకదా! దేనికవి వేరుగా లేవు, అన్నీ ఒకచోటే ఉన్నాయి. ఇంద్రియార్థాలలో ఈ రకం ఏకత్వంఉంది కనుకనే, ఇంద్రియాలలో సైతం ఏక్యతముందని నా అభిప్రాయం.

ఉత్తరపక్షం-బుద్ధి, లక్షణం, అధిష్టానం, గతి, ఆకృతి, జాతి-అను ప్రమాణాలను బట్టి చూపినట్లయితే మీరుచెప్పింది సరికాదనిపిస్తోంది.

1. ఇంద్రియములద్వారా లభించిన జ్ఞానానికే ఇంద్రియార్థ 'బుద్ధి' అనిపేరు. వాసనకు సంబంధించిన జ్ఞానంవేరు; రుచికిసంబంధించిన జ్ఞానం వేరు; వినికిడికి సంబంధించిన జ్ఞానం వేరు. ఇవన్నీ ఒకటి కావు అందుకే ఇంద్రియాలుకూడా ఒకటి కావనిపిస్తోంది.

2 లక్షణం : ఇంద్రియాలు అయిదింటికీ వేర్వేరు లక్షణాలు కనిపిస్తున్నాయి: వాసనచూసే లక్షణం ముక్కుకి, రుచిచూసే లక్షణం నాలుకకి, చూసేలక్షణం కంటికీ, వినేలక్షణం చెవులకీ, శీతోష్ణాలనూ,మృదుత్వ కాఠిన్యాలనూ గ్రహించే లక్షణం చర్మానికీ ఉన్నాయి. ఒకదానిలక్షణం మరొకదానికిలేదు ఈ రకం లక్షణ వైవిధ్యాన్నిబట్టిచూసినా ఇంద్రియాలు అయిదనిపిస్తోంది.

3. అధిష్టానం అనగా ఉండేచోటు. కన్ను, ముక్కు, నాలుక, చెవి, చర్మం తలోచోటా ఉన్నాయి, అలాచూసినా ఇంద్రియాలు వేర్వేరుగా ఉన్నట్లు తోస్తున్నాయి

4. గతి, అనగా అర్థగ్రహణపద్ధతి, చర్మంకేవలం స్పర్శమాత్రాన

గ్రహిస్తుంది నాలుక రసాన్ని పీల్చుకుని రుచిని తెలియజేస్తుంది వస్తువు దూరంగా ఉన్నా వాసననుబట్టి పసిగడుతుంది ముక్కు. చెవి శబ్దసంతానాన్ని క్రమబద్ధంగా స్వీకరిస్తుంది. కన్ను ఎంత దూరంలోనున్న వస్తువునైనా రూపురేఖావిలాసాలను సాకల్యంగా గ్రహిస్తుంది. కనుక వేర్వేరు గతులను చూస్తే ఇంద్రియాలు కూడా వేరనిపిస్తుంది. కనుక వేర్వేరుగతులను చూస్తే ఇంద్రియాలుకూడా వేరనిపిస్తుంది.

5. ఇక ఆకృతి- కన్ను, ముక్కు, చెవి, చర్మము, నాలుక-అను ఈ అయిదింటి ఆకృతులూ అయిదు విధాలుగా ఉన్నాయి. కనుక అయిదూ అయిదింద్రియాలని చెప్పక తప్పదు.

6. జాతి అనగా ప్రత్యేక స్వభావం. కంటికి చూపు, ముక్కుకుపసి చెవికి వినికిడి, చర్మానికి స్పర్శ. నాలుకకు రుచి ప్రత్యేక లక్షణాలు. ఆ విధంగా అవి అయిదూ అయిదు జాతులు. ఈ రకంగా జాతిభేదాన్నిబట్టి చూసినా ఇంద్రియాలు అయిదు. అన్నిటికి మించి చెప్పదగిన ఒక లక్షణం ఉంది అది తాదాత్మ్యం. భూతగుణ విశేషోపలబ్ధే తాదాత్మ్యమ్- ముక్కు వాసనలోనే లీనమైపోతున్నది.పృథ్వి లక్షణం— అనగా పార్థివం. నాలుక రుచి జలాత్మకమయినది. రసం లభిస్తే గాని రుచి (రసన) లభించదు. మంచి రుచి లభిస్తే నోరు ఊరుతుంది. ఆవిధంగా చూసినా నాలుక రసాత్మకమయినది అగ్నినుండి తేజస్సు ప్రసరించి వస్తువులు ప్రకాశిస్తాయి. అలాగే కంటి నుండి వెలుతురు ప్రసరించి వస్తువులు గోచరిస్తాయి. కనుక కళ్ళు తైజసాత్మకములు. స్పర్శ వాయ్వాత్మకము; గాలి సహాయంతో గాని జరగని పని. శబ్దం ఆకాశాత్వకం. ఈథర్ లేకుండా శబ్దం ఒకచోట నుండి ఒకచోటుకు ప్రసరించదు.

ఈ విధంగా చూస్తే పంచేంద్రియాలు పంచభూతాత్మకాలని రుజువగుచున్నది. అవి వేరు వేరేగాని ఒకటికావు.

అర్థపరీక్షణమ్ : నిజమేనా ? పంచభూతాలు పంచేంద్రియాలవలెనే వేర్వేరు జాతులయి ఉన్నవా ? వాసన ఒక్కటేనా పార్థివం ?

తప్పు. పృథ్వికి శబ్దంతప్ప వాసన,రుచి. రూపం, స్పర్శ ఉన్నాయి. నీటికి రుచి, రూపం, స్పర్శ ఉన్నాయి వాయువుకు స్పర్శ. ఆకాశానికి శబ్దమూ మాత్రమే ఉన్నాయి. ఇది వాస్తవం.

పూర్వపక్షం : సర్వగుణానుపలబ్ధే - ముక్కు పార్థివమనీ, కనుక వాసనను కలిగిఉన్నదనీ మీరుచెప్పారు. కాని పృథ్వికి గంధ, రస, రూప, స్పర్శలను నాలుగు గుణాలు ఉన్నాయి. ఒక శబ్దం మాత్రమే లేదు. కనుక పార్థివమైన ముక్కుకుకూడా ఈ నాలుగు గుణాలు ఉండాలి. అది వాసన చూస్తుందేగాని చూడలేదు. రుచిచూడలేదు. స్పరించగలదు. పృథ్వికి గల నాలుగు గుణాలలోను రెండుగుణాలు ముక్కుకులేవు. కనుక ముక్కు పార్థివమెలా అవుతుంది ? ఒక వస్తువు ఫలానా వస్తువుకు చెందినదని చెప్ప డానికి మూలవస్తువుయొక్క సమస్తలక్షణాలు ఆ వస్తువులో కనిపించాలి. కనుక మీ వాదం తప్పు.

ఉత్తరపక్షం (ఏకాదేశి సమాధానం) : పృథ్వికి గంధ, రూప, రస, స్పర్శలను నాలుగు గుణాలు ఉన్నప్పటికీ అందు గంధ గుణమే బాగా ఉద్భతంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అలాగే తతిమ్మా నాలుగు భూతాలలోనూ నాలుగు రకాల గుణాలు ఒక్కొక్కటి చొప్పున ప్రస్ఫుటంగా కనిపిస్తు న్నాయి. ముక్కులో నీరు ఉంది. స్పర్శగుణమూ ఉంది. కాని దానికే వాసనను గ్రహించే శక్తి ఉంది. ఆ శక్తి తతిమ్మా అవయవాలకు లేదు గదా ? సిద్ధాంతరీత్యా ఎవరేమి చెప్పినా ఒక్కొక్క ఇంద్రియానికి ఒక్కొక్క రకం ఇంద్రియార్థమే ప్రస్ఫుటంగా ఉన్నదని చెప్పుకుంటే

చాలు. పృధ్వియందు వాసనను గ్రహించే శక్తి నీటియందు రుచిని గ్రహించే శక్తి, అగ్నియందు రూపాన్నీ, వాయువునందు స్పర్శనూ, ఆకాశమందు శబ్దాన్నీ గ్రహించే శక్తులు మాత్రమే ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయని చెప్పవచ్చు.

విష్టంభ్యా పరం సరేణి-చల్లదనాన్ని గ్రిహించే శక్తి భూమికి ఉందా? భూమిలో నీరుకలిసి నప్పుడే అది చల్లబడుతుంది కనుక ఒక భూతంలోకి మరియొక భూతం కలియటం జరుగుతున్నది.

ఉత్తరపక్షం (సిద్ధాంతి) ఏకదేశగారి సిద్ధాంతాలు అన్నీ తప్పే, నీరు, నేల స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నాయి. ప్రిత్యక్షంగా కనిపించేవాటి గురించి ఊహించటం సరియైన పనికాదు.

నేలలో నీరు లేదా?- అది తియ్యగా ఉండటంలేదా?- అదే నీరు నేలలో మరోచోట ఉప్పగానూ, ఇంకోచోట చప్పగానూ ఉంటుందేమిటి? అలాగే మండుచున్న అగ్ని ఎర్రిగా ఉంటుంది. అది తెల్లగా, నల్లగా, ఆకు పచ్చగా ఉండదేమిటి? ఉన్నదంటే మూల పదార్థంలో ఏదోకలిసి నట్లేగదా! నీటిలో ఉప్పుకలిస్తే తియ్యగా ఉంటుంది. ఏదీ కలియకపోతే చప్పగా ఉంటుంది.

మటికి వాసనను గ్రిహించే శక్తి ఉన్నట్లుగానే రుచిచూపేశక్తి కూడా స్వభావికంగా ఉన్నదనటం సబబుకాదు! ముక్కులో కూడా నీరు పడుతుంది. అనగా రొంప చేసిందని అంటాం. ఈ రకం జలసంయోగం వల్ల ముక్కు రుచిని గ్రిహించగలదా! పైగా ఆ సమయాలలో వాసనచూసే శక్తినికూడా కోల్పోతుంది.

గాలిలోని దుర్వాసనాదుల్ని మట్టి పీల్చుకుంటుంది. ఆ మట్టిపైనే నీరు పేరి మురిగితే దుర్వాసన వేస్తుంది.

ఈ నీరే నాలుకను ఆశ్రయించి వస్తువుల సమస్త రుచుల్నీ తెలియ జెపుతుంది. ఆనీరే కంటిని ఆశ్రియించి విప్పులో పడ్డ నీటివలె కంటియొక్క రూప గ్రిహణ శక్తిని ఆర్పివేస్తుంది. ఆ నీరే చర్మానికి చెమటై స్పర్శకగుణాన్ని స్పందింపజేస్తుంది. కనుక నాలుకలో ఉండి రుచిని గ్రహించేనీరే ముక్కులోచేరి శ్వాసను బంధించింది; కంట్లో చేరి చూపును మందగింపజేసింది; చర్మంలోచేరి స్పర్శక గుణాన్ని అప స్పర్శక స్థితికి మళ్ళించింది,

ఏది ఏమయినా ఒక్కొక్క ఇందిరియానికి ఒక్కొక్క గుణమే ప్రిధానంగా ఉందని చెపితే చాలు అందుకు ప్రితీ ఇందిరియానికి ఒక భూత ద్రివ్యమే హేతువయింది ఆ విధంగా పంచ భూతాత్మకమైన పం చేందిరియ వ్యవస్థ ఏర్పడింది.

సగుణానాం ఇంద్రియ భావాత్-వాసనచూడటం వంటి గుణాలు కలిగి ఉన్నవే ఇందిరియాలని చెప్పబడుచున్నాయి. స్పర్శ గుణంలేని చర్మం చర్మంకాదు; అది చెప్పు. రుచి తెలియని నాలుక నాలుకకాదు: చూపెరుగని కన్ను కన్నుకాదు, వినికిడి లేనిచెవి చెవికాదు.

తేనైవత స్యాగ్రిహణాచ్చ- ఏయిందిరియమూ తన గుణాన్నితాను గ్రిహించలేదు. కన్ను ప్రిపంచాన్ని చూస్తుందేగాని తాను ఎట్లుందో చూసుకోలేదు. ఏ ముక్కు అయినా తనవాసన తాను గ్రిహించ లేదు. ఏ నాలుకకూ తన రుచి తనకి తెలియదు. అందుకే మట్టి తన వాసనను తాను గ్రహించలేదు. నీటికి తన రుచి తెలియదు- అలాని అవిలేవన టానికి వీల్లేదు. దీపం కాంతివంతం కాకపోతే ఇతర వస్తువుల్ని ఎలా ప్రికాశింప జేస్తుంది?

పూర్వపక్షం: ఉండండి. చెవుల్లో హోరు అప్పుడప్పుడు వింటూనే ఉంటాం, చెవులు హోరుపెడుతున్నాయని అంటూనే ఉంటాము.

ఇంద్రియాలకు స్వగుణాలను గ్రహించే శక్తి లేకపోతే ఇదెలా సాధ్యమయింది ?

ఉత్తరపక్షం : "తదుపలబ్ధి రితరేతర ద్రవ్యగుణ వైధర్మ్యాత్"- ఇతరేతర ద్రవ్యాలయొక్క గుణవైధర్మ్యంవల్లనే అలా జరుగుతుంది. చెవిలో గులిమి పెరిగి, గడ్డకట్టి, రాయి అవుతుంది. దానికి వాయుప్రకంపనం కలిగ శబ్దమవుతుంది. ఆ శబ్దమే చెవికి వినిపించి హోరు పెడుతున్నది కాని చెవి హోరు కాదు. అందుకే చెవుల్లో నూనెపోసుకుంటే గులిమినాని హోరుపెట్టడం తొలగిపోతుంది. కనుక ఆ హోరు మరోదానిదే గాని చెవిది మాత్రం కాదు.

# ఆరవ ఆహ్నికం

సాంఖ్యులు బుద్ధిని అంతఃకరణ మన్నారు. అనగా లోపల జరిగే పని అని అర్థం. పని ఏదయినా "కర్మ" యే. కర్మ **is action consisting of motion:** కర్మకు గతి ఉన్నది

సాంఖ్యుల మతం ప్రకారం సర్వేంద్రియాలు నరాలతో నిర్మింపబడ్డాయి. ప్రతీ నరంలోనూ అతిసూక్ష్మగోలకాలు (globules) ఉన్నాయి. ఇందిర్రియాలు సేకరించిన విషయాన్ని ఈ గోలకాలు ఒకదాని కొకటి అందించుకొంటూ పోవడంద్వారా మెదడుకు చేరుకొని విషయాకారతను పొందుతాయి. ఈ విషయాకారత వల్లనే ఇది కుండ, ఇది బొమ్మ అను జ్ఞానం మనకు కలుగుతోంది. ఇదే లోకజ్ఞానం అంతఃకరణం ద్వారాలభిస్తోంది. జ్ఞానేంద్రియాలద్వారా సేకరింపబడిన జ్ఞానం బుద్ధిలో ప్రవేశించడానికిగాను కొన్ని కర్మలు జరుగుతున్నాయి ఆ కర్మలు ఉపేక్షణ, అపక్షేపణ ఆకుంచన, ప్రసారణ, గమనములను వివిధ దశల్లో జరుగుతాయి. కనుక బుద్ధిని అంతః కరణమనీ ఆలోచనను కర్మ అని చెప్పవచ్చు.

మెదడు ఇంద్రియం. బుద్ధి ఇంద్రియంకాదు. జ్ఞానేంద్రియాలన్నీ కర్మేంద్రియాలే. సందేహంలేదు. కాని జ్ఞానం ఇంద్రియమూ కాదు; కర్మాకాదు. కర్మఫలం నరాల గోలకాలద్వారా ఇంద్రియార్థాలు అందివ్వ బడలాయన్నమాట సత్యమే ఇందిర్రియ వ్యాపారం గోలకాలకు వర్తిస్తుందేకాని ఇంద్రియార్థాలకు వర్తించదు జ్ఞానం ఆకాశం లాంటిది. ఆకాశం Is the ethereal fluid pervading the universe ఆకాశం అవాస్తవ మయినట్లుగా బుద్ధికూడా అవాస్తవమే అనగా వస్తువు కానిది ఆకాశానికి ఉపేక్షణ, అవక్షేపణ, అకుంచన, ప్రసారణ, గమనాలు

లేనట్లే బుద్ధికీలేవు. ఇంద్రియాలు లౌకిక (లోక) జ్ఞానాన్ని సేకరించి మెదడునకు అందిస్తాయి. దానినుండి మెదడు పారలౌకిక జ్ఞానాన్ని సాధించ గలదు. అది అతీంద్రియ జ్ఞానం. బుద్ధి తాను సేకరించిన విషయ జ్ఞానాన్నుంచి విషయాంతర జ్ఞానాన్ని సాధించగలదు. కర్మేంద్రియాలకు ఆశక్తి లేదు. అందుకే బుద్ధి ఆకాశం లాంటిది- అన్నారు వైదికులు

మెదడున్నా బుద్ధిలేని వాడున్నాడు: కానీ బుద్ధి ఉండీ మెదడులేని వాడు లేడు కనుక బుద్ధి బుద్ధీందిరియం ఫలమేగాని వేరుకాదు బుద్ధీంద్రియం బుద్ధిపుడుతుంది. అది పనిచేస్తేనే కర్మమేకదా ?- అన్నారు సాంఖ్యులు.

ఈ రెండు వాదాలు సమంజసంగానే కనిపిస్తున్నాయి కనుకనే బుద్ధి కర్మయా, ఆకాశమా అని సందేహం కలుగుతోంది. కర్మాకాశ ధర్మాత్ సంశయః- బుద్ధికి ఆకాశధర్మమూ, కర్మధర్మమూ. ఉన్నాయికనుకనే సంశయం కలుగుతోంది.

శాస్త్రవాది: కర్మేంద్రియాలన్నింటా జ్ఞాననాడులున్నాయి కనుకనే కర్మేందిరియాలకు జ్ఞానేంద్రియాలనికూడా పేరువచ్చింది. జ్ఞాననాడులు గుండరిని కణాలతో నిర్మింపబడ్డాయి. వాటికే న్యూరోను (Neurones) లని పేరు. ఇవి యితర కణాలవలె విభజింపబడవు. ఒకసారి నాశనమయితే తిరిగి పుట్టవు. ప్రతి న్యూరోనుకూ కణశరీరం ఉంటుంది ఆ కణ శరీరం మీద మరిరిచెట్టులా శాఖోపశాఖలతోకూడిన మహారణ్యంలా కేశాలుం టాయి. వీటికి (Dendrites) అని పేరు ఒక న్యూరోనుయొక్క డెంద్ర యిట్స్ ఇంకొక న్యూరోనుయొక్క డెంద్రయిట్స్‌తో చిక్కుకొని ఉం టాయి. ఆ విధంగా ఒకదానినొకటి పట్టుకు పెద్దతోరణంవలె ఏర్పడ్డ న్యూ రోనుల సముదాయమే జ్ఞాననాడి. అంతేకాని రక్తనాళం గొట్టం కాదు. ఇందిరియజ్ఞానాన్ని ఒక న్యూరోను ఈ డెంద్రయిట్ ద్వారా రెండవ

న్యూరోను డెంౘ్రయిట్స్‌కు అందిస్తుంది. ఆ విధంగా అది మెదడుకు చేరు కుంటుంది కనుక సాంఖ్యులు చెప్పిన గోలకముల సిద్ధాంతానికి ఆగమ ప్రమాణం వుంది. వైదికులుకూడా అంతవరకూ అంగీకరించారు.

పూర్వపక్షం : ఎందుకొచ్చిన సంశయమిది ? కర్మ వేరు: ఆకాశం వేరు బుద్ధివేరు. ఈ మూడింటికీ అసలు పోలికేలేదు. బుద్ధి వస్తువే. వస్తువుకీ గుణం ఉంటుంది. బుద్ధికి విషయప్రతభిజ్ఞానముంది. అనగా గుర్తుపట్టే శక్తి ఎప్పుడో ఒకసారిచూసిన వస్తువును తిరిగి గుర్తుపట్టటం గుణమేకదా! ఆ గుణం బుద్ధికే వుంది. పువ్వుకు పరిమళంలేదా ?

ఉత్తరపక్షం : సాధన వల్లలభించిన దానిని సాధ్యమని అంటాము. బుద్ధి రెండుసార్లు సాధించిన విషయాల్లో (సాధ్యాల్లో) సామాన్యత ఎప్పుడయితే కనిపించిందో అప్పుడె ప్రత్యభిజ్ఞ కలుగుతుంది బుద్ధికర్మేంద్రియమే అయినట్లయితే అది అచేతనమే, అచేతన వస్తువులో ప్రత్యభిజ్ఞ కలుగుతుంది, నిన్నచూసిన వస్తువును ఇవాళ చూసినా గుర్తుపట్టలేని స్థితిలో బుద్ధి ఉన్నదంటే అది నశించినట్లే. అ ప్రత్యభిజ్ఞానేచ వినాశప్రసంగః- జ్ఞాపకంలేని బుద్ధిలేదనే అనుకోండి. బుద్ధిచైతన్యవంతం కనుకనీ కర్మేంద్రియం కాదు.

"నయుగపదగ్రహణాత్"- ఇంద్రియాలన్నీ సూటిగా బుద్ధికేచేరే పక్షంలో చైతన్యవంతమైన బుద్ధి అన్ని ఇంద్రియార్థాలను ఒక్కుమ్మడిగా గ్రహించటంలేదు. ఒకదానివెంట ఒకదానిని గ్రహిస్తున్నది. కనుక అది కూడా కర్మేంద్రియమేమో అనిపిస్తున్నది. సాధనలేకుండా సాధ్యంలేదు. సాధన కర్మయే కదా! చైతన్యం ఆకాశమే.

పూర్వపక్షం: 'క్రమవృత్తిర్వాదయుగ పద్గ్రహణమ్'- ఒక్కొక్క ఇంద్రియాన్ని ఒక్కొక్కసారి ప్రయోగించే విధానమే క్రమ వృత్తి.

ఈ క్రమ వృత్తి వల్లనే అన్ని ఇంద్రియార్థాలను బుద్ధి ఒక్కుమ్మడిగా గ్రహించటం జరగదు. అదికూడా చైతన్య లక్షణమే.

అప్రత్యభిజ్ఞానించ విషయాంతర వ్యాసంగాత్ జ్ఞాపకశక్తిలేని బుద్ధి నశించినట్లైతే అవి మీరన్నారు. అది సరికాదు. ఇతరేతర విషయాలలో బుద్ధి నిమగ్నమై ఉన్నప్పుడు తెలిసినవస్తువును కూడా గుర్తించదు బుద్ధికి ఏకాగ్రత ఉంతడంవల్లనే ఇలా జరుగుతున్నది. అది చైతన్య లక్షణమే గాని భిన్నంకాదు.

అన్యత్యమనా అభూవం నాదర్శమ్- నా మనస్సు అన్యత్రాలగ్నమై ఉన్నది; కావున నేను చూడలేదు

అన్యత్రమనా అభూవం నా శ్రౌషమ్ - నా మనస్సు అన్యత్రలగ్నమై యున్నది; కావున నేను వినలేదు.

ఈ రకం వాక్యాలు వైదికాలే.

బుద్ధి తనకు సన్నిహితంగా ఉన్న అర్థాన్ని గ్రహించ నంతమాత్రాన అది అచేతనంకాదు.

ఉత్తరపక్షం: గత్యభావాత్ - బుద్ధికి గతిలేదు ఇంద్రియార్థాలు గోలకాలద్వారా బుద్ధిలోకి ప్రవేశించి అక్కడే విషయాకారతను పొందతాయని కదా సాంఖ్యులంటున్నారు. అదేనిజమయితే బుద్ధికి గతిలేనట్లే ఏదో ఒక క్రమం లేకుండా ఇంద్రియార్థాలన్నీ వాటి యిష్టం వచ్చినట్టు బుద్ధిలో విషయాకారతను పొందుతూ వుంటే ఉన్మాదవుతుంది. అలా జరగటంలేదు. ఏదో ఒక క్రమ వృత్తి కనిపిస్తున్నది. అందుకే యుగపత్ విషయ గ్రహణం కలగటం లేదు.

బుద్ధిలో ఇంద్రియార్థాలు వాటికవే విషయాకారతను పొందుతూ

ఉంటే దానికి చైతన్యంలేదనే అనుకోవాలి దానికి ఎలా తెలుస్తుంది? తెలుసుకోగలిగింది చేతనమేగాని అచేతనంకాదు. విషయాంతర వ్యాసక్తి కూడా బుద్ధికి ఉన్నదంటున్నారు. అదీ నిజమే ఆలోచనా తరంగాలలో నిమగ్నమైన బుద్ధి కట్టెదుట వస్తువును కూడా గుర్తు పట్టలేదు. అంతేకాదు. తానుగ్రహించిన వస్తువును అప్పటికప్పుడు మరచిపోతే గాని కొత్తవస్తువును స్వీకరించలేదు. ఆ విధంగా అది క్షణికం; అనిత్యం.

పూ ర్వ ప క్ష ం ; స్ఫటికాన్యత్వాభిమానవత్ త ద న్య త్వా భి మానః-స్ఫటికం వద్ద ఉంచిన పువ్వు ఒక్కటే అయినా, స్ఫటికంలో చూస్తే చాలా పువ్వులున్నట్లు కనిపిస్తుంది. అలాగే ఇంద్రియార్థాలను అనుసరించి బుద్ధికూడా నా నా రకాలుగానూ భాసిస్తున్నది. రసబుద్ధీ, రూపబుద్ధి, శబ్దబుద్ధి స్పర్శ బుద్ధి, గంధబుద్ధి ఇదే విధంగా ఏర్పడు తున్నాయి. అంతేకాని బుద్ధి ఒక్కటే. అది మారటంలేదు. దానికి అనిత్యత్వం లేదు.

క్షణికవాది: ఒకేబుద్ధి అనేక బుద్ధులుగా భాసిస్తున్నదని మీరు చెప్పుతున్నారు. అది హేతువుకాదు. వ్యక్తులన్నీ క్షణికాలే. స్ఫటికంలో కనపడే వ్యక్తులన్నీ స్ఫటిజవ్యక్తులేగాని నిజవ్యక్తులుకావు. అదిభ్రమ. భ్రమ క్షణికమేగాని స్థిరంకాదు.

పుట్టుక, నాశముగల వాటిని భావ పదార్థాలని అంటాము. క్షణ క్షణ పరిణామపర్కొలియగు శరీరంకూడా వ్యక్తియే.

పూవుయొక్క సన్నిధానంలో స్ఫటికం 'నానా' (బహు పుష్ప భావాలను) పొందినట్లు ఇంద్రియాల సన్నికర్షంలో బుద్ధికూడా 'నానా' పొందుతుందనటం సరియైన హేతువుకాదు అది ఉన్మత్తస్థితి. ఒకమనిషి

మన కళ్ళముందుంటే అదే మనిషి మన బుద్ధికి వందమంది మనుష్యుల్లా కనబడటం లేదు. అదే వ్యక్తిగానే కనబడుతున్నాడు.

ఉత్తరపక్షం: అవును. అందుకే ఏవస్తువెట్లు చూపబడిందో అట్లే గ్రహింపబడుతున్నది

స్ఫటికానికి పువ్వు ఉపాధి తన సామీప్యం మరియొక దాని యందు తన ధర్మాన్ని ఆరోపించగల పదార్థమే ఉపాధి. ఈరకం ఔపాధికం క్షణికమే అనటానికికూడా హేతువులేదు. ఉపాధి ఉన్నంతవరకూ స్ఫటికంలో ప్రతిబింబం ఉంటుంది. అది స్ఫటికమైనంతవరకూ ఆ ప్రతిబింబం నానాత్వాన్ని భాసిస్తుంది. ఇది వస్తు స్వభావం.

స్ఫటికం ప్రతిబింబాన్ని మాత్రమే బహుముఖాల ప్రదర్శిస్తుంది.

బుద్ధి అలాకాదు. అది సమీప వస్తువుయొక్క నానా గుణాలను క్రమానుగతంగా ప్రకటిస్తుంది. బుద్ధి సత్వంమది. కనుక ఆ రెండింటికీ పోలికేలేదు

సత్వమనగా పుట్టుకతో వచ్చిన గుణము. సత్త్వం వస్తువున్నంత కాలమూ ఉంటుంది. అది క్షణికంకాదు శరీరం క్షణికం. అనగా నిత్యపరిణామశీలి. అనుక్షణం దానిలో కొన్నికణాలు పుడుతూఉండటం, మరికొన్ని గిడుతూ ఉండటం జరుగుతుంది. బుద్ధి క్షణికంకాదు. సత్త్వక్షణికాలకు ఏవిధమైన సంబంధమూ లేదు 'నోత్పత్తివినాశకారణానుపలబ్ధేః' శరీరానికివలె బుద్ధికిఉత్పత్తి వినాశ కారణాలు లభించకపోవటంవల్ల.

వ్యాఖ్యాత: శరీరం క్షణికమనే అభిప్రాయం క్షణికవాదులది: వారితో అంతవరకూ వైదికులు అంగీకరిస్తారు చైతన్యంతప్ప తతిమ్మా పదార్థాలన్నీ క్షణికాలనీ అంగీకరిస్తారు. అయితే బౌద్ధుల క్షణికవాదానికీ, వైదికుల క్షణిక వాదానికీ చాలా తేడాఉంది. క్షణికవాదులయిన బౌద్ధులు

అనుక్షణం శరీరం మారుతున్నదిగనుక ఏప్పటికప్పుడు క్రొత్తగా పుట్టుతున్నదంటారు. కొంత పాతదిపోయి, కొంత క్రొత్తది చేరటంద్వారా శరీరం పరిణతి పొందుతున్నదని వైదికులంటారు. బౌద్ధుల క్షణికవాదం నిత్యనూతనవాదం. వైదికుల క్షణికవాదం నిత్య పరిణామశీలి.

పూర్వపక్షం: బుద్ధికి ఉత్పత్తి వినాశకారణాలు లభించటంలేదని కదా మీరన్నారు. పాలు నాశనమయి పెరుగవటానికి కారణాలు కూడా కనపడటంలేదు. తమకు కేవలం పెరుగే కనిపిస్తోంది. ఆలోచిస్తే కారణాలు తప్పకుండా కనిపిస్తాయి. కారణం లేకుండా ఏ వస్తువూ నశించదు కారణం లేకుండా ఏ వస్తువూ పుట్టదు. పాలకు నాశనకారణమే పెరుగుకు ఉత్పత్తి కారణమవుతున్నది.

ఉత్తరపక్షం: 'లింగతో గ్రహణాన్నానుపలబ్దే' - వస్తువుయొక్క స్వాభావిక ధర్మాన్ని లింగమని అంటాము లింగాన్ని గ్రహించినట్లైతే అంతములోనే దాని వినాశకారణాలనుకూడా చూడగలుగుతాము. ఉడికే స్వభావం బియ్యంలో ఉంది కనుకనే నీళ్ళుపోసి, క్రింద మంటపెడితే అన్నమయి పోతున్నది. పగిలే స్వభావం కొయ్యలకున్నందు వల్లనే గొడ్డలితో కొట్టేసరికి పగిలిపోతున్నాయి.

* కనుక వస్తువుయొక్క స్వభావధర్మాన్ని (లింగాన్ని) గ్రహించినట్లయితే దానిపరిణామానికి కారణం దొరక్క పోవడమంటూ జరగదు.

గుణపరిణామవాది: పాలు వేరు, పెరుగు వేరూకాదు. పాలు నశించి పెరుగు ఏర్పడడంలేదు. పాలతో ఆమ్లము సంయోగం చెందుట వల్ల పాలే పెరుగుగా పరిణామం చెందుతున్నవి. పాలు నశించటం

---

* తన డయలెక్టికల్ మెటీరియరిజమ్‌లో కారల్ మార్క్సు ఈలింగ కారణ సిద్ధాంతానికి ఎక్కువ ప్రాధాన్యతనిచ్చాడు.

జరిగితే పెరుగు ఎలా తయారవుతుంది? మట్టి లేకుండాపోతే కుండ తయారవుతుందా? ద్రవ్యం అలాగే ఉంటుంది కాని అవతారమో, గుణమో మారుతుంది కనుక పాలు నశించి పెరుగు ఏర్పడిందనటం తప్పు. పాల గుణం పెరుగు గుణంగా పరిణమించిందని చెప్పాలి.

ఉత్తరపక్షం: ఒకరకం ద్రవ్యముంది. అది పూర్తిగా మారిపోయింది. దాని తొల్లిటి లక్షణాలన్నీ కనబడకుండా పోయాయి కొత్తద్రవ్యమేర్పడింది. దీనిలక్షణాలు పూర్తిగా భిన్నమైనవి. కనుక మొదటిద్రవ్యం నాశనమైపోయిందన్న సందేహం కలుగుతోంది.

పాలు పూర్తిగా ఇగిరిపోయాక పెరుగు పుడుతుందని మేము చెప్పలేదు. ఉన్న ద్రవ్యంలోని అవయవ వ్యూహం స్థానంలో మరో అవయవ వ్యూహం ఏర్పడిందని అన్నాము పాల అవయవ వ్యూహం (Organic Configuration) వేరు; పెరుగు అవయవ వ్యూహంవేరు. అప్పుడు పాలు ఏమయ్యాయి? అవయవాలు నశించిపోతే అవయవి ఉంటుందా? వేళ్ళూ, మాను, కొమ్మలు, రెమ్మలూ, ఆకులూ - అన్నీ నశించిపోతే చెట్టు ఉంటుందా? అలాగే పాల అవయవ వ్యూహం నశించిపోయాక పాలెక్కడుంటాయి? పాలు లేకుండా పెరుగెలా ఏర్పడుతుంది?

తెలియనంత మాత్రాన అవి లేవనుకో కూడదు. ఆకాశంలో మెరుపు మెరుస్తోంది; చిటికెలో పోతోంది. ఏ కారణంవల్ల మెరుస్తోందో ఏ కారణం వల్ల పోతోందో మనకు తెలియదు. ఆ కాశంలో మెరుపుల లాగే ఆలోచనలు కూడా పుడుతున్నాయి; పోతున్నాయి ఎందుకు పుడుతున్నాయో, ఎందుకు పోతున్నాయో చెప్పలేం ఆలోచనలేకదా బుద్ధి. అదే జ్ఞానం.

ఇంద్రియార్థాలు అనగా - యింద్రియాల ద్వారా అందివ్వబడిన

సమాచారం- నశించినప్పటికీ, వాటి ప్రేరణవలన కలిగిన జ్ఞానం ( బుద్ధి ) నశించదు. ఎలాగ? కళ్ళతో చూసిన దృశ్యాన్ని- కళ్ళుమూసుకుని మనః ఫలకంపై చిత్రించుకోవటం లేదా?

అంతేకాదు. తర్క- వ్యాకరణాది విషయాలెన్నో ఉన్నాయి. అవేవీ ఇంద్రియార్థాలుకావు. వాటిని చర్మంతో స్పర్శించలేము, కంటితో చూడలేము. చెవులతో వినలేము, నోటితో తినలేము. అయినా వాటియం దాసక్తితో బుద్ధి విహరిస్తుంది. అందుకే బుద్ధిని కేవలం ఇంద్రియార్థాలకు సంబంధించిన విషయమనిగాని, లేదా ఇంద్రియాలపై ఆధారపడిన విషయమనిగాని భావించకూడదు.

మరొకటి: యుగపత్ జ్ఞేయాను పలబ్ధేశ్చ నమనసః'- అదే సమయంలో జ్ఞేయము దానికి లభించదు గనుక అది మనస్సుకాదు

జ్ఞానం బుద్ధిగుణమే గాని మనోగుణం కాదని వైదికులంటున్నారు. ఆత్మ, మనస్సు, బుద్ధి- అనుమూడూ వేర్వేరని వారి అభిప్రాయం మనస్సు ఆత్మజ్ఞానంతో విహరిస్తుంది. బుద్ధి మనస్సులో విహరిస్తుంది.

అయినా యింద్రియాలు అర్థాలతో సన్నికర్షం పొంది జ్ఞానాన్ని ఆర్జిస్తున్నప్పటికీ ఆ జ్ఞానం ఆత్మను మాత్రమే చేరుతుంది. ఆత్మలో విహరిస్తున్న మనస్సుకు పట్టదు. ఒకవేళ మనస్సు పట్టించుకున్నా బుద్ధి ఉపేక్షిస్తుంది.

పూర్వపక్షం: 'తదాత్మ గుణత్వేపితుల్యమ్'- ఇంద్రియార్థాలను ఆత్మ గ్రహించగానే దానితోబాటు మనస్సు, మనస్సుతోబాటు బుద్ధీ గ్రహించటమే జరిగితే బుద్ధి ఆత్మగుణమే అవుతుంది: అప్పుడా దోషం ఆత్మగుణంలోనె ఉన్నదని అనుకోవచ్చు. సమస్త ఇంద్రియార్థాలనూ బుద్ధి సరిగా గ్రహించనట్లే ఆత్మకూడా గ్రహించటం లేదని, కనుక ఆ

దోషం ఆ రెండింటికీ సమానమనీ భావించటం జరిగింది.

ఉత్తరపక్షం: ఇంద్రియైర్మనసః సన్నికర్షభావాత్ తదనుత్పత్తిః ఇంద్రియాలకూ మనస్సుకూ సూటిగా సన్నికర్షం ఏర్పడటం లేదు కను కనే ఇంద్రియార్థాలు సూటిగా మనస్సునిగాని, బుద్ధినిగాని చేరుకోవటం లేదు. అందుకే దారివెంట నడుస్తూకూడా మనిషి మరో విషయంగురించి ఆలోచించగలుగుతున్నాడు. చూస్తూ కూడా చూడనట్లు వెళ్ళిపోగలుగు తున్నాడు.

ఇంద్రియాలకు ఆత్మతోనూ, మనస్సుకు ఆత్మతోనూ సన్నికర్షం కలిగినప్పుడు జ్ఞానం కలుగుతుందని పెద్దలన్నారు అంతేగాని మనస్సు సూటిగా ఇంద్రియాలతో సన్నికర్షం పొందుతుందని చెప్పలేదు. ఇంద్రియాలు, ఆత్మ, మనస్సు- వీటి పరస్పర సన్నికర్షం వల్ల జ్ఞానోత్పత్తి కలుగుతుంది అంతమాత్రాన అదే జ్ఞానకారణమనుకోకూడదు

పూర్వపక్షం: బుద్ధికి వి నా శ కా ర ణ ం కనబడటంలేదు: ఉనికి స్పష్టంగా కనిపిస్తోంది. కనుక దానికి నిత్యత్వం ఉంది.

ఉత్తరపక్షం: శబ్దాన్ని శబ్దమే నాశనం చేస్తుంది. అలాగే బుద్ధికి బుద్ధే విరోధయి నాశనం చేస్తుంది. అందుకే బుద్ధి అనిత్యమని చెప్పాలి.

జ్ఞానమేకదా బుద్ధిః ఏదో ఒక విషయం మీ మనస్సులో ఉంది; అది ఉండగానే మరో విషయం మీ మస్సులోకి ప్రవేశించింది. రెండవ విషయం రాగానే మొదటి విషయం మీ మనస్సులో మరుగున పడిపో యింది ఏమయింది? మలిబుద్ధి వచ్చి తొలిబుద్ధిని హతమార్చింది.

గంట వినబడుతోంది. ముందు వినిపించిన గంటను ఆ వెంటనే వినిపించిన గంట అతిక్రమించి నశింపజేసింది, తర్వాత గంట దీనిని నశింపజేసింది.

పూర్వపక్షం: మనస్సుకు ఆత్మతో సంపర్కం కలిగిన తక్షణమే ఆత్మగతమయిన సమస్త స్మృతులూ ఒక్కుమ్మడిగా మనస్సులో ప్రవేశించాలిగదా! అలా ప్రవేశిస్తే పిచ్చెత్తిపోదా?

విభువాది: జ్ఞాన స్వరూపమగు ఆత్మయందు కోరి మనస్సు ఏ ప్రదేశమందు విహరిస్తుందో అందలి స్మృతుల్ని మాత్రమే సేకరించుకొంటుంది కనుక అన్ని విషయాలూ చిందరవందరగా మనస్సులో ప్రవేశించటానికి వీలులేదు.

ఉత్తరపక్షం: మనస్సు శరీరంలోనే ఉంటుంది. దానిని విడిచి అది బయటకు పోదు. పోయిన పక్షంలో ఉన్మత్తతే కలుగుతుంది. ఇంద్రియార్థ జ్ఞాన స్వరూపం గల ఆత్మ మనస్సుకు చేరువలోనే ఉంటుంది. కనుక అన్ని స్మృతులూ దానికి చేరువలోనే ఉంటాయి. మీరు చూపిన హేతువు సమజసంగా లేదు.

పూర్వపక్షం: మనస్సు శరీరంలోనే ఉంటుందని ఏమిటి! అది చాలా విషయాలను - సుదూరంగా ఉండే విషయాలను ఆలోచిస్తూ ఉంటుంది. అప్పుడది అంతదూరమూ పోదని ఏమిటి? పోతోందో, పోదో యింతవరకూ నిర్ధారణ కాలేదు.

ఉత్తరపక్షం: అదేంమాట: స్మరించేవాడికి శరీరం ఉంది; వాడి మనస్సు కూడా వాడి శరీరంలోనే ఉంది. అలాలేకపోతే వాడికి స్పృహ ఉండదు. అదీగాక వాడి మనస్సు ఆత్మజ్ఞానంతో సన్నికర్షం పొందుతున్నపుడు సంతోషము. కోపము, విచారము, దుఃఖమువంటి ఎన్నో అనుభూతులు కలుగుతూ ఉంటాయి. అందుకే మనస్సు శరీరంలోనే ఉంటుందని సిద్ధించింది. కనుక మనస్సు శరీరంలోనే ఉంటుంది. కాని బయటకు తిరగదనునది సిద్ధిమే ( Evident ) కాని సాధ్యం

( Derivation ) కాదు.

పూర్వపక్షం: మనస్సు చాలా జోరుగా పనిచేస్తుంది. కనుక ఇది బయటకి వెళ్ళినా మనకా సంగతి తెలీదు.

ఉత్తరపక్షం: అది తప్పు స్మరణం చేయడాన్నే స్మృతి అంటాం ఒక్కొక్క సారి ఒకే విషయాన్ని గురించి చాలాసేపు ఆలోచించ వలసి ఉంది కనుక స్మరణ కాలానికి నియమం లేదు ఎంత సేపయినా స్మరిస్తు కేవలం శీఘ్రగతినే కలిగి ఉన్నట్లయితే ఒక్క క్షణం కన్నా మించి ఏ ఒక్క విషయాన్ని స్మరించడానికి అవకాశం ఉండదు

మీరన్నట్లు మనస్సు బయటికి పోవాలంటే మూడు కారణాలుండాలి ఒకటి: ఆత్మప్రేరణ రెండు: ఆకస్మికత మూడు: జ్ఞానం ఇవి ఏవి నిజమైన కారణాలుకావు.

మనస్సు ఏదో ఒక విషయాన్ని స్మరించ దలచిదనుకోండి ఆవిషయం ఆత్మలో ఎక్కడుందో మనస్సుకు తెలియాలి గదా! ఆవిషయాన్ని వెతికి తెచ్చుకోవాలన్న మనస్సుకుండాలి ఆ రకం ఆత్మప్రేరణ మనస్సుకున్నట్లు ఎక్కడా కనిపించదు.

రెండవది: ఆకస్మిక ప్రవృత్తి. మనస్సు తనకు తెలియకుండానే ఆత్మగతస్మృతుల్లో ఎక్కడో ఒకదానిలో చిక్కుకుని పోవడం వల్ల అలా జరిగిందేమో అంటే అదీ కనబడదు.

మూడవది: మనస్సువేరు; బుద్ధివేరు. జ్ఞానం ఉన్నట్లు మనస్సుకు బుద్ధిలేదు, కనుక బుద్ధిపూర్వకముగా అది ఈ పని చేయలేదు.

పూర్వపక్షం : మీరు ఏదో ఆలోచిస్తు నడుస్తున్నారు. అప్పుడు మీ మనస్సు ఏదో దృశ్యంలో లగ్నమై ఉంది. ఆ సమయంలో మీరు కాలెత్తి

ముల్లు మీద వేశారు. అది కనుక్కొనడిగి మళ్ళీ మిమ్మల్నీలోకంలోకి తీసు కొచ్చింది. ఆ దృశ్యం సంగతి మర్చిపోయి, బాధతో విలవిల లాడేరు. మనస్సు మరోచోట ఉంటే బాధ ఎందుకొచ్చింది?

ఉత్తరపక్షం : శరీరానికి బయటనున్న విషయాలతో మనస్సుకు ఏ విధమైన సంసర్గం కలుగుతుందో అదే విథమైన సంసర్గం శరీర గతమైన విషయాలలో కూడా మనస్సుకు కలుగుతుంది. మనస్సుద్వారా సమస్త వేదనలు, యోచనలూ ఆత్మకు చేరతాయి. కనుక ఇందిర్రియార్థమయిన ముల్లు పెట్టేబాధ మనస్సుకు తాపాన్ని కలిగిస్తుంది. అంత వరకూ ఇంకొక దానిపై లగ్నమై యున్న మనస్సు ఇటు మళ్ళి ముల్లుగుచ్చుకున్న ప్రదేశాన్ని పరిశీలిస్తుంది.

**Man is athmakarma, an internal organ of perception and cognition, through which thoughts enter or by which objects of sence affect the soul.**

దృశాల్యు స్మృతులు క్షణక్షణం మారుతూ ఉంటాయి కనుకనే మనస్సు క్షణికమని చెప్పబడింది.

మనస్సు అణు పరిమాణం కలదని, ఆత్మతో ఆయా ప్రదేశాలందు సన్నికృష్టమయి క్రమ పద్ధతిలో జ్ఞానాన్ని పొందుతుందని బౌద్ధులంటూ న్నారు అది సరియైనది కాదు.

ఆత్మయే అణువని, అది మధ్యమ పరిమాణంగల మనస్సులో పరి భ్రమించి వివిధ విషయజ్ఞానాన్ని కలుగిస్తుందని వైదికులన్నారు. వైదికుల మతం ప్రకారం ఆత్మ మైక్రోఫిల్మ్ లాంటిది; మనస్సు వర్డ్ ప్రొ ఫెసర్ లాంటిది.

పూర్వపక్షం: ఆత్మయే అణువంత ఉంది, మధ్యను పరిమాణం లో ఉండే మనస్సులో సంచరిస్తున్నప్పుడు అనేక స్మృతులు ఒక్కసారే ఎందుకు కలగవు?

ఉత్తరపక్షం: ప్రణిధాన లింగాది జ్ఞానం ఒకే క్షణంలో కలగటం లేదు. కనుక ఒకే క్షణంలో అన్ని స్మృతులూ కలగటం లేదు.
స్మరించే కోరికతో చిత్తాన్ని ఏకాగ్రంచేయటాన్నే ప్రణిధానము అంటారు వస్తుగతమైన సహజ స్వభావమే లింగమ్.

ఆత్మతో మనస్సుకు సన్నికర్షం కలగటంవల్ల స్మృతులెలా పుడుతున్నాయో, అదేవిధంగా ప్రణీధానం ( మనస్సును ఏకాగ్రం ) చేసినప్పుడూ, లింగాన్ని (వస్తుగత సహజ స్వభావాన్ని) పరిశీలించినప్పుడూ స్మృతులు కలుగుతున్నాయి. ఒకదానివెనుక ఒకటిగా కలుగుతున్నాయి. అన్నీ ఒకేక్షణంలో కలగటం లేదు.

పూర్వపక్షం: ఇచ్ఛాది గుణాలన్నీ బుద్ధికి సంబంధించినట్లే కనిపిస్తున్నాయి. అవన్నీ మీరు చెప్పినట్లు ఆత్మగుణాలే అయితే బుద్ధికూడా ఆత్మగుణమే అవుతుందంటున్నాను.

ఉత్తరపక్షం: ఎవరికి వస్తుజ్ఞానం కలుగుతుందో వారికే ప్రవృత్తి నివృత్తులు కలుగుతూంటాయి. ఇంద్రియాలద్వారా ఆత్మ వస్తుజ్ఞానాన్ని సంపాదించికొంటుంది. కనుకనే ఆత్మకు ప్రవృత్తి నివృత్తులన్నూ కలుగుతున్నాయి. ప్రవృత్తి అనగా ఒక వస్తువుయందు ఇష్టం. నివృత్తి అనగా ఒక వస్తువుయందు ద్వేషం. దేనివల్ల సుఖం కలుగుతుందో దానిపై యిష్టమూ, దేనివల్ల దుఃఖం కలుగుతుందో దానియందు ద్వేషమూ, కలగటం ఆత్మ స్వభావం (లింగం).

జ్ఞానం ఆత్మగుణమే అని నేను మొదటినుంచే చెపుతున్నాను.

బుద్ధి జ్ఞానసాధనమే గాని జ్ఞానంకాదు.

పూర్వపక్షం : ఇచ్ఛ ప్రవృత్తి స్వభావం కలది; ద్వేషం నివృత్తి స్వభావం కలది. ప్రవృత్తి ( Indulgence ) ని బట్టి ఇచ్ఛనీ, నివృత్తిని ( Repulsion ) బట్టి ద్వేషాన్నీ గుర్తిస్తాము. పొగ నిప్పుకు లింగమని పెద్దలన్నారు. నిప్పు ఉంటే పొగ ఉంటుంది. కనుక పొగను బట్టి నిప్పు ఉనికిని గుర్తిస్తాము ప్రవృత్తి నివృతులు ఇచ్ఛాద్వేషాలకు లింగాలు. ఈ ఇచ్ఛా ద్వేషాలు ప్రతి మనిషి ముఖంలోనూ కొట్టవచ్చి నట్లు కనిపిస్తాయి. వాటి వికారం శారీరకమే కదా; శరీరం పార్థివమే కనుక ఇచ్ఛా ద్వేషాలు కూడా పార్థివాలే అంటున్నాను. అవి శరీర గుణాలేగాని ఆత్మ గుణాలుగావు. అదేవిధంగా జ్ఞానంకూడా శరీరకమే అవుతుంది. ఇవేవీ మానసికం కాదు. కాలికి ముల్లు గుచ్చుకున్నప్పుడు ఒకడి ఆత్మ క్షోభించిందో లేదో తెలియదుగాని, అతని శరీరంపడే ఆవే ధనని చూస్తే తెలుస్తుంది. ఆ బాధ శరీరానిదేకదా;

ఉత్తరపక్షం: శవం శరీరమే కదా; దానిని ముళ్ళకంపపై పడ వేసినా బాధపడదు ముళ్ళు దానికి గుచ్చుకోవా; తాను బాధపడుతూ, తన బాధను శరీరంద్వారా వ్యక్తం చేసేదేదో ఆశవంలోలేదు,

గొడ్డలి ఉంది. అది వెళ్ళి చెట్టు మ్రానును నరుకుతున్నది. ఆ మ్రానుపై పడటాన్ని ప్రవృత్తిగానూ, దానినుంచి, వెనక్కి వెళ్ళటాన్ని (తిరిగి పడటం కోసమయినా) నివృత్తిగానూ భావించండి. అప్పుడు గొడ్డలిలో మీకు ఇచ్ఛా ద్వేషాలు కనిపిస్తాయి. నిజంగా గొడ్డలికి ఇచ్ఛా ద్వేషాలున్నాయా? దాన్ని విసిరేవాడిలో ఉన్నాయా? శరీరంలో ఇచ్ఛా ద్వేషాలు మీకు కనిపిస్తున్నట్లే గొడ్డలిలోకూడా కనిపిస్తాయి.

ఇచ్ఛా ద్వేషాలు గొడ్డలికి లేనట్లే శరీరానికి కూడాలేవు. ఆత్మకే ఉన్నాయి.

కొన్ని కొన్ని నియమాలు, అనియమాలు ప్రవృత్తి నివృత్తులకు కారణమవుతున్నాయి. అవి శరీరంలో ఉన్నాయి. గొడ్డలిలో లేవు. అదే గొడ్డలికి శరీరానికీ గలతేడా.

పూర్వపక్షం: ఇచ్ఛ మొదలైనవి మనోగుణాలని ఎందుకనుకో కూడదు?

ఉత్తరపక్షం: ఆత్మ ప్రవృత్తిని ఇచ్ఛగాను, ఆత్మ నివృత్తిని ద్వేషంగానూ మనం చెప్పుకొంటున్నాము. ఈ ప్రవృత్తి నివృత్తులు జ్ఞానం వల్లనే కలుగుతున్నాయి. ఆత్మకు జ్ఞానంఉంది. ఆ జ్ఞానం ఇంద్రియాల ద్వారా సంక్రమించింది. మనస్సుకు స్వతహాగా జ్ఞానం లేదు ఇచ్ఛా ద్వేషాలకు మనస్సు సాధనమేగాని స్వతంత్రం కాదు మనస్సు పూర్తిగా పరతంత్రమైనది అందుకే మనస్సును 'కరణమ్' (సాధనం) అన్నారు. చెట్టును నరికేందుకి గొడ్డలి కరణమే కదా! దానితో అతను నరకనూ వచ్చు; ఊరక పారెయ్యనూ వచ్చు. చెట్టును నరకటం పరతంత్రమే.

సుఖ దుఃఖానుభవమే భోగం. అనుభవం ఆత్మకి సంబంధించినదే గాని మనసుకీ, శరీరానికీ సంబంధించినది కాదు మనస్సును అన్యాయత్తంచేసుకుంటే సుఖం రుచించదు దుఃఖం స్పందించదు. ఆత్మరహితమయిన శరీరానికి సుఖదుఃఖానుభవంలేదు. శవానికి సుగంధమూ, దుర్గంధమూ లేవు.

మనస్సు స్వతంత్రంకాదు. అది ఏపనీ చేయదు ఏపనీ చేయనిదానికి భోగం మాత్రం ఎలా కలుగుతుంది? కలుగుతుందంటే 'అకృతాభ్యాగమ' దోషం కలుగుతుంది. ( అకృతస్య = చేయని కర్మకు అభ్యాగమః= వచ్చింది ) రతి జరగకుండా గర్భం వస్తుందా?

కనుక ఇచ్ఛాదులు మనోగుణాలు కావు. ఆత్మగుణాలు - ఈసంగతి ఇప్పుడు చెప్పటమే కాదు; మొదనుంచీ చెపుతూనే ఉన్నాము.

పూర్వపక్షం: స్మృతి దేని గుణం? మనోగుణం కాదా?

ఉత్తరపక్షం: స్మృతి జ్ఞాన సంబంధమైనది. కనుక అది ఆత్మ గుణమే గాని మనోగుణం కాదు.

పూర్వపక్షం ; ప్రణిధానాదులని మీరన్నారు. అవేతో చెప్పండి వాటి సంగతి చూద్దాం.

ఉత్తరపక్షం: ప్రణిధానం వంటి నిమిత్తాలు చాలా ఉన్నాయి. వాటివల్ల ఎన్నెన్నో స్మృతులు కలుగుతాయి. ఆ కలిగే స్మృతులుకూడా ఒకదానినుంచి ఒకటి కలుగుతాయి. అంతేగాని అన్నీ ఏకకాలమందు కల గవు ఈ నిమిత్తాలను కొన్నిటిని మాత్రమే యిక్కడ పేర్కొంటు న్నాను ఇంకాచాలా ఉన్నాయి

ప్రణిధానం: చిత్తాన్ని ఏకాగ్రం చేసుకోవటం.

నిబంధం: ఇంద్రియార్థాలను పొందుపరచటం.

అభ్యాసం: ఒక విషయానికి సంబంధించిన జ్ఞానాన్ని పునశ్చరణ చేయటం.

లింగం: వస్తు స్వభావాన్ని తరచి చూడటం.

లక్షణం: పదార్థ భౌతిక ధర్మాలను, రసాయనిక ధర్మాలను గ్రహించటం.

సాదృశ్యమ్: ఒక పదార్థంతో పోలికగల వివిధ పదార్థాలను పేర్కొనటం.

పరిగ్రహం: వాటివాటి లక్షణాలను గ్రహించటం.

ఆశ్రివం: బాహ్య వస్తువుల పైకి ఆత్మను మళ్ళించటానికి ఇంద్రియాలు చేసే ప్రయత్నం.

ఆశ్రితం: మనస్సుచే గ్రహింపబడిన విషయం.

సంబంధం: లీనావస్థ.

అనంతర్యం: ఫలితం,

వియోగం; విరహం.

ఏకకార్యం: ఒకే పని.

విరోధం: తిరస్కారం,

అతిశయం: వ్యాప్తి.

ప్రాప్తి: లాభం.

వ్యవధానం: మధ్యలో మరో విషయం అడ్డురావటం.

సుఖం: అనుకూల వేదన.

ఇచ్ఛ: కోరిక,

ద్వేషం: వ్యతిరేకత.

భయం—భీతి

అర్థిత్వమ్—యోచన

క్రియ—కార్యం

రాగం—స్నేహం

ధర్మం—శ్రేయోదాయకమైన పని

అధర్మం—చేయకూడని పని

ఇవన్నీ ఆత్మ ప్రేరకాలు.

పూర్వపక్షం: బుద్ధి స్థిరమా, చంచలమా?

ఉత్తరపక్షం: కర్మలు అనిత్యమయినవి. వాటిని గ్రహించే స్వభావం గలది కావున బుద్ధి కూడా అనిత్యమే. బుద్ధి స్థిరంకాదు. అందు క్షణికత్వం ఉంది.

పూర్వపక్షం: మెఱుపు క్షణమే మెరుస్తుంది. అది క్షణకాలమే ఉన్నందున ఆ సమయంలో సమస్త వస్తువులూ స్పష్టంగా వెల్లడికావు. మీరు బుద్ధి కూడా మెరుపులాగే క్షణికమంటున్నారు అదే నిజమైతే మనకు వస్తువులు సరిగా కనిపించకూడదు. అవి ఎంతసేపు చూసినా మన బుద్ధికి కనిపిస్తూనే ఉంటాయేమి?

ఉత్తరపక్షం: మీరు బుద్ధిని మెరుపుతో పోల్చారు. క్షణికమైన మెరుపు లాంటిదే బుద్ధి అన్నారు. క్షణికమయినదిగా బుద్ధిని మీరంగీకరించినట్లయింది. ఇకవాదించే హక్కు మీకులేదు. అయినా చెపుతాను వినండి.

దీపపుకాంతి ఉన్నది. ఆ కాంతిని దీపం అనువిత్యము ప్రసరిస్తున్నది. అది అనవస్థాయి. అనగా దీపపుకాంతి అనుక్షణమూ నశిస్తూనే ఉన్నది అయినా దాని కాంతికి నిత్య ప్రసారకగుణం ఉన్నందు వల్ల వస్తువులు స్పష్టంగా కనిపిస్తాయి. బుద్ధికూడా దీపపు కాంతిలాగే అనునిత్య నాశకగుణం కలిగి ఉన్నప్పటికీ నిత్యమూ ప్రసరించటంవల్ల వస్తువుల్ని స్పష్టంగా గ్రహించగలుగుతోంది. కాంతికీ బుద్ధికీ ఒకే విధంగా సంతాన పరంపర కలుగుతున్నందున అవి నిత్యమను భ్రమను కలిగిస్తున్నాయి.

పూర్వపక్షం: వస్తువును చూసి బుద్ధి స్పందిస్తుంది. ఆ సయంమలో బుద్ధిలో కలిగే ఆకార వికారాలన్నీ బుద్ధివా? వస్తువులవా?- అని ఆలోచించాలి.

నీళ్ళు స్వచ్ఛంగా తెల్లగా ఉంటాయి. వెచ్చగానూ ఉంటాయి. వెచ్చ

దనం తేజో లక్షణమే. అయితే నీటిలో ఎందుకుంది? అది నీటిదా, తేజస్సుదా?

ఈ రకం సందేహమే బుద్ధి విషయంలోనూ కలుగుతోంది.

ఉత్తరపక్షం: ద్రవ్య గుణాలు ద్రవ్యమున్నంత కాలమూ ఉంటాయి. నీటికి తెల్లదనం నీరున్నంతకాలమూ ఉంటుంది వెచ్చదనం అలాకాదు. తేజస్సుతో నీటికి సంయోగం ఉన్నంత కాలమే ఉంటుంది. అలాగే బుద్ధిని శరీరంగుణంగా మనం భావించేటట్లయితే అది శరీర మున్నంత కాలమయినా ఉండాలి. ఒక్కక్షణం ఉండాలి. మరోక్షణం ఉండటం లేదు. కాబట్టి అది శరీర గుణం కాదు.

పూర్వపక్షం: ఆకుపచ్చని మామిడికాయలను తెచ్చి, వట్టిగడ్డిలో కొన్ని రోజులుంచాము. ఆగడ్డిలో పుట్టిన ఉష్ణం ఆ పచ్చి మామిడి కాయల్ని పసుపు పచ్చని మామిడి పళ్ళులా మార్చివేసింది అనగా మామిడి కాయల రూపం మారిపోయింది. మీరేమో రూపాది గుణాలు వస్తువుయొక్క ద్రవ్యమున్నంత కాలమూ ఉంటాయని చెప్పారు. అది తప్పేగదా! అలా ఉండేటట్లయితే మామిడి కాయ మామిడి పండు కాకూడదు.

అందుకే పాకజ గుణాంతరోత్పత్తి గురించి చెపుతున్నాను. విలక్షణ తేజః సంయోగాన్నే పాకమంటారు పాకంవల్ల ఆకుపచ్చని కూరలన్నీ ఎర్రగా మారిపోతున్నాయి. ద్రవ్యం మారటం లేదు. దాని గుణాలు మాత్రమే మారిపోతున్నాయి. వేరే గుణాలు పుడుతున్నాయి. దీనినే మేము గుణాంతరోత్పత్తి అంటాము. బుద్ధికి స్థిరత్వం ఉందాలేదా అన్నది ప్రమాణంకాదు, ఉన్నా లేకున్నా అది శరీరగుణమే అవుతుంది: ఆత్మ గుణంకాదు:

ఉత్తరపక్షం : వండటం, వేయించటం, మరగపెట్టటం అను క్రియలు మూడు పాకములని చెప్పబడుతున్నాయి పాకం చేయటంవల్ల కలిగిన క్రొత్త గుణాలను పాకజములని అంటాము.

ఈ పాక గుణాదులు పూర్వమున్నగుణాలకు బదులుగా ఉత్పన్న మవుతాయి. రూపానికి రూపం, రసానికి రసం, గంధానికి గంధం ఉత్పన్న మవుతాయి. ఈ గుణాంతరాలు ఆవస్తువుకు సహజంగా ఉన్న గుణాల నుంచే పుట్టాయి. కనుక ఆ ద్రవ్యం ఉన్నంత కాలమూ ఉంటాయి. వాటికి పూర్వ ద్రవ్యంతో సంబంధం లేదనుకోవటం తప్పు పచ్చిగా ఉన్నా మిగలముగ్గిన మామిడికాయ మామిడికాయలాగే ఉంటుందిగాని జామి కాయలా ఉండదు. ద్రవ్యం ఉన్నంత వరకూ రూపాదులుండుగాని అవి పూర్తిగా నశించవు

బుద్ధి అలాకాదు క్షణకాలంలో అది నశిస్తుంది బుద్ధి లేని వాళ్ళు చాలామంది ఉన్నారు కనుక బుద్ధి శరీరగుణం కాదు ఆదీ కాక మీరు గుణ మనే మాటను వాడుతున్నారు. గుణం మొత్తం శరీరానికి అంటటికి ఉం డేదే గాని, ఎక్కడో ఒక్క అంగానికి మాత్రమే పరిమితమయి ఉండేది కాదు. బుద్ధి గుణమేకాదు. అది సమస్త శరీరానికి వ్యాపించి లేదు కనుక!

పూర్వపక్షం: రూపాదులు శరీరగుణాలని మీరంటున్నారు. అవి శరీరమంతా వ్యాపించి ఉండాలి గదా! శరీరంలో ఉండె రూపం, రసం, గంధం-దానిపై ఉండె వెంట్రుకల్లోనూ గోళ్ళలోనూ కనబడవేమి? కనుక రూపాదులు శరీరమంతా వ్యాపించి ఉంటాయనటం సమంజసం కాదు

ఉత్తరపక్షం: ఇంద్రియాల సమ్మేళనానికే శరీరమని పేరు.

ఇంద్రియాలు ఇంద్రియార్థాలను సేకరించే సాధనాలు వెంట్రుకలు,గోళ్ళు జ్ఞాన సంబంధమయిన పనులేవీ చేయవు. అందుకే వాటిని కత్తిరించినా మీకు నెప్పి పెట్టదు శరీరంలో ఏ యితర భాగాన్ని కోసినా శరీరమంతా బాధతో విలవిలలాడుతుంది.

కనుక శరీరం కాని వెంట్రుకల్నీ, గోళ్ళనీ తీసుకొచ్చి మీరు వాటికి రూప రస గంధాదుల్ని ఆరోపించటం చాలా అన్యాయం. శరీరం కానిచోట లేని రూప రస గంధాదుల్ని ఎత్తిచూప. శరీర వ్యాపకాలు కావని చెప్పటం భావ్యంగా లేదు.

మీరు చెప్పిన గోళ్ళూ, వెంట్రుకలూ శరీర ధర్మానికి విరుద్ధధర్మాలను కలిగి ఉన్నందున శరీరం కావని చెప్పాను. బుద్ధికికూడా యిలాంటి విరుద్ధ ధర్మమే ఉన్నందున అదికూడా శరీరంకాదు.

పూర్వపక్షం: విరుద్ధ ధర్మం ఉన్నంత మాత్రాన బుద్ధిని శరీర ధర్మంగా అంగీకరించననటం సబబుకాదు కన్ను రూపాన్నిచూస్తున్నది; చెవి శబ్దాన్ని వింటున్నది; ముక్కు వాసన చూస్తున్నది. చర్మం స్పర్శిస్తున్నది. కన్నుచేసే పని చెవికీ, ముక్కుకీ, చర్మానికీ విరుద్ధమే కదా! ఇలా ఒకదానికొకటి విరుద్ధ ధర్మాలను కలిగి ఉన్నప్పటికీ అవి శరీర గుణాలుకాకుండా పోయాయా? బుద్ధికూడా మెదడువంటి వేరే ఇంద్రియం చేత గ్రహింపబడేదయినంత మాత్రాన శరీరగుణం కాకపోతుందా?

ఉత్తరపక్షం: రూపాదులు ఒక్కొక్కటి ఒక్కొక్క ఇంద్రియం చేతనే గ్రహింపబడుతున్న మాట నిజమే. అయితే అవన్నీ బాహ్యేంద్రియాల చేత గ్రహింపబడుతూనే వున్నవి అందులో వాటికి సామ్యం ఉంది. బుద్ధి బాహ్యేంద్రియాలలో దేనిచేతనూ గ్రహింపబడటం లేదు. కనుక అది రూప, రస, గంధ, స్పర్శ, శ్రవణాలను అయిదుగుణాలకూ

విరుద్ధంగా ఉన్నది. కనుకనే అది శరీరగుణం కాదు; ఆత్మగుణమని అన్నాము.

మనః పరీక్ష: 'జ్ఞానయౌగపద్మాదేకం మనః.' ఇంద్రియాలు సేకరించిన విషయాలలో సన్నికర్షం ఉన్నప్పటికీ అన్నిటినీ ఏకకాలమందు గ్రహించని స్వభావం మనస్సుకు మాత్రమే ఉన్నది. ఒక్కొక్క ఇంద్రియాన్నీ విడివిడిగా మనస్సు పరామర్శించటాన్ని బట్టి ఒక్క మనస్సే ఉన్నదని రూఢి అవుతున్నది. ఇంద్రియానికో మనస్సంటూలేదు

పూర్వపక్షం: ఒక్క క్షణంలో అనేక క్రియలు జరుగుతున్నాయా, లేదా? ఒకడు మామిడి పండు జుర్రుకుంటున్నాడు, ఆ పండుకేసి చూడటం లేదా? దాని వాసన పీల్చటం లేదా? రుచిని గ్రహించటం లేదా? దాన్ని స్పర్శించటం లేదా? అవన్నీ జరుగుతూనే ఉన్నాయి. మనస్సు ఒక్కొక్కసారి ఒకఇంద్రియాన్ని ఆశ్రయిస్తుందని మీరననే అన్నారు. ఇన్నిపనులు ఏకకాలమందు జరగటాన్ని బట్టి ఎన్ని ఇంద్రియాలున్నాయో అన్ని మనస్సులూ ఉన్నాయని అనిపిస్తున్నది. దీనినిబట్టి ప్రతీ శరీరంలోనూ చాలా మనస్సులున్నాయని అంగీకరించక తప్పదు.

ఉత్తరపక్షం: దీపావళినాడు ఉప్పుపొట్లాన్ని గిరగిరా త్రిప్పుతూంటే అది చక్రంలా కనిపిస్తుంది నిజంగా అది చక్రం కాదుగదా!

అలాగే మనస్సు ఒక యింద్రియం నుంచి ఒక యింద్రియానికి అతివేగంగా పరిగెడుతూ వివిధ ఇంద్రియాలందించే అర్థాలను అతి వేగంగా గ్రహిస్తూంటుంది. ఈ అతివేగ మనస్సంబంధమే ఏక కాలంలో సర్వేంద్రియ జ్ఞానాలనూ మనస్సు ఏకకాలమందు పొందినట్లుగా భ్రమింప జేస్తున్నది. అంతమాత్రాన మనస్సులు చాలా ఉన్నాయనుకో కూడదు. ఉన్నదొక్కటే.

మనఃపరిమాణము? 'యథోక్త హేతుత్వాచ్చాణు'- ఈ మనస్సు అణు పరిమాణం గలదని ఇదివరకే చెప్పబడింది. ఇక్కడ అణువనగా పరమాణువ * ని అర్థం. కనుక అది అతీంద్రియమే.

జ్ఞానం ఆత్మాశ్రితమని మనకు తెలియును మనస్సు జడంకాదు. ఆత్మవిశిష్టమగు మనస్సే జ్ఞానాన్ని గ్రహిస్తున్నది విశిష్ట ( Chief) మందలి ధర్మాలనే విశేషణం ( Subordinate ) స్వీకరిస్తుంది.

అణుస్వభావానికి అణుత్వమని పేరు: పంచభూతాల యొక్క అణు మాత్రి స్వభావంగల శరీరాన్ని అణు మాత్రిక అని అంటారు. అణుధూళిని అణు రేణువులని గాని, అణు రేణుజాలమనిగాని అన్నారు. అణుశాస్త్రమును చెప్పేవానిని 'అణువాది' అన్నారు అణు వేదాంత' మను ప్రాచీన తాళపత్ర గ్రంధం ఒకటి సంస్కృతంలో జర్మనీలో ఉంది. (మోనియర్ మోనియర్ విలియమ్స్ 1899)

ఎలక్ట్రానులు ఈరోజున వినియోగంలోకి వచ్చాయి. కంప్యూటర్లు ఎలక్ట్రానుల (త్రిసలు) సహాయంతో మేధాజగత్తుకు అందని పనులన్నీ చేస్తు న్నాయి కనుక మనస్సు పరమాణువే అనీ, అది త్రిసాత్మకమనీ గౌత ముడు చేసిన సిద్ధాంతాన్ని అంగీకరించక తప్పదు.

వాత్స్యాయనుడు 'మనస్సుకు పరమాణు పరిమాణము' కలిగినందు వల్ల అది అతీంద్రియము ( Non-Organic ) అవుతుందనీ, కనుక మనో వ్యాపారం కూడా అతీంద్రియమవుతుందని సందేహించాడు మనస్సు

---

* పరమాణువు త్రిసాత్మకమని ( Electronic) చెప్పబడింది. పర మాణు గర్భంలో త్రిసలు (ఎలక్ట్రాన్స్) అనునిమిత్య సంచారులుగా పరి భ్రమిస్తూ ఉంటాయనికూడా గౌతమ మహర్షి వేరొకచోట పేర్కొన్నాడు.

శారీరకం కాదని గౌతముడు మొదటినుంచీ చెపుతూనే ఉన్నాడు. కనుక అతీంద్రియం అనటానికి ఆక్షేపణ లేదు.

మనస్సు జన్మము : 'పూర్వకృత ఫలానుబంధా తదుత్పత్తిః- భార్యా భర్తల సంయోగమే ఫలమే శిశూత్పత్తి దాని శరీరం అణుమాత్రిక అనగా పంచభూతములయొక్క అణువులతో కూడి ఉన్నది. వాటి ప్రభావం వల్లనే ఆ శిశువుయొక్క శరీరమూ, మనస్సూ ఏర్పడుతున్నాయి. ఇదంతా పూర్వకృత ఫలమే. దానికి శిశువు కర్త కాదు. తలిదండ్రులూ కర్తలు కారు. కనుకనే మనస్సే ప్రాకృతమని చెప్పబడింది.

ప్రకృతి ( Nature ) పంచభూతాలతో కూడి ఉన్నదనుట నిర్వివాదాంశం. భూతములన్నీ అణ్వంతాలే, వాటి పరమాణువుల్లో త్రసలు పరిభ్రమిస్తున్నాయి. కనుక చైతన్యవంతాలే.

ఆ చైతన్యం తమస్సునాశ్రయించి జడాత్మకంగానూ, రజస్సునాశ్రయించి రోదనాత్మకంగానూ, సత్త్వాన్ని ఆశ్రయించి ప్రస్ఫుటముగానూ కనిపిస్తున్నది ఈ ప్రకృతి స్త్రీ వంటిది. అదే మానసిక జగత్తు.

'భూతేభ్యో మూర్త్యుపాన వత్తదుపాదానామ్'- భూతముల (నీరు, మట్టి, గాలి, నిప్పు, ఆకాశం (ఈథర్) నుండి శరీరం అణుమాత్రికగా ఏర్పడినట్లే సూక్ష్మ భూతములనుండి (ఎలక్ట్రాన్స్) మనస్సు కలుగుతోంది.

పూర్వపక్షం: మీరు చెప్పింది సాధ్యమే. సాధ్యములు ఉన్నవి కావు; తర్కంద్వారా ఉన్నట్లు నిర్ణయింపబడినవి. నిజంగా ఉండనూ వచ్చు. ఉండక పోనూవచ్చు,

మాకు ప్రత్యక్షంగా తెలిసినంత వరకూ తలితండ్రుల శోణిత శుక్లాల మిశ్రమం నుంచి పిండోత్పత్తి జరుగుతోంది. అది విడిచి, కన

పడని సహాయక భూతాల పరమాణువుల నుండి శరీరమూ, ఆ పరమాణువుల సూక్ష్మ భూతాల (ఎలక్ట్రాను) నుండి మనస్సు పుడుతున్నాయని మీరు చెప్పటం ఏదోలా ఉంది.

ఉత్తరపక్షం: తల్లి దండ్రులకు సంబంధించి శుక్ల శోణితాలు కనపడని సహకారం యిచ్చి శిశూత్పత్తికి నిమిత్తాలవు తున్నాయని మీరంటున్నారు. అణు మాత్రలతో శరీరం నిర్మింపబడిందని నేనంటే అది కనపడని సహకృతమన్న మీరే కనబడని శుక్లశోణితాల గురించి ప్రస్తావిస్తున్నారేమి?

శుక్ల శోణితాలొక్కటే శిశు శరీర నిర్మాణానికి కారణం కావు. తల్లి తినే ఆహారం కూడా శిశువు శరీరాన్ని పెంచుతుంది. దాని మాట ఏమి చెపుతారు? తల్లి అన్నంతినకపోతే, లేదా చచ్చిపోతే ఆమె శరీరంలోని శవంలోని శిశువు పెరుగుతుందా? ఈరకం చిల్లర కారణాలు చాలా ఉన్నాయి. వాటిని ప్రస్తావించటం అనవసరం.

శుక్ల శోణితాలు కలియటం వల్లనే శిశూత్పత్తి జరిగేస్తోందని మీరంటున్నారు. 'ప్రాప్తావానియమాత్'- రాత్రి, పగలూ అదేపనిగా కొందరు దంపతులు తమ శుక్ల శోణితాలను ఏకం చేసుకుంటున్నా వారికి శిశూత్పత్తి కలగదేమి? అలా చేయగాచేయగా ఎప్పుడో ఒకసారి అదృష్ట సహకారం వల్లనే గర్భం రావటం జరుగుతుంది.

'శరీరోత్పత్తి నిమిత్తవత్ సంయోగోత్పత్తి నిమిత్తం కర్మ' - శరీరోత్పత్తికి సంయోగం అవసర మయినట్లు, సంయోగానికి 'కర్మ' (రతి) అవసరమవుతున్నది.

'ఏతాన అనియమః ప్రత్యుక్తః'- రతి ఎన్నిసార్లు చేసినా అదృష్టం సహకరిస్తేగాని గర్భోత్పత్తి కాదని తెగేసి చెపుతున్నాము.

అదృష్టమే (కనబడనిదే) భూతాలకు, మనస్సుకు స్వాభావిక ధర్మం. అదృష్ట నిమిత్తంగానే శరీరం ఏర్పడుతోంది. శరీరంలో మన స్సంయోగం కూడ అదృష్టవశాత్తూ ఏర్పడుతున్నది కనుకనే అందరి మనస్సూలూ ఒకే స్థాయిలో లేవు.

పంచభూతముల యొక్క మాత్రిలు (పరమాణువులు) పరస్పరా కర్షణచే సంయోగం పొంది జన్మ హేతువులవుతున్నాయని మనం చెప్పు కున్నాం కనుక ఆ పంచభూతముల యొక్క మాత్రిలే పరస్పర వికర్షణ చేత మరణానంతరం అపవర్గాన్ని (Beatitude) పొందుతున్నాయని చెప్పినట్లయింది. అందుకే తదదృష్టకారిత మితిచేత్ పునస్తత్ప సంగోపవర్గే- అని చెపుతున్నాము

మనస్సు కర్మ నిమిత్తకము. కనుకనే అది శరీరాన్ని ఆశ్రయించు కుని ఉంటుంది అందుకే మనస్సూ, శరీరమూ పరస్పర సంయోగం పొందుతూ వుంటాయి.

మనస్సు శరీరంలో ఉన్నంతకాలమూ మరణం సిద్ధించదు. దానికి నిత్యత్వం ఉన్నది.

పూర్వపక్షం: ఆకుల కణాలలో ఆకుపచ్చతనం నిత్యమైనట్లే శరీరంలో మనస్సూ నిత్యమై ఉంటుంది. ఎటొచ్చీ ఆకురాలు కాలానికి మాత్రిం ఈ ఆకుపచ్చదనం సడలిపోతుంది.

ఉత్తరపక్షం: శ్యామతాది గుణాలు విర్నమిత్తంగా నశించవు ఎండితేగాని, నీళ్ళలో వేసి మరగబెడితేగాని ఆకుల పచ్చదనం పోదు. అలాగే మనస్సుకు గల శరీర సంయోగం పోవటానికి మృత్యువే కారణ మయి ఉంటుంది.

# ఏడవ ఆహ్నికం

## ప్రవృత్తి

ప్రవృత్తి గురించి ఇదివరకే చెప్పుకున్నాం మనస్సు, మాటలు శరీరం చురుకుగా పనిచేయుటమే ప్రవృత్తి ( Activity ) అని చెప్ప బడింది.

అలాగే దోషాలగురించి కూడా చెప్పుకున్నాం, మంచికో, చెడ్డకో మనిషిని పురికొల్పే వాటివి దోష ( Bias ) ములని అన్నారు. ఇవిమూడు రకాలు, 1. రాగం 2. ద్వేషం 3. మోహం,

రాగం ( Passion ) చాలా రకాలుగా ఉంది. అది రతిని అభిల షిస్తే కామం అవుతుంది. తనకు దానివల్ల లాభమా, నష్టమా అని చూసు కోకుండా యితరుల పనిని చెడగొట్టే గుణం మాత్సర్యం. ఇతరుల సొమ్మును అపహరించాలన్న తపన స్పృహ, ఎడతెగని ధనదాహం తృష్ణ. వంచనచే ధనాపహరణం లోభం. విశేష లాభ సంపాదనాదృష్టి మాయ లేని గొప్పతనం ఉన్నట్లుగా నటించటం దంభం

ఇక ద్వేషం ( Repugnance ) గురించి. శరీరమూ, శరీరాం గాలు వికారం చెందేలా తాపాన్ని ప్రదర్శించటం క్రోధం సమిష్టి వస్తు వులో రెండవవాని హక్కును కాలదన్నుటకు చేసే ప్రయత్నమే ఈర్ష్య. ఇతరుల సుగుణాలను చూసి సహించలేకపోవటమే అసూయ నమ్మించి మోసం చేయటం ద్రోహం. అపకారానికి ప్రతీకారం తీర్చుకోవటం అమర్షం. తన నిస్సహాయతకు తనలోతానే కుమిలిపోవటం అభిమానం ఇవన్నీ ద్వేషంలోని భాగాలే.

ఇక మోహం ( Infatuation ) గురించి. ఒకదాని చూచి ఒకటి అనుకోవటం భ్రాంతి. ఒక వస్తువునందు లేని గుణాలు ఉన్నవేమోనన్న శంక సంశయం. తనలోలేని గుణాలు ఉన్నట్లుగా భావించి విర్రవీగటం మానం కర్తవ్యాన్ని ఉపేక్షించటం ప్రమాదం-ఇవన్నీ మోహ లక్షణాలు

ఈ విధంగా రాగ, ద్వేష, మోహాలనబడే మూడురకాల దోషాలు పదిహేడు అంతర్గుణాలను కలిగి ఉన్నాయి.

పూర్వపక్షం: ఇవన్నీ ఆత్మ సంయమనానికి ఒకేవిధంగా వ్యతిరేకం కదా! దోషం దోషమే. కొన్ని అయినట్టు, కొన్ని కానట్టు ప్రత్యేకించి, విభజింప వలసిన పనిలేదని మా అభిప్రాయం.

ఉత్తరపక్షం: నిజమే. అవన్నీ ఆత్మసంయమనానికి ఒకేవిధంగా వ్యతిరేకమే. అంతమాత్రాన తమలో తాము వ్యతిరేకం కావనుకోవద్దు. ఏ ముల్లు గుచ్చుకున్నా బాధ ఒకలాగే ఉంటుంది. అయినా ముల్లుల రకాలగురించి చెపుతున్నప్పుడు బాధ ప్రసక్తి ఉండకూడదు. ఏరకానికా రకాన్ని ప్రత్యేకించి చెప్పవలసిందే.

అన్నిటికన్నా మోహం పాపిష్టిదే. కాదనను; కాని ఎంతటి ప్రజ్ఞావంతుడైనా రాగ ద్వేషాలకు లోనుకాకుండా ఉండడు.

పూర్వపక్షం: దోషానికి రాగ ద్వేష మోహాలు నిమిత్తాలు. రాగానికి కామాదులు; ద్వేషానికి క్రోధాదులు; మోహానికి సంశయాదులు నిమిత్తాలు. కావున వీటికి నిమిత్త నైమిత్తిక సంబంధం మాత్రమే ఉంది. అంతమాత్రాన అవి వేర్వేరనుకోవటం భావ్యంకాదు. ఇవి అర్థాంతర భావాలు; ఒక విషయం చెప్పి, దానిని సమర్థించుకోవటం కోసం లేనిపోనివన్నీ పట్టుకొచ్చి చెప్పటమే అర్థాంతర భావం.

ఉత్తరపక్షం: మోహంలోనే దోషం ఇమిడి ఉంది. దానిని తప్పించటం ఎవరి తరం? ప్రవర్తనా లక్షణమే ( Behavioral Pattern ) దోషమని ముందే చెప్పాము. ఆ లక్షణాలను విడమరచి ఇప్పుడు చెప్పాను. ఆ లక్షణాలకు అడ్డు పెట్టగల మనుకోవటం కూడా మోహమే.

పోతే, నిమిత్త నైమిత్తిక భావాలగురించి మీరు చెప్పారు. దేనికి నిమిత్తం (కారణం) ఉందో అది నైమిత్తికం. నిర్నిమిత్తంగా ఏదీ లేదు. దేనికయినా నిమిత్తం ఉన్నంతమాత్రాన నైమిత్తికమైనదేదీ వేరుగా ఉండకూడదనుకోవటమూ తప్పే.

కనుక కామాదులు గాని, రాగ ద్వేషాదులుగాని అర్థాంరభావాలు కావు. అంతర్భాగాలే.

ప్రేత్యభావం- ప్రేత్యభావ ( Regeneration ) మనగా పునరుత్పత్తి. చచ్చి మళ్ళీ పుట్టటంకాదు తనమంచి మరొకవ్యక్తిని పుట్టించటమే పునరుత్పత్తి తాతనుండి తండ్రి, తండ్రినుండి తాను. తననుండి తనయుడూ, తనయుని నుండి మనమడూ వరుసక్రమంలో పుడుతున్నారు. అందులో ఎవరు రెండవవారు పుట్టకుండాచనిపోయినా ఇక పునరుత్పత్తిలేదు ఈ విధంగా పరంపరానుగతంగా వ్యాపించటమే సంతానం. అదే ఆత్మనిత్యత్వానికి చిహ్నం. ఎవరి వంశం వారితో నశిస్తుందో వారి ఆత్మ కూడా వారితోనే నశిస్తుంది. ఆత్మ నిత్యత్వం వల్లనే ప్రేత్యభావం ( Regeneration ) సిద్ధిస్తోంది.

వస్తువుల ఉత్పత్తి - మనుషులనుండి మనుష్యులే పుడతారు; ఏ జంతువుకా జంతువే పుడుతుంది పిల్లీ, పులీ ఒక పోలికలో ఉన్నా దేని పిల్ల దానికే పుడుతుంది, అదేదాని ఆత్మీయత.

కాని వస్తువులలా కాదు. ఒక భావపదార్థం నుంచి మరో భావ పదార్థం పుడుతుంది మట్టిలోంచి కుండతయారవుతుంది. దూదిలోంచి వస్త్రం తయారవుతుంది మట్టి లక్షణాలు వేరు; కుండ లక్షణాలు వేరు. అవి రెండూ వేర్వేరు భావపదార్థాలే.

ఈ విధంగా ఒక భావపదార్థం నుండి వేర్వేరు భావ పదార్థాలు వెలువడటాన్ని బట్టి చూస్తే ఈ సమస్త భావ పదార్థాలకు మన కు తెలియని భావపదార్థ మూలక మేదో ఉన్నదను సంశయం కలుగుతోంది. అదే ఈ జగత్తునకు మూలకారణమయి ఉండాలి. దానినే ప్రకృతి అంటారులా ఉంది. ఇది అనుమానమే.

పూర్వపక్షం: మనిషి నుండి మనిషి పుట్టినట్లే కుండనుండి కుండ పుడితే భావపదార్థం నుండి భావపదార్థం పుట్టిందని నేనూ ఒప్పుకుంటాను. అలాంటిదేమీ కనబడటం లేదు. కనుకమీరు చెప్పింది తప్పే.

ఉత్తరపక్షం: కుండలు తయారు కావటానికి ముందు రోజుల్లో అంతా మనిషి పుర్రెల్లోనే అన్నంతినేవారు వాటిని దొలిచి, అందులోనే నీళ్ళు దాచుకునేవారు. కపాలాలు కరువైన రోజుల్లో మట్టితో అదేమాదిరి కుండలు చేయటం ప్రారంభించారు కనుక కుండ అనే భావపదార్థానికి పుర్రె అనే భావపదార్థం జన్మ యిచ్చినట్లే గదా!

వస్తువునుండి వస్తువే పుట్టనక్కర్లేదు. కారణంనుండికార్యం పుట్టటం లేదా? కుండ నుండి కుండ పుట్టకపోయినా ప్రమాదం లేదు కుండ పుట్టిన తర్వాతనే దాక, మూకుడు వగైరా పుట్టలేదా? అవి కుండనుండి పుట్టినట్లుకాదా? ఒక పదార్థానికి ఏపాటి చిన్న మార్పులు ( Modifications ) జరిగినా, ఏర్పడే కొత్తపదార్థం తొలి పదార్థం నుంచి పుట్టినట్లుగానే చెప్పటం జరుగుతోంది.

శూన్యవాది: అయ్యా, కారణం నశిస్తేగాని, కార్యం ఏర్పడదు అభావం నుంచే భావపదార్థాలు పుడుతున్నాయి మరో భావపదార్థం నుంచికాదు.

ఉత్తరపక్షం: ఊరుకోండి బాబూ! మీరు చెప్పింది శుద్ధ తప్పు అందులో వ్యాఘాతం ( Self contradiction ) ఉంది. కనుక చెప్పదగిన మాటకాదు.

వెన్నెల బాగుంది; దానికి చంద్రుడే కారణం. చంద్రుడు కారణమయితే వెన్నెల కార్యమయింది. మీ సిద్ధాంతం ప్రకారం వెన్నెల కనిపించిందంటే చంద్రుడు నశించాలి. చంద్రుడే నశిస్తే వెన్నెలే లేదు.

కుండనుంచి దాక, మూకుడు వగైరా పుట్టాయని అంటున్నాము కదా వాటితో బాటే కుండకూడా ఉంటున్నది స్వామీ!

పూర్వపక్షం: కారణం నశించిన తర్వాతనే కార్యం ఏర్పడుతుందని నేనన్నాను. కారణం కలిగిన తర్వాతగాని కార్యం జరగదని దాని అర్థం. కారణమే కార్యమైపోతుందని నా అభిప్రాయం కాదు.

ఉత్తరపక్షం: కారణం ఉంటేనే కార్యంకలుగుతుంది. కారణాలు నశించిపోతే కార్యం కలగదు. నశించిన విత్తనాలను రైతులు తమ పొలాలలో చల్లితే మొక్కలు మొలవటం లేదు. బీజం నుంచి అంకురం మొలకెత్తాలంటే ఆ బీజంలో విశిష్ట శక్తి ఒకటి ఉండాలి. అది ప్రాణశక్తి, ఆ శక్తి సజీవ వస్తువులో ఉంటుందిగాని. నశించిన దానిలో ఉండదు. దారాలన్నీ వేటికవి నశించి పోతే పంచె ఉంటుందా? కనుక అభావం లోంచి భావం కలుగుతుందనటం సమంజసంకాదు.

ప్రతీ బీజానికి పూర్వపరావస్థలున్నాయి. వా టి నే క్రమమని అంటాము. బీజంనుంచి అంకురం మొలకెత్తి, వృద్ధిపొంది, మొదట్నుంచీ ఉన్న బీజదళాలను విసర్జించుగాక! అంతమాత్రాన మొలకకు కారణ మైన బీజం నశించిందనము బీజమే అంకురంగానూ, అంకురం వృక్షం గానూ, వృక్షమే పువ్వులుగానూ, పువ్వులు పళ్ళుగానూ పరిణమించాయని చెపుతాము. కనుక భావం నుండి భావం పడుతుందనే సిద్ధాంతాన్ని నిషే ధించటం జరగదు

ఈశ్వర వాదం: పురుషుడు చేసే కర్మలన్నిటికీ ఫలం భిన్నంగా ఉంటుంది. జయాపజయాలు పురుషుని ఆ ధీ న ం లో లేవు. పురుష ప్రయత్నం విఫలంకావటానికి ఈశ్వరేచ్ఛ కారణమవుతున్నది ఈశ్వరేచ్ఛ వల్లనే పురుష ప్రయత్నం ఫలించటం కూడా జరుగుతున్నది

కొంతమంది పుట్టినప్పట్నుంచీ చచ్చేదాకా సుఖంగానేఉంటున్నారు మరికొంత మంది ఒక్కరోజు కూడా సు ఖా న్ని అనుభవించకుండా దుఃఖాన్ని అనుభవిస్తూనే ఛస్తున్నారు. కొందరిజీవితాలు ఆటూఇటూగా అవుతున్నాయి. బాగుపడాలని ఎంత ప్రయత్నించినా కొ ం ద రు బాగు పడరు. అల్పప్రయత్నంతోనే కొందరు ఆ కా శ పథానికి వెళ్ళిపోతు న్నారు ఇది పూర్తిగా కర్మ ఫలమనే అనుకోవటాని జీవులంతా, శక్తి మంతులు కారు. అందుకే ఈశ్వర శక్తి ఈ ప్రపంచాన్ని పాలిస్తున్న దనిపిస్తోంది.

పూర్వపక్షం: ఎవరిపని వారు శ్రద్ధాసక్తులతో వివేక బుద్ధితో చెయ్యాలి. అలా చెయ్యకపోతే ఫలించదు. దానికి ఈశ్వరుడు కారణం కాదు

ఉత్తరపక్షం: ఈ జగత్తును సృష్టించటమే మహా కర్మ. అది నువ్వు పుట్టక పూర్వమే జరిగింది. దాని కర్త ఈశ్వరుడే.

ఏ పనీ స్వతంత్రింగా జరగదు. ఆ పని అలా జరగాలన్న సంకల్పం ఉంటే తప్ప. సంకల్పం చైతన్యం నుంచి పుడుతుంది. చైతన్యం పురుషాధీనమై ఉంది. అట్టి పురుషోత్తముడు ఈశ్వరుడే.

ప్రికృతి జడమతి. Nature is natural ( idiotic ) సామాన్య పురుషుడు జగత్కర్తకాలేడు. ఈ జగత్తు యావత్తు జగత్కర్త సంకల్పమే. ఈశ్వరుడు ప్రాణ స్వరూపుడని అధర్వణ వేదం అన్నది. ఈశ్వరుడు ప్రపంచాత్మ అని ఉపనిషత్తులంటున్నవి.

పూర్వపక్షం: ఆగండి: మనం చేయకుండా ఏపనీ జరగటంలేదు కనుక కార్యకర్తలం మనమే గాని ఈశ్వరుడు కాదు ఈశ్వరుడే కార్యకర్త అయినట్లయితే అతడే మనకు అన్నీ చేసిపెట్టాలి. పంటలు పండించవలసిన పనిగాని, అన్నం వండుకోవలసిన పనిగాని మనకులేదు ఈశ్వరుడే చెయ్యాలి తెల్లారి కళ్ళాపు చెయ్యాలి. అంట్లు తోమాలి అన్నం వండాలి.

ఉత్తరపక్షం: ఉదర నిమిత్తం మనం చేసుకోవలసిన పనులన్నీ ఈశ్వరుడుచే చేయాలని మీరన్నారు. ఈ పనులు మీరే చేసుకుంటున్నారు. ఇవి మీ కార్యాలేగాని ఈశ్వరకార్యాలు కావు. ఈశ్వరుడు జగత్కర్త. ఈ జగత్తును ఆయన సృష్టించాడు ఆ పని మీరు చెయ్యగలరా? మీరు మరణాన్ని జయించగలరా! జయించగలిగితే ఈశ్వరుడే లేడు. ఈశ్వరుడు హరుడు.

ఈ జగత్తులో పురుషుడు ఒక సూక్ష్మాతి సూక్ష్మాంశమే గాని జగత్కర్తకాదు. ఈశ్వరుడే జగత్కర్త.

స్వభావ వాది: ముల్లుకు వాడి అకారణంగా ఏర్పడింది. నెమలి పురిలో అన్నిరంగులు కూడా వాటికవే ఏర్పడ్డాయి. ఇవన్నీ నిర్నిమిత్తం

గా ఏర్పడినవే. అలాగే చాలా వస్తువులు నిర్నిమిత్తం గానే ఏర్పడ్డాయి కొన్ని నిర్నిమిత్తకాలనీ, కొన్ని నిమిత్తకాలనీ చెప్పటం తప్పు. భావ పదార్థాలన్నీ వాటికవే పుట్టాయి.

ఉత్తరపక్షం: అనిమిత్తమే నిమిత్తమయితే నిమిత్తం లేకుండా భావఉత్పత్తి జరగదు.

నిమిత్తానికీ అనిమిత్తానికీ మధ్య చాలా తేడా ఉంది. ప్రతీ భావానికి (పదార్థానికీ) కారణాలు అయినవీ, కారణాలు కానివీ చాలాఉన్నాయి. స్వభావతః పనులు జరుగుతూంటాయని భావించకూడదు. ప్రతీ కార్యానికీ కారణం ఉంది కారణం లేని కార్యం ఎక్కడా కనబడటం లేదు. కార్యం దానికదే జరిగే స్వభావం గలదయితే స్వభావానికి ఆధారం ఒకటి ఉండాలి. ఈశ్వర ప్రేరణ వల్లనే కార్యాలు జరుగుతున్నాయి గాని స్వభావతః కాదు.

సర్వమనిత్యత్వ వాది: ప్రతీ పదార్థానికీ ఉత్పత్తి ఉన్నది. వినాశన ధర్మం ఉంది. ఉత్పత్తివినాశనాలు గలవన్నీ అనిత్యాలే గదా:

ఉత్తరపక్షం: మీదృష్టిలో అనిత్యత్వం ఒక్కటే నిత్యం కాబోలు! అప్పుడయినా సర్వం అనిత్యంకాదు గదా!

పూర్వపక్షం: అగ్ని కొంపకు అంటుకొని దానిని బూడిద చేసి తాను ఆరిపోతుంది. అలాగే అనిత్యత్వం సమస్త పదార్థాలనూ అనిత్యం చేసి తానూ అనిత్యమవుతుంది. కనుక సర్వమూ అనిత్యమే అన్నాను. అనిత్యం కూడా నిత్యంకాదు.

ఉత్తరపక్షం: ఈ సమస్త ప్రపంచము, ప్రాపంచిక వస్తువులూ నిత్యమై లభిస్తున్నంత కాలం వాటి ఉనికిని నిరాకరించటానికి వీల్లేదు.

సర్వనిత్యత్వ వాది; పంచభూతాలూ-నీరు. అగ్ని, గాలి, నేల, ఆకాశం - నిత్యమే కదా! వాటినుంచిగాని, వాటి మాత్రల నుంచిగాని పుట్టినవికూడా నిత్యమే. కుండ పగిలినాకుండ పెంకులున్నాయి

ఉత్తరపక్షం: ప్రతీ పదార్థానికి ఉత్పత్తివినాశన కారణాలు లభిస్తున్నాయి. కావున అన్నీ నిత్యంకాదు.

పూర్వపక్షం: ఏవస్తువయినా భౌతికమే అనగా భూతసంబంధమయినదే భూతములు నిత్యంగనుక భౌతికములుకూడా నిత్యాలే.

ఉత్తరపక్షం: మీరు చెప్పిన భౌతికాలన్నిటికీ భూతాలకు లేని ఉత్పత్తివినాశములున్నాయి కనుక భూతములు నిత్యమయినా భౌతికాలు మాత్రం నిత్యంకావు ప్రతీపదార్థానికీ ఉత్పత్తి వినాశకారణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి భ్రమకాదు

కార్యకారణ సంబంధమొక వ్యవస్థ అది ప్రత్యక్షమేగాని ఊహ కాదు. కాబట్టి సర్వనిత్యత్వవాదంగాని చెల్లదు

అవయవవాది: దేనికయినా మూలపదార్థం ఒక్కటే నీటినుంచే ఆవిరి, పొగమంచు మేఘం వర్షం, వడగళ్ళు. మంచుగెడ్డలు మున్నగునవి పుట్టాయి వాటి నానాత్వంవల్ల అన్నీతలొకటిగా పైకి కనిపిస్తున్నాయే గాని వేరువేరుకాదు. మూలభూతమయిన నీరు నశించటంలేదు భౌతికములయిన పదార్థాలు మాత్రం నశిస్తున్నాయి.

ఉత్తరపక్షం: మూల భూతపదార్థం ఒకటే అయినంత మాత్రాన దాని లక్షణాలని చెప్పబడే ఇతర పదార్థాలన్నీ ఒక్కటి కావు. నీటికి ద్రవగుణంవుంది; మంచుగెడ్డకు ద్రవగుణంలేదు. దానికి ఘనత్వంఉంది. ఆవిరికి వాయుగుణంఉంది. ఒకదానిగుణం మరొకదానికి లేదు.

ఆవిరి, పొగమంచు మొదలైనవన్నీ నీటికి అవయవాలయినంత మాత్రాన అవయవికున్న సమస్తలక్షణాలనూ సంతరించుకోలేవు

ఆవు అవయవి. దానికాళ్ళూ, తోక, మెడ డెక్కలు మున్నగునవి అవయవాలు ఆవుల లక్షణాలన్నీ దాని అవయవాలకున్నాయా?

ఉండవు. లేనంతమాత్రాన అవి గోవుకు అవయవాలుకాకుండా పోనూలేదు. అలాగే ప్రతీవస్తువుకూ అవయవాలు వేరువేరుగా ఉంటాయి ఉన్నంతమాత్రాన మూలవస్తువుకు సంబంధం లేకుండాపోదు,

అభావవాది: భావపదార్థాలయందు ఇతరేతర భావాలు సిద్ధించటం లేదు కనుక సర్వమూ అభావమే.

కుండకీ కుండలానికీ పోలికఉన్నది. అయినా కుండవేరు; కుండలంవేరు. కుండలో కుండలంలేదు: కుండలంలో కుండలేదు, కుండకీ కుండలానికీ వేర్వేరు లక్షణాలున్నాయి. మీరు నీరునుంచి మంచూ, పొగమంచూ, ఆవిరి, మొయిలూ, ఏర్పడుతున్న వని అన్నారు. మంచులో నీరు అభావమే నీటిలో మంచూ అభావమే. అది ఇందులో ఉండదు; ఇది అందులో ఉండదు కనుక సమస్త వస్తువులూలేనివే అవుతూన్నాయి.

ఉత్తరపక్షం: కుండలో కుండలంలేదే (అభావం) గనుక ఉన్న కుండనికూడా లేదనటం అవివేకం, కుండలో కుండతనం ఉన్నదిగదా? కుండకు కుండతనమే స్వభావం. కుండకు కుండలతనం ఉండటం విరుద్ధం. ఆవు అశ్వము కాదుగనుక ఆవులేదంటారేమిటి? ఆవు, గుర్రము వేరువేరు భావపదార్థాలు. ఒకదానిలో ఒకటి లేదుగనుక అభావములని మీరనటం చెల్లదు.

ఉత్తరపక్షం: మీరు భావపదార్థాలన్నీ స్వభావసిద్ధాలంటున్నారు. అంటే వాటికవి మరొకదానితో నిమిత్తంలేకుండా పుట్టినవని అర్థం. తండ్రిలేకుండా పుత్రుడు పుడుతున్నాడా? పుత్రుడు లేకుండా తండ్రి అవుతున్నాడా? మట్టిని అపేక్షించకుండా కుండ తయారవుతుందా? గోత్వాన్నిఅపేక్షించకుండా గోవు అవుతుందా? కనుక ఏదీ స్వభావసిద్ధం కాదు ఇంకొకదానిని అపేక్షించేదే.

పూర్వపక్షం: మట్టిని ఆశ్రయించుకుని కుండ తయారయినమాట నిజమే. తండ్రిని ఆశ్రయించుకుని కొడుకుపుట్టినమాటా నిజమే. అంత మాత్రాన వారిద్దరికీ అన్యోన్యాపేక్ష ఉండదు. కొడుకుతో నిమిత్తం లేకుండానే తండ్రి పుట్టాడు. కుండలో నిమిత్తం లేకుండానే మట్టిపుట్టింది కనుక భావములు తమ పుట్టుక విషయంలో ఇతరుల అపేక్షపై ఆధార పడవని చెప్తున్నాను. తండ్రిపిల్లలకోసం తపస్సు చేసినా సంతానం కలగదు. సంతానాన్ని అపేక్షించకపోయినా కలుగుతుంది. కనుక అన్యోన్యాశ్రయ సిద్ధాంతం చెల్లదు.

సంఖ్యైకాంతవాది: భావపదార్థముల యొక్క ఉత్పత్తిలో అన్యోన్యాశ్రయ భావంలేదు. అవి స్వతంత్రంగానే సిద్ధిస్తాయి. సమస్త భావ పదార్థాలకు యిదే లక్షణం ఉంది కనుక వాటికి ఏకత్వ సంఖ్యానియమం ఉంది. సమస్త భావ పదార్థములు ఈ విధంగా ఒకేలక్షణం కలిగినందున ఒకటే అవుతున్నాయి.

ఉత్తరపక్షం: భావపదార్థాలన్నిటికి ఒకేకారణం ఉన్నదనుకోవటం తప్పు ఒకవేళ ఒకేకారణం ఉందని అనుకున్నా ఆ కారణం నిస్సహాయమా? లేక సహాయవంతమా? అని ఆలోచించాలి. ఆకారణం నిస్స హాయమే అయినట్లయితే నానావిధ జగత్తుకది సమాధానంకాదు. ఆ కార

ణం సహాయవంతమైనదయినట్లయితే ఆ సహాయం పదార్థమో కాదో చూడాలి. పదార్థం కానిది పదార్థాన్ని సృష్టించలేదు కదా! అది పదార్థమే అయినట్లయితే యింకొక పదార్థాన్ని సృష్టిస్తున్నట్లవుతుంది. నీరు ఆవిరిని, మేఘాన్ని వర్షాన్ని పొగమంచుని, మంచుగడ్డని, సముద్రాల్ని నదుల్ని సృష్టిస్తున్నది. యివన్నీ పదార్థాలే! నీరుకూడా పదార్థమే కనుక సంఖ్యైకాంతవాదం చెల్లదు,

పూర్వపక్షం: మేఘము, పొగమంచు, మంచుగడ్డ. ఆవిరి, వర్షం నది. సముద్రము- యివన్నీ నీటికి అవయవాలే. వీటన్నిటా నీరుంది. నానావిధమైన ఈ జగత్తుకి కారణమేదైనప్పటికీ దానికి సహాయంలేదు. అది నిస్సహాయమే. నిస్సహాయమైన ఒకేకారణం నానావిధ కారణాలను నిర్వర్తించగలదా? అందుకే దానికి ఎన్నో అవయవాలున్నవి. అవి అన్ని పనులూ చేస్తాయి.

ఆవుకు నోరుంది. గడ్డితింటుంది. కాళ్ళున్నాయి. నడుస్తుంది. చెవులున్నాయి వింటుంది. కళ్ళున్నాయి. చూస్తుంది. ముక్కుంది వాసన పీలుస్తుంది, శ్వాసిస్తుంది. తోకతో ఈగల్ని తోలుకుంటుంది. మలమూత్రాలను విసర్జించే అవయవాలు వేరుగా ప్రత్యేకించి ఉన్నాయి. ఇందులో ఏ ఒక్క అవయవం చేసే పనినీ వేరొక అవయవం చేయదు. కాని గోవు అన్ని పనుల్నీ చేస్తుంది అవయవాలు వేరయినా అవయవి ఒకటే కనుక ఇదే విధంగా కారణం ఒకటే అయినా కార్యాలు చాలా జరుగుతాయి. కనుక సంఖ్యైకాంత వాదం తప్పుకాదు.

ఉత్తరపక్షం: మీరు చెప్పినది బాగానేఉంది. ఆవుకి తోక ఉంది కనుక తోలుకుంటుంది. డెక్కలున్నాయి తొక్కుతుంది. గోత్వం పదార్థం కనుక. మీరు చెప్పినకారణం పదార్థం కాదు. దానికి అవయవాలు ప్రత్య

క్షంగా లేవు. ఉన్నట్లు అనుమానం కూడా లేదు. కనుక కారణానికి అవ యవాలున్నాయనే మీ వాదం హేతువుకాదు.

అవయవములు కలిగి ఉండటం కార్యమేకాని కారణంకాదు. కారణానికి ఎప్పుడయితే అవయవాలు చేరుతాయో అప్పుడే అది కార్యమై కూర్చుంటుంది. కారణానికి ఎప్పుడైతే అవయవాలులేవో అప్పుడది నిస్సహాయం అవుతుంది. నిస్సహాయమైన కారణం నానావిధ కార్యాలను చేయలేదు దానికి యితరేతర కారణాలు సహకరించినట్లయితే చేయగలదు అందుకే సాంఖ్యైకాంత వాదం చెల్లదు.

పూర్వపక్షం: పోనివ్వండి. ఈ సారి ఫలప్రాప్తి గురించి ఆలోచిద్దాం కొన్ని కారణాలు సద్యః ఫలాలు; కొన్ని నిష్ఫలాలు.

ఉత్తరపక్షం: ఏ కార్యానికైనా ఫలముంది. కొన్నింటి ఫలితం వెంటనే తెలుస్తుంది. మరి కొన్నిటి ఫలితం కాలాంతరంలో లభిస్తుంది. అంతేకాని ఏ కార్యమూ నిష్ఫలంకాదు. ఇప్పుడు చేసిన పనికి ఎప్పుడో ఫలం లభించినపుడు అది ఎప్పుడు చేసిన పనికో తెలీక మనిషి సంశయాత్ముడవుతాడు. కాలాంతరంలో లభించేకర్మ ఫలాలు లభిస్తాయో లభించవో తెలీక సంశయాత్ముడవుతాడు.

పూర్వపక్షం: జరిగిన పనికి ఎప్పటికప్పుడు ఫలితం లభిస్తేనే సద్యః ఫలమవుతుంది. ఇపుడు జరిగిన పనికి ఎపుడో ఫలం లభిస్తే అది అదృష్టమనుకుంటాం తప్ప కర్మఫలం అనుకోము.

ఉత్తరపక్షం: శీతాకాలంలో ఒక విత్తనం భూమిమీదపడి అది వేసవికాలమంతా ఉండి వర్షాకాలం రాగానే మొలకెత్తుతుందనుకోండి. అది సద్యఃఫలం కాదు. అది కాలాంతర ఫలమే. ముఖ్యంగా మనంచేసే పుణ్య కర్మలకుగాని, పాప కర్మలకుగాని సద్యఃఫలం లభించదు. కాలాం

తరంలోనే వాటి ఫలాలను అనుభవిస్తాం.

పూర్వపక్షం: కారణమున్నపుడే కార్యం జరుగుతుంది. కారణం నశిస్తే కార్యంజరగదు. కార్యంలేనప్పుడు దాని ఫలమూ ఉండదు. ఇపుడు పూచిన పూవు, పూవుతోపాటు చెట్టూ నశించిపోయిన చాలాఏళ్ళకు కాయ కాస్తుందంటే సిగ్గేస్తోంది.

ఉత్తరపక్షం: ఇప్పుడు పెట్టిన గుడ్డు కొన్ని నెలల తర్వాత పిల్ల అవటం లేదా? అది కాలాంతర ఫలమే. కోడి గుడ్డును పెట్టడంతోనే కార్యం ముగిసింది. గుడ్డు పిల్లగా మారటం ఎప్పుడో జరిగింది. ఆ చెట్టు కాస్తుందనే ఆశతో ఒకడు దానికి బోదిచేసి రోజూ నీరుపోస్తాడు. ఆ తరువాత అదికూడా మానేస్తాడు. కాలాంతరంలో ఆ చెట్టు ఫలాలనిస్తుంది. నిజంగా అది అదృష్టమే. దీనిని మీ మాసంకులు అపూర్వమనే అంటారు. అంతమాత్రాన అదృష్టం వల్లనే ఫలం కలిగిందని అనుకోకూడదు. కర్మ వల్ల కాదననూకూడదు. కర్మకీ, ఫలానికి మధ్యఉండే అదృష్టం వ్యాపార మవబడుతుంది పొగను చూసిన తరువాత నిప్పు స్మరణకు వస్తుంది. పొగనుంచి మన మనసు నిప్పుకు వ్యాపిస్తుంది. ఈరకం వ్యాప్తి స్మరణ వల్లనే జరుగుతుంది, అది హేతువు కాదనలేము. కనుక కర్మవల్ల అదృష్టం ద్వారా కాలాంతరలో ఫలప్రాప్తిని పొందడం తప్పుకాదు.

పూర్వపక్షం: ఏ కార్యానికయినా కారణం ముందే ఉంటుంది. ఏ కారణం వల్ల కార్యం జరుగుతున్నదో ఆ కారణమే ఫలానికీ ఉంటుంది, కనుక ఫలకారణమే కార్యానికి హేతువని చెప్పవచ్చు. దీనినే ఉపాదాన నియమని అంటాము

కార్యానికి ముందే నిజంగా ఫలంఉందా? ఉంటే కార్యం దేనికి నిజంగా ఫలం లేదు కనుకనే ఫలంకోసం కార్యాన్ని నిర్వహించడమవు

తోంది ? అయితే ఫలభావన లేదా? ఉంది ఫలభావన మాత్రమే ఉంది; ఫలంలేదు.

ఉన్నదానిని సత్తు అనీ, ఫలభావనను అసత్తనీ అందాము. కార్యానికి పూర్వంఉండే ఫలభావన అసత్తయితే కార్యం తర్వాత కలిగే ఫలం సత్తు అవుతుంది.

ఫలభావంలో ఫలాన్నిపొందటాన్ని 'సదసత్' అని కొందరంటారు అదితప్పు సత్తు అసత్తులు రెండూ కలిసిఉండవు అసత్తగు భావనలోంచి సత్తగు ఫలం కలుగుతోంది.

ఉత్తరపక్షం: ఉత్పత్తి కావటానికి ముందేఫలభావన కలుగుతోందనీ, అదే కార్యాన్ని ప్రేరేపిస్తున్నదనీ, మీరన్నారు. భావననుంచి ఫలం కలుగుతోంది కదా! భావన నశిస్తోంది. కనుక కార్యానికి పూర్వం కలిగే ఫల భావనను 'సదసత్' అనటమే మంచిది. ఏఫలం మనం ఆశించామో అది భావనలో సత్తై ఉన్నది. నిజంగా లేదు కనుక అసత్తై ఉంది. కనుక భావనా ఫలాలన్నీ సదసత్తులనాలి.

పూర్వపక్షం: ఉండటం వేరు; లేకుండటం వేరు. ఈ రెండింటిలో ఏదో ఒక్కటే ఉండాలి. కనుక సదసత్తులు రెండూ ఒకేమారు లభించవు.

ఉత్తరపక్షం: అసత్తుబుద్ధి సిద్ధంతు-ఫలం గురించిన భావనయే అసత్తని మీకు ముందేచెప్పాను ఆ భావన బుద్ధివల్ల సిద్ధిస్తుంది ఫలానికి సంబంధించిన రూపురేఖా విలాసాలు ముందుగా స్మరణంద్వారా మనస్సులో కల్గుతాయి. అదే అసత్ ఫలరూపం. ఆ తర్వాత యించుమించు అలాంటి ఫలమే లభిస్తుంది. అది సద్రూపం.

అసత్ఫలాలు బుద్ధినుంచి పుడుతూవుంటే సత్ఫలాలు కార్యంనుంచి

పుడతాయి

పూర్వపక్షం: మీరు చెట్టుకీ శరీరానికీ పోలిక చెప్పటం బాగా లేదు. శరీరం కర్మాశ్రియం. ఏదైనా పని చేస్తేగాని ఫలం లభించదు. ఏ పని జరగకుండానే చెట్లు ఫలిస్తాయి.

ఉత్తరపక్షం; ఏ క్రియకయినా సుఖదుఃఖాలు ఫలాలు. అవి ఆత్మను ఆశ్రయించుకుని ఉంటాయి. చెట్టుకయినా మనిషికయినా ఆత్మ ఒక్కటే. కనుక నేను తీసుకున్న దృష్టాంతం అసమంజసం కాదు.

పూర్వపక్షం: మనిషికీ, చెట్టుకీ పోలికేలేదు. పిల్లలు, పశువులు ఆడవారు. బట్టలు, బంగారం. అన్నము- ఇవన్నీ మనుషులకోసం నిర్దేశింపబడినవి. వీటి కోసమే ఏ మనిషయినా ఏ పనినయినా చేయడం. సుఖంకోసంకాదు; దుఃఖం కోసమూకాదు. కనుక చెట్ల ఆత్మాశ్రియమైన సుఖదుఃఖాలు మనిషికి లక్ష్యంకాదు. కావున మీరు చెప్పిన చెట్టు దృష్టాంతం చెల్లదు.

ఉత్తరపక్షం: మీరు చెప్పిన స్త్రీలు, పిల్లలు మొ॥ వన్నీ ఫలాలు కావచ్చు. ఫల సంబంధమైనవీ కావచ్చు. అనగా వాటి ద్వారా పునరుత్పత్తి కలుగవచ్చు. సుఖమూ, దుఃఖమూ, అనేని కొడుకుల వల్లనే కల్గుతున్నవి. కనుక సుఖదుఃఖాలకు సాధనమవుతున్నారు. సాధనమగు స్త్రీలు పశువులు మున్నగువాటిని ఫలంగానే ప్రయోగించటం జరుగుతున్నది. దీనినే గౌణ ప్రయోగమని అంటారు. కాబట్టి దృష్టాంతంలో దోషంలేదు

పూర్వపక్షం: ఇంతకీ దుఃఖానికి నిర్వచనం ఏమిటి?

ఉత్తరపక్షం; నానావిధ బాధలకు నిలయమైన దుఃఖమే జన్మకు పుట్టుక అవుతున్నది. ఇక్కడ జన్మ అనగా మనోశారీరక ఆవేదన.

పూర్వపక్షం: దుఃఖంలాగే సుఖంకూడా అంతరాళంలోనే పుడుతున్నది. కనుక జన్మ కేవలం దుఃఖమనడం భావ్యంకాదు. మనోశారీరక అనుకూల వేదనమే సుఖమని చెప్పబడుచున్నది.

ఉత్తరపక్షం: జీవితమంతా దుఃఖంకాదు. మధ్యమధ్య సుఖాలుకూడా కలుగుతుంటాయి. అయినప్పటికీ తృష్ణాదోషంవల్ల నానావిధ దుఃఖాలను మనిషి మళ్ళీమళ్ళీ పొందుతుంటాడు అయినప్పటికీ జన్మ దుఃఖం అనడం సమంజసం కాదు.

అయితే సుఖాలన్నీ నిజంగా సుఖాలేనా? దుఃఖవికల్పేసుఖాభిమానాచ్చ:- దుఃఖానికి మధ్య సుఖం కలుగుతుందనడం వాస్తవంకాదు, దుఃఖానుభవం కొంతసేపు సడలిపోతే అదే సుఖమనుకుంటున్నారు. అది మూర్ఖత్వం. కాముకులు ప్రణయ కలహంలో ప్రియురాళ్ళ పాద తాడనాన్ని సుఖంగా భావించడం చూస్తున్నాం వాస్తవానికి కాలితో తంతే సుఖం లభిస్తుందా? ఏదో విధమైన బాధలు ఎప్పుడూ మనిషిని కృంగదీస్తుంటాయి. అందుకే జన్మము దుఃఖమే అనుట సమంజసం.

పూర్వపక్షం: అప్పులు, గొడవలు గందరగోళం, పరాభవం. ఉక్రోషం మొదలైన వాటితో ఎప్పుడూ సతమతమవుతున్న ఆత్మకు మోక్షంలేదు. ఋషిఋణము దేవఋణము, పితౄణము అందర్నీ ఒకే విధంగా బాధిస్తున్నాయి.

మనుషులకు ప్రవృత్తి ఎక్కువ ఈ ప్రవృత్తే సంసారానికి మూలం. పుట్టిన క్షణంనుంచి మరణించేవరకూ లోక వ్యవహారాలలో సతమతమవుతూ ఉంటాడు మనిషి. అందుకే అతనికి మోక్షంలేదు.

ఉత్తరపక్షం: ఇపుడు మనప్రసంగం నిందాప్రశంసలలో పడింది మన చర్చకు ఋణం ప్రధానంకాదు ముఖ్యావృత్తితో స్వార్థమను పదం

ప్రయోగింపబడుట ప్రధానము. 'గోవుకు గంగడోలున్నది' అను వాక్యం లో గోవుకు గంగడోలుకీ సంబంధముంది. కనుక గోవు ప్రధానమవు తోంది. 'ఆమె అగ్గి' అనుమాట ప్రసిద్ధమే. ఆమెశీలం నిప్పువంటిదని అర్థం ఈరకం ప్రయోగాన్ని గౌణ ప్రయోగమని అంటారు.

అసలు ఋణం వేరు. ఒకడు తిరిగి తీర్చే నిమిత్తం తెచ్చిన అప్పును ఋణం అంటాము. మీరు చెప్పిన మూడుఋణాలు ఈ బాపతు బాకీలుకావు, దేవతల యందు, పితృదేవతల యందు, గురువుల యందు పరిచర్య చేయవలసిన బాధ్యతను ఈ ఋణశబ్దం తెలియజేస్తున్నది.

పూర్వపక్షం: ఏ కర్మానుష్ఠానమూ లేని సన్యాసులకి మోక్షం లేదంటారా?

ఉత్తరపక్షం: సన్యాసులు తమ శరీరాగ్నులలో సమారోహణం చేసుకుంటారు. అందుకే వారికిన్నీ మోక్షం లభిస్తుంది.

పూర్వపక్షం: సన్యాసులు అగ్నులందు కాకపోయినా శరీరాగ్ను లందైనా సమారోహణం చేసుకుంటున్నారు కనుక వారికి మోక్షం వస్తుం దంటున్నారు, ఆ విధంగా వారు కర్మానుష్ఠాన పరులయ్యారు కనుక కర్మ ఫలాన్ని వారున్నూ అనుభవించవలసి ఉంటుంది.

ఉత్తరపక్షం: సన్యాసులు పాత్రలను ధరించరు. వారు ధర్మోప దేశిత కర్మలను మాత్రమే ఆచరిస్తారు. అది మోక్షానికి అభ్యంతరంకాదు. నిష్కామ కర్మలనాచరిస్తారు కనుక కర్మఫలంతో వారికి నిమిత్తం లేదు. వళ్ళుమరిచి నిద్రపోయిన మనిషికి కలలు రావు, కలల వలన కలిగే దుఃఖమూ రాదు కనుక సన్యాసులకు మోక్షప్రాప్తి కలుగుతుంది.

తత్వజ్ఞానంతో దుఃఖాన్ని పోగొట్టుకున్నవాడు ప్రవృత్తిని పొందడు.

పూర్వపక్షం: క్లేశాలు స్వాభావికాలు అవడంచేత వాటి సంతతికి తత్వజ్ఞానం వలన విచ్ఛేదం కలుగదు.

ఉత్తరపక్షం: పాలు పెరుగుగా మారడానికి ముందే పాల్లో పెరుగు అభావమై ఉంది. అది అనిత్యమే. అలాగే క్లేశములు అనాదులయినప్పటికీ తత్వజ్ఞానం వల్ల అవి నశిస్తాయి.

పూర్వపక్షం: క్లేసాలను ఎలాగ నాశనం చేస్తారు.?

ఉత్తరపక్షం: ఆకుల్లోని హరితం నశించిపోవటం లేదా! అలాగే క్లేశసంతతి కూడా నశిస్తుంది. రాగాదులు సంకల్పం మీద ఆధారపడి ఉన్నాయి. సంకల్పాన్ని బుద్ధి అదుపులో ఉంచినట్లయితే మిథ్యా జ్ఞానం నశిస్తుంది. దానితో రాగాది క్లేశాలు కూడా నశించిమోక్షం సిద్ధిస్తుంది.

# ఎనిమిదవ ఆహ్నికం

## తత్వజ్ఞానం

దేనిని చూస్తే నీకు రాగం ( Passion ) గాని, ద్వేషం ( Avet-sion ) గాని కలుగుతుందో దాని తత్వాన్ని ( Real state ) నువ్వు తెలుసుకుంటే నీలో ఉండేఅహంకారం ( Self-Conciousness ) తొలగి పోతుంది. అందుకే 'దోషనిమిత్తానాం తత్వజ్ఞానాత్ అహంకార నివృత్తిః అని చెప్పబడింది.

అందమైన స్త్రీని చూసేసరికి మన్మధతాపం కలుగుతుంది: మధురమైన పదార్థాలను. రుచి చూసినా, వాసనచూసినా నోరూరుతుంది. వాటిని అనుభవించాలన్న కోరిక కలుగుతుంది. దానికే సంకల్ప ( Wish ) మని పేరు ఈ సంకల్పబలం వల్ల కొన్ని కోరికల్ని తీర్చుకోగలుగుతాము. ఆ కోరిక తీరేవరకు మనలో కలిగే పరితాపమే మోహ ( Infatuation ) మని చెప్పబడుతున్నది. మోహంతో ఏ సంకల్పమయితే నెరవేరిందో అది సంకల్పకృతమవుతుంది.

శరీరాదులందు కలిగే అభిమానమే మోహానికి కారణం.

# అవిధ్య-విధ్య

విద్య, అవిద్య అని రెండు మాటలున్నాయి. సత్యాన్ని గ్రహింప జేసేది విద్య, అసత్యాన్ని గ్రహింపజేసేది అవిద్య. విద్య ప్రమాత్మక ( Realistic ) అయితే అవిద్య భ్రమాత్మక ( illusory ) మవుతుంది.

చెరువులో నీరుంది అది ప్రమ ( Reality ) ఎండమావుల్లో నీరు ఉన్నట్లు కనబడుతుంది. అది భ్రమ ( illusion ).

రెండూ ఒకలాగే కనిపిస్తాయి. వాటిల్లో ఏది నిజమో, ఏది కాదో నిర్ణయించలేని సంశయస్థితి ఏర్పడుతుంది. సామాన్యులు సంశయాత్ము లయి భ్రమభ్రాంతులకు లోనవుతారు విశేషజ్ఞానులకీ సంశయం ఉండదు వారికి విశేషానుభవం ఉంటుంది. అనుమాన జ్ఞానం ఉంటుంది. పొగను చూసి నిప్పు ఉనికిని అనుమానిస్తారు. కొమ్మల్ని బట్టి చెట్టును అనుమాని స్తారు.

పూర్వపక్షం: కొమ్మలులేని చెట్లు కోకొల్లలుగా ఉన్నాయి కొమ్మ లుంటే గాని చెట్టుకాదనటం సమంజసంకాదు.

ఉత్తరపక్షం: అవును. కొమ్మలూ, వాటితోబాటు ఆకులులేని మ్రాను కనిపించిందనుకోండి దానిని చెట్టంటామా? ఫలానా చెట్టు మ్రానం టామా ?

మరో ఉదాహరణ చెపుతాను: చెరువుగట్టిమాని చెరువంటాము. అందులో ఒక్క చుక్క నీరు కూడాలేదు. అంతా ఎండిపోతుంది. చెరువు గట్టున్నంత మాత్రాన చెరువవుతుందా? అవయవాలు లేకుండా అవయవి ఉండదు. ఎవరిదో నరికినచెయ్యి కనిపించింది అతను కనిపించలేదు. ఆ చెయ్యి ఎవరిదని చెపుతాము?

సంశయం ( Doubt ) వేరు: అనుమానం ( Derivation ) వేరు.

పూర్వపక్షం: గట్టుకాకుండా చెరువు లెన్నోఉన్నాయి. గట్టు ఒక చోట చెరువు ఒకచోట ఉండటంకూడా చూస్తున్నాము. అందుకే సంశయం కలుగుతుంటుంది.

అవయవి లేకుండా అవయవాలు ఉంటాయి. కొమ్మల్నిబట్టి చెట్టును అనుమానిస్తామని మీరన్నారు. పెంటకుప్ప మీద నూలుపోగు దొరికితే, దానిని చూసి బట్టను అనుమానిస్తారా? అదే హాస్యాస్పదంగా ఉంది, నూలు దారాలు బట్టలో కాక విడిగా ఉండవా?

ఉత్తరపక్షం: ఉంటాయి వాటిని నూలు పోగులని పెంటలోనే విడిచి పెడతాం. కాని, ఒకవస్త్రం పట్టో, ప్రత్తో నిర్ణయించటానికి దాని నూలు పోగుల్ని చూడమా?

అణువాది: పదార్థాలన్నీ అణు పుంజాలే. ఏ నూలుకానూలు ఊడిపోతే వస్త్రంలేనట్లు ఏ అణువుకాఅణువు తొలగిపోతే పదార్థమే లేదుకనుక వస్తువుల్ని అణుపుంజాలుగా భావించాలే గాని ప్రత్యేక వస్తువులుగా భావించకూడదు అవయవాల సంపుటయే గాని అవయవి అంటూ వేరేలేదు.

ఉత్తరపక్షం: కుక్క అణు సముదాయమే. అలాగే బల్ల కూడా అణు సముదాయమే. ఈరెండూ అణు సముదాయాలే అయినప్పటికీ వేర్వేరు ఆకార వికారాలను స్థిరంగా కలిగి ఉన్నందున వేర్వేరు పదార్థాలుగా పరిగణింపబడుతున్నాయి. పదార్థాలను పేర్కొంటున్నప్పుడు వాటికి మూలమైన అణువుల గురించి ఆలోచించవలసిన అవసరం లేదు. అందుకే 'తదసంశయః పూర్వహేతు ప్రసిద్ధత్వాత్' అని చెపుతున్నాము.

చెట్టుకు కొమ్మలు, రెమ్మలు, ఆకులు, వేళ్ళు, మాను అవయవాలు అవన్నీ కలిపి చెట్టు అయింది. చెట్టునే అవయవి అన్నాము.

వీటిల్లో ఏ ఒక్కటీ చెట్టుకాదు అలాగే బట్టలో ఎన్నో నూలుపోగులున్నాయి. అవే దాని అవయవాలు. ఏ నూలుప్రోగూ బట్టకాదు.

అవయవి అనేది సమస్త అవయవాల సమవాయం ( Union ) కనుక అవయవిని గురించి చెప్పేటప్పుడు అవయవాల గురించి వేరుగా చెప్పవలసిన పనిలేదు. బట్టఅంటే నూలుదారం కాదుకగా: నూలుదారాల కలనేత ; ఒకదానికి అనేకమందు ఆశ్రియాశ్రిత సంబంధం ఉండటమే 'వృత్తి' చెట్టుకు కొమ్మలు, రెమ్మలు, ఆకులు, మ్రాను, వేళ్ళు అను వాటితో గల సంబంధాన్నే 'వృత్తి' అంటాము. ఏది నేటియందు తన స్వరూపాన్ని పొందగల్గుతుందో అది వాటికాశ్రియ మవుతుంది. కొమ్మలూ, రెమ్మలూ వగైరా అన్నీ చెట్టునాశ్రియించుకునే ఉన్నాయి. అందుకే చెట్టు వేళ్ళు; చెట్టు కొమ్మలు; చెట్టు మ్రాను- అంటాము కొమ్మలు. రెమ్మలు వంటివన్నీ చెట్టు అనే భావాన్ని ఆశ్రియించుకుని ఉన్నాయి; కనుక అవి ఆశ్రితాలు, వాటికి చెట్టే ఆశ్రియం. ఈ ఆశ్రితాశ్రియ సంబంధాన్నే లోగడ మనం 'సమవాయం' అని చెప్పుకున్నాం.

పూర్వపక్షం: చెట్టుకు సంబంధించిన అవయవాలనన్నిటినీ ఒక్కొక్కటీ తీసివేయండి. అప్పుడు చెట్టంటూ ఉన్నదా? అవయవికి అవయవాలతో ఉండే సంబంధంమే వృత్తి అని మీరంటున్నారు. అవయవాలే గాని అవయవి లేదుగదా!

చెట్టు అనేది దాని కొమ్మలు గాని, రెమ్మలు గాని, వేళ్ళుగాని మ్రానుగాని కాదు అనగా అది తన అవయవాలలో లేదు.

అణుశాస్త్ర దృష్టితో చూద్దాం చెట్టు ఏర్పడిన అణుజాలమంతా చెట్టును నిర్మించగలిగింది అందులో ఏ అణువులోనూ చెట్టులేదు.

అల్ప పరిమాణంలో మ హ త్ప రి మా ణ ం ఇమడగలదా, సంపూర్ణంగా ఉండకపోతే పోతే పోయె- ఏకదేశంగా- అంటే కొంతయినా ఉంటుందా? ఉండదు. ఈ అణువులన్నీ వృక్ష శరీరానికి అవయవాలను కుంటే- ఈ అవయవాలు తప్ప వేరే అవయవి లేదని ఋజువవుతున్నది.

అవయవాలు ఒకచోట, అవయవి వేరొకచోట, ఉండదు గదా.

ఎలా చూసినా అవయవి సిద్ధించటంలేదు.

ఉత్తరపక్షం: చెట్టు అనేది ఉంటేకదా దాని మ్రాను, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, వ్రేళ్ళు, ఊడలు - అంటూ చెప్పటం! అవయవి ముందే ఉంది. కనుకనే దాని అవయవాలను చూస్తున్నాం.

మొత్తంగా అవయవిని పేర్కొనటాన్ని 'కృత్స్న' అంటున్నాం. అందులో ఏదో ఒకభాగాన్ని మాత్రమే పేర్కొనటాన్ని 'ఏకదేశ' మంటున్నాము.

చెట్టు దాని అన్ని అవయవాలలోనూ సంపూర్ణంగా ఉంటుందా? లేక కొంచెం ఉంటుందా?- అన్న ప్రశ్నలు సరియైనవి కావు. కొమ్మలు, రెమ్మలు మున్నగు సమస్త అవయవాల సంపుటినే చెట్టు అంటున్నాము. అది కృత్స్న. ఏ అవయవానికా అవయవం ఏక దేశం.

పూర్వపక్షం: సమస్త అవయవాల సంపుటినే మీరు చెట్టు అంటున్నామన్నారు. అంటే చెట్టు దాని అవయవాలకన్నా భిన్నంకాదు

ఉత్తరపక్షం: చెటు దాని అవయవాలలో దే ని లో నూ ఉండదు. కనుకనే ఆ అవయవాలన్నిటికి వేరువేరు పేర్లున్నాయి వాటిల్లో ఏ ఒక్కదాన్నీ 'చెట్టు' అనరు.

పూర్వపక్షం: వెంట్రుక దేనికది నల్లగా కనపడదు. వెంట్రుకల సమూహమైన జుట్టుమాత్రం కారునల్లగా కనిపిస్తుంది. చీకటిజబ్బున్నవాడికి పైతం కనిపిస్తుంది.

వస్తువులు అణుపుంజాలే. కాదనను. ఏ అణువుకాఅణువు కంటికి కనపడక పోయినా వాటి సమూహమే మనకు ఏకాకారంలో కనిపిస్తుంది. అదే అవయవి ఘటమైనా పటమైనా అంతే. కనుక పరమణు సామూహిక రచనయే 'రూపం' అదే మనకు కనిపిస్తుంది.

ఉత్తరపక్షం: మనకు కనపడటమే ప్రమాణమయితే వస్తువు యొక్క 'రూపం' నిర్దుష్టం కాదు. వస్తు స్వరూపాన్ని నిర్ణయించగలివి ఇంద్రియాలే. వాటి పటుత్వాన్ని బట్టి వస్తువులు కనిపిస్తూ ఉంటాయి. గుడ్డివాడికి ఎదుటనున్న వస్తువే లేదు. రేచీకటి వాటికి రాత్రిళ్ళు వస్తువులే ఉండవు దూరపు వస్తువులు కొందరికి. వస్తువు ఒకటే అయినా మనిషికొకలా కనిపిస్తుంది.

రెండవది: ఇంద్రియాలు స్వవిషయాన్ని అతిక్రమించలేవు. ఒకొక్క ఇంద్రియం ఒకేరకం పని చేస్తుందని మీకు తెలుసు. చూసే కన్ను ఆ వస్తువుయొక్క రూపురేఖా విలాసాలను గ్రహించగలదే గాని దాని, శబ్దాన్ని, వాసననూ, రుచినీ ఘనతనీ వినలేదు. వాసన చూడలేదు, రుచి చూడలేదు; స్పర్శించలేదు. చెవి వినగలదేగాని రుచి చూడలేదు. నాలుక రుచి చూడగలదేగాని వినలేదు; కనలేదు.

ఈ విధంగా అన్ని ఇంద్రియాలకూ నియతశక్తులే ఉన్నాయి. అవికూడా పటుమంద భావాలను కలిగి ఉన్నాయి

భూతద్దం చూసినట్లు కన్ను చూడలేదు; సూక్ష్మదర్శిని చూపి నట్లు కన్ను చూడలేదు కనుచూపు మేరలో వస్తువుల్ని లీలగాచూడ గలిగే

కన్నుకీ, మిన్నుపై ఉన్న చుక్కల్ని సైతం ప్రస్ఫుటంగా చూపించగల దూరదర్శినికీ తేడాలేదా?

కనుక వస్తువుయొక్క రూపాన్ని సూక్ష్మదర్శిని, దూరదర్శిని చూడగలిగినట్లు మామూలు కళ్ళు చూడలేవు.

అందుకే వస్తువులకి సంబంధించినంత వరకూ ఇంద్రియ జ్ఞానం సమగ్రంకాదు.

మరో ముఖ్యవిషయం: ఎంతో కొంత మహత్వం ఉంటేగాని ఏ వస్తువూ మనకంటికి కనబడదు. ఆ వస్తువులో మహత్వం ఉండాలన్న మాట: ఆ మహత్వం ఎంత ఎక్కువగాఉంటే ఆ వస్తువు అంత ఘనంగా మన కంటికి గోచరిస్తుంది. వెంట్రుక మన కంటికి కనిపిస్తున్నదంటే అందులో కొంత మహత్వం ఉన్నదన్నమాట. అపాటి మహత్వంకూడా అణువుల్లో లేదు ఉంటే అదికూడా వెంట్రుకవలె కంటికి కనపడేది. మహత్వం లేనందువల్లనే సూక్ష్మజీవులు (బేక్టీరియా) గాని, అతి సూక్ష్మ జీవులు (వైరస్) గాని మనకంటికి కనిపించవు. మారణాగ్నికి మరణించవు.

మనం ఘటాన్ని చూసినా, పటాన్ని చూసినా మనకు పరమాణువులు కనబడటం లేదు. ఘటమూ, పటమూ మాత్రమే కనబడుతున్నాయి పరమాణువులకు మహత్వం లేకపోవటమే కారణం. కనుక వస్తువులన్నీ అవయవులే.

పూర్వపక్షం: మీ అవయవావయవి ప్రసంగాన్ని అంగీకరించి నట్లయితే అది ప్రళయాన్ని తెస్తుంది.

ప్రతీ వస్తువూ అణుపుంజమే అంటున్నారు. అణువులే ఆ వస్తువులకు అవయవాలంటున్నారు. అవయవాలయిన అణువులకు కూడా అవ

యవాలుంటాయి. అవేవో తెలుసుకోవటం కోసం అణు విచ్ఛేదానికి పూనుకోబోతే ప్రళయమే వస్తుంది. దానితో మూలపదార్థమే నాశనమై పోతుంది.

ఉత్తరపక్షం: 'నప్రళయోణు సద్భావాత్' (౪.౨ ౧౪)- మూల పదార్థం ఎన్నడూ నాశనం కాదు. దానికి కారణం అణువులే. అణువులు ఎన్నడూ నశించవు. అణుపుంజానికే ప్రకృతి అని పేరు. అణువులకు అవయవాలు లేవు. కనుక వాటియందు అవయవ అవయవి భావముండదు ఇదే ప్రకృతికి మూలకారణం. సద్భావమనగా ఉనికి. అణువులతో ఈ సృష్టి నిండి ఉన్నంతకాలమూ "ప్రళయం" జరగదు.

పరంవాత్రుటేః - పరమాణువు కన్నా చిన్నదయిన త్రుటి (Proton) అందులో ఉంది. దానినుండియే పంచమహా భూతోత్పత్తి జరుగుతోందని వేదం చెప్తున్నది.

త్రుటి చుట్టూ త్రసలు (Moving bodies) ఆవరిస్తూ (Cycling) ఉంటాయి వీటినే నేటి శాస్త్రజ్ఞులు ఎలక్ట్రానులని అంటున్నారు. ఎంత ప్రళయం వచ్చినా ఇవి విచ్ఛిన్నంకావు కనుక పంచభూతోత్పత్తి మామూలుగానే జరుగుతుంది

సర్వ శూన్యవాది: 'ఆకాశవ్యతిభేదాత్ తదనుపపత్తిః'- ప్రళయమే వస్తే పరమాణువులుంటాయని మీరు చెపుతున్నారు. అది తప్పు. ఆకాశంలో ఏ పరమాణువులున్నవి? ఆకాశం పదార్థంకాదు. అది పదార్థాలలో, అంతః సమావేష్టితమైఉంది. ఆకాశంలో వ్యతిభిన్న (Connected) మయి ఉన్నదంతా సావయవమే అవుతుంది. అది ప్రళయంలో నశించి తీరతుంది

వస్తువులు నశించవని అంటే మీరు "ఆకాశా సర్వగతత్వావా"

ఆకాశం సర్వగతత్వాన్ని కలిగి ఉన్నదని చెప్పటం తప్పు అవుతుంది. కాని అది తప్పుకాదు. సమస్త పదార్థాలలోనూ ఆకాశం (ఈథర్) ఇమిడి ఉన్నదని వేదమే చెపుతున్నదిగదా? కనుక ఆకాశం పరమాణువులో కూడా ఉంది. పరమాణుగతమయిన ఆకాశంలోనే త్రుటి ( Protone ) చుట్టూ త్రసలు ( Electrons ) పరిభ్రమిస్తూన్నాయి

ఆకాశం వస్తువునందు ఎప్పుడయితే ప్రతిభిన్న ( pierced ) మై ఉన్నదో అది అప్పుడే ఒక్కుమ్మడిగా బ్రద్దలయ్యే గుణాన్ని కలిగి ఉంటుంది. అట్టి గుణాన్ని కలిగి ఉండటాన్నే "వ్యతిభేద" మంటాము. (వ్యతిభేదం = Bursting forth together of simultaneously ) కను కనే అణువు బ్రద్ధలయి ప్రళయాన్ని సృష్టిస్తుంది.

ఉత్తరపక్షం: ప్రతీవస్తువుకీ లోపలా, బయటా అంటూ ఉన్నాయి శక్తి, ప్రాణము, జీవము, ఆత్మ, చైతన్యము వంటివి బయట ఉండేవి కావు. వస్తువు లోపల ఉండేవే. బయటకు కనబడేవి అవయవాలు, అవయవాలతో కూడిన భౌతిక శరీరమూను, అవయవ రహితమయిన పదార్థాలు కూడా బయటకు కనిపిస్తాయి.

శరీరంలో గాని, పదార్థంలో గాని ఉండేవాటిని వ్యవహితా (Internal) వయవాలు అంటాము వెల్లడిగా బయట ఉండేవాటిని "వ్యవధాయక ( External ) అవయవాలంటాము. జీవులకు మాత్రమే ఈ ఆంతర్ బహిరేంద్రియ వ్యాపారం జరుగుతూ ఉంటుంది. వాటికి అవయవాలున్నాయి. కనుక జీవుల్ని కార్య ద్రవ్యాలంటాము.

ఆకాశం ఈ కార్య ద్రవ్యాలందు సమావిష్టమై వాటిని వ్యతిభిన్నం ( Connect ) చేస్తున్నది. అనగా ఈ కార్య ద్రవ్యాలనొకదానినొకటి జత పరుస్తున్నది. జ్ఞాననాడులయొక్క గోళములు ( Globules: వీటినే శాస్త్రం

న్యురోనులంటు ండి) ద్వారా ప్రసరించే వార్తలు ఈ ఆకాశ వ్యతిభిన్నత వల్లనే ఒకదానినుండి మరొకదానికి చేరుతూ చివరికి మెదడుకు అందివ్వ బడుతున్నవి. ఈ విధంగా ఆకాశంచేసే అనుసంధానానికే "వ్యతిభేద" ( Successive Jointing ) మని పేరు

దానిని సరిగా అర్థం చేసుకోకుండా వస్తువులయందు అకాశం తిష్ట వేసుకుని కూర్చుంటుందని (సమావిష్టం) మీరన్నారు. అదితప్పు.

శబ్ద సంయోగ వైభవం వల్లనే ఆకాశం "సర్వగత" మని చెప్ప బడింది.

ఆకాశం శబ్దగతమయినది; శబ్దాలు ఆకాశంలోనే పయనిస్తాయి. శబ్ద సంయోగం కానిచోటు ఆకాశంలో ఎక్కడా లేదు. శబ్దాశ్రియమగు ఆకాశం చేత సర్వమూర్త ద్రవ్యాలు స్పర్శింపబడుతూనే ఉన్నాయి. అందుకే ఆకాశానికి "సర్వగత" మని పేరు వచ్చింది అంతేకాని పదార్థా లలో లోపల తిష్ట వేసుకు కూర్చున్నందుకుకాదు.

ఆకాశ లక్షణమే వేరు, "అవ్యూహా అవిష్టంభవిభుత్వానిచ ఆకాశ ధర్మాః"-

ఒక మహాసముద్ర తరంగం గోడను గుద్ది వెనక్కి మరలింది. అది వ్యూహం ( Hindrance ) . ఆకాశం గోడను గుద్ధి, దానినధిగమించి వెళ్ళి పోతుంది. అది అవ్యూహం.

నది పొర్లిపోకుండా వేసిన గట్టు విష్టంభం. నది దానినతిక్రమించి ప్రవహించదు. ఆకాశం ఈ రకం విష్టంభాలను అతిక్రమించగలదు.

శబ్దాన్ని ఎంతదూరమయినా తీసికెళ్ళే శక్తి, ఎంతదూరంలో ఉన్న వస్తువుతోనయినా కలపగల శక్తి ఆకాశానికుంది. ( కనుకనే రేడియో

శబ్ద తరంగాలు సుదూర తీరాలకు పయనించగలుగుతున్నాయి ) ఆకాశం శబ్దవాహికమే. శబ్ద సంయోగక్రియకు ఆకాశం విభువు ( Commander ) అట్టి ఆకాశంయొక్క సంయోగం మూర్తి మంతములగు ( Having forms) వస్తువులన్నిటియందూ కనిపిస్తుంది. అది వాటిలోనికి చొచ్చుకుపోతుందే గాని స్పర్శించి వెనక్కి తిరగదు. అందుకే ఆకాశం సర్వగతమని అంటు న్నాము

ఆకాశం గతిమంతమగు ద్రవ్యంకాదు. పడవ, నీరు గతిమంత మగు ద్రవ్యాలు. గతిమంతమగు ద్రవ్యము ప్రతిఘాతి ద్రవ్యముచే నెదుర్కొనబడి వ్యూహాన్ని పొందుతుంది.

స్పర్శవంతమగు నీరు గతిగలదగుటచే ప్రవహిస్తుంది. దానికి నావ ప్రతిఘాతమవుతుంది. నావను ఢీకొని నీటితరంగం వెనక్కి మళ్ళుతుంది. అది వ్యూహం. నావను ముందుకు పోకుండా నీరే విరోధిస్తుంది. అది విష్టంభం. తానే వస్తువువల్ల విరోధింపబడుతుందో ఆవస్తువును తాను విరోధించటమే విష్టంభం.

ఈ విష్టంభమూ. ఈ వ్యూహమూ అకాశానికి లేవు పైగా దేనిలో కయినా చొచ్చుకుపోయే విభుత్వం ( Authority ) ఆకాశానికుంది.

పూర్వపక్షం: 'మూర్తిమతాంచ సంస్థాపనోపపత్తే రవయవసద్భా వః'- ఆకాశంలా నిశ్శరీరములు కానివన్నీ వస్తువులు, వాటికి మూర్తి ( Body ) ఉన్నది. మూర్తిమంతాలయిన వస్తువులన్నింటికీ సంస్థానం ( Organisation ) ఉన్నది. సంస్థానం అనగా అవయవాలను కలిగి ఉండటం. కుండ, గాలిపటం మొదలైన వస్తువులన్నీ సావయవములే.

పరమాణువుకూడా వస్తువే. అది ఆకాశంలా అన్నిటిలోనూ వ్యాపించి ఉన్నది. సర్వగతం ( All pervading ) కాదుగదా; దానికీ పరి

చ్ఛిన్న పరిమాణము ( Measurable size ) ఉన్నది. అది కూడా మూర్తియే ( Body ). కనుక పరమాణువు కూడా సావయవి ( Organic body ) అని చెప్పబడుతున్నది.

'సంయోగోపపత్తేశ్చ'

అణుసంయోగం ఉన్నది రెండు పరమాణువులు కలియకుండా ద్వ్యణుకం ( Diatom ) ఉత్పన్నం కావటంలేదు; పరమాణువు సావయవి అయితేనే సంయోగం జరుగుతుంది లేకుంటే జరగదు ఈ సంయోగం ( Union ) వ్యాప్యవృత్తి ( Penetrable character) అనుకుందామా? ఒకపరమాణువు మరొక పరమాణువుతో సంపూర్ణంగా లీనమై సమాన దేశవర్తి ( Occupying t he same place ) కావాలి. అనగా ఒక అణువు ఎంత ప్రదేశాన్ని ఆక్రమించిందో రెండు అణువులు కలిసిన ద్వ్యణుకం (Daitom ) కూడా అంతే ప్రదేశాన్ని ఆక్రమించాలి. ద్వ్యణుకానికి ప్రమి మానం (Volume) పెరగకూడదు. అప్పుడు ద్వ్యణుకం సైతం అణువే అవుతుంది.

అలాకాక రెండు అణువుల సంయోగం అవ్యాప్యవృత్తి (Impen etrable character) కలిగి ఉన్నదనుకుందామా? అణువులు సశరీరులు కావాలి. మూర్తిమంతాలు కావాలి. అప్పుడు ఒకదానిలో ఒకటి లీనం క లేవు.

ఉత్తరపక్షం 'అనవస్థాకారిత్వా దనవస్థా నుపపత్తేశ్చా ప్రతిషేధః, రెండు అణువుల కలయికవల్ల ఏర్పడిన ద్వ్యణుకం రెండు అణువులతో సమాన పరిమాణంగల శరీరాన్ని, బరువునీ కలిగివుండాలి. అలాలేదు కనుక అనవస్థ (Disorganis ation) ఉన్నదనే చెప్పాలి.

అలా అని ఈ అనవస్థ స్పష్టంగా కనిపించటం లేదు. కనుక పర

మాణువుని నిరవయవం అనటాన్ని పూర్తిగా త్రోసిపుచ్చటానికి వీల్లేదు.

పదార్థం ఎక్కడ అవిభాజ్యస్థితికి చేరుకొందో అది పరమాణువు. అది నిరవయవ స్థితి. కనుక పరమాణువుని నిరవయవి అనే చెప్పాలి.

నిజంగా నిరవయవి అయినట్లయితే ద్వ్యణుకం (Diatom) ఏర్పడేందుకు అవకాశం లేదు. కనుక పరమాణువు సావయవి కావాలి.

నిజానికి కొంత ప్రదేశాన్ని ఆక్రమించే ద్రవ్యం అంతే ప్రదేశాన్ని ఆక్రమించే మరో ద్రవ్యంతో సంయోగం చెందినప్పుడు ఆ సంయోగన అవ్యాప్య వృత్తి (Impenetrable) అవుతుంది. నిష్ప్రదేశవంతములైన పరమాణువుల సంయోగం అలాంటిది కాదు. అది అవ్యాప్యవృత్తి (Penetrable) అవుతుంది. కాంతిలో కాంతి కలిసిపోయినట్లు అణువులో అణువు కలిసిపోతుంది.

ద్వ్యణుకంలో కూడా అలా జరగాలి. జరిగితే ద్వ్యణుకం పరమాణువే అవుతుంది. ఇక్కడ అలా జరగటంలేదు. ఇది వ్యాప్యవృత్తి కల్గినట్లే కనిపిస్తుంది. ఒకదానిలో ఒకటి చాలావరకూ లీనమవుతాయి. కొంత వరకూ లీనం కావు. ఆమేరకే అది ద్వ్యణుకమయింది. మూర్తిమంతములయిన ద్రవ్యాలు అసలు విలీనంకావు. కనుకనే పరమాణువుకు వ్యాప్య వృత్తి ఉన్నట్లే అవ్యాప్యవృత్తి కూడా ఉన్నది.

భౌతిక మిశ్రమాన్ని సంయోగమనీ, రసాయనిక మిశ్రమాన్ని సమవాయమనీ అంటారు. ఒకదానితో ఒకటి కలిసి ఉండటం సంయోగమయితే ఒకదానిలో ఒకటి లీనమయి పోవటం సమవాయమవుతుంది.

కుండలో రేగిపళ్ళున్నాయనుకోండి కుండ (ఆక్రమిత) ప్రదేశము రేగుపళ్ళ కలయికవల్ల ఏమాత్రం పెరగలేదు. కనుక కుండకీ రేగుపళ్ళకీ సమానదేశత (Place of occupation) ఉన్నది.

రెండు తట్టల మట్టి ఒక తట్ట ఆక్రమించే ప్రదేశంకన్నా రెట్టింపు ప్రదేశాన్ని ఆక్రమిస్తుంది. ఇక్కడ దేశవిరోధం ఉంది.

కుండలో రేగుపళ్ళవిషయంలో దేశవిరోధం లేదు.

ఒక తట్టెడు మట్టి రెండవ తట్టెడు మట్టితో కలిపినప్పుడు తొలి తట్ట మట్టికి ప్రతిమ (Dimension) చెదిరిపోతుంది. దీనినే ప్రతిమా విరోధమంటాము. రెండు అణువులు కలపిన ద్వణుకంలో ఈరకం ప్రతిమా విరోధం కనపడటం లేదు.

ద్వణుకంలోని పరమాణువులు సమవేతములు (Inherent) కావు. కుండలో రేగుపండువలె ఒకదానికో ఒకటి యిమిడి ఉంటాయి. వాటి ప్రతిమ (Measurements) ఏమాత్రం చెడవు.

పరమాణు సంయోగం అవ్యాప్యవృత్తి (Impentrable) ఐనా ఆది సావయవం కావలసిన ఆవసరం లేదు. చీకటికీ, కాంతికీ అవయవాలు లేవు. అయినా అవి కలిసిపోతూనే ఉన్నాయి. అది అవ్యాప్య వృత్తియే.

అనంతాకాశానికి దిక్కులు కల్పించి మనం చెప్పుకుంటున్నట్లుగా పరమాణువుకు మనం అవయవాలను కల్పించి సంయోగాన్ని చెప్పుకున్నా తప్పుకాదు *

---

*పరమాణువులు అవిచ్ఛిన్నములని గౌతమసూక్తికి వ్యాఖ్యాతయగు వాత్స్యాయను డన్నాడు. పరమాణువు వేరొక పరమాణువుతో కలిసినప్పుడు ప్రదేశం పెరగదన్నాడు ప్రిధిమాకం (Volume) మారదన్నాడు. కనుక రెండు పరమాణువులలో ఏర్పడిన ద్వణుకములో- ఆ పరమాణువులు సంయోగ సంబంధాన్ని కలిగి ఉన్నవో, సమవాయ సంబంధాన్ని కలిగి ఉన్నవో చెప్పలేమన్నాడు. రెండూ ఉన్నట్లు కనిపిస్తా యన్నాడు. కారణం

విజ్ఞానవాది : నూలుపోగుల్ని తీసివేస్తే బట్ట ఉంటుందా? బుద్ధితో కాస్త ఆలోచిద్దాం. అలాగే వస్తువుల (భావాల) అణుజాలాన్ని తొలగించినట్లయితే వస్తువులు ఉంటాయా? స్థూలపదార్థాలనీ, సూక్ష్మ పదార్థాలనీ మనం విభజించి చెప్పుకుంటూ ఉంటాము. వాటి అణు స్వరూపాన్ని ఆలోచించి చూసినట్లయితే స్థూలమూ, సూక్ష్మమూ మాట అటుంచి అసలు వస్తువే లేదని చెప్పవలసి ఉంటుంది. అవి ఉన్నట్లు మనకు కలిగిన జ్ఞానమంతా మిథ్యయే అవుతుంది.

ఉత్తరపక్షం : ఇంతకీ బుద్ధి యదార్థమా? యదార్థం కాదా?- అని

---

అణువులో ఎక్కువభాగం శూన్యప్రదేశమై ఉండటం, ద్రవ్యం చాలా కొద్దిగా ఉండటమేనన్నాడు.

రూథర్‌ఫర్డ్ అను శాస్త్రజ్ఞుడు 'పరమాణువులో ధన విద్యుత్‌తో ఆవహింపబడిన కేంద్రకం ఉన్నది. పరమాణువులో లక్షవవంతు మాత్రమే ఈ కేంద్రకం ఉంటుంది. కేంద్రకం చుట్టూ ఉన్న శూన్య ప్రదేశం అణువులో 99.999 వంతులున్నది. ఆ కేంద్రకం చుట్టూ ఋణవిద్యుదావేశితాలయిన ఎలక్ట్రానులు (తప్పులు) తిరుగుతున్నాయి. కేంద్రకంలో ధన విద్యుతావేశితాలయిన ప్రోటాన్‌లు, తటస్థాలయిన న్యూట్రాన్లూ ఉన్నాయి. పరమాణువులోని ఎలక్ట్రానులసంఖ్య, కేంద్రకంలోని ప్రోటాను (తృటులు)ల సంఖ్యకు సమానం. ప్రోటానుల, న్యూట్రానుల మొత్తం సంఖ్య పరమాణు ద్రవ్యరాశికి సమానం.

దీనిని బట్టి మన కంటికి కనపడే ఏ వస్తువులోనయినా, ఏమనిషిలోనయిన 99.999 వంతులు శూన్యప్రదేశమే అనిపిస్తోంది. అదేకదా ఆకాశం అని చెప్పబడింది.

ముందు ఆలోచించండి. బుద్ధి యదార్ధమయితే వస్తువులన్నీ యదార్ధాలే. బుద్ధి యదార్ధం కాకపోతే యదార్ధం కాని వస్తువుల్ని ఎలా గ్రహిస్తుంది?

బుద్ధితో చేసే ఆలోచనకు అవధి (Limit) ఉందా? ఉన్నది. నిర్ణయమే ఆ అవధి, వస్తువుయొక్క వివేచనకు పరమాణువులు అవధి కాకపోతే బుద్ధిమాత్రం ఎలా వివేచిస్తుంది?

అవధిగలవన్నీ స్వస్వరూపంలోనే ఉంటాయి. స్వస్వరూపంలో ఉన్నవాటిని లేవనుకోవటం తప్పు.

బాహ్యాకారం లేకున్నా ఉన్నట్లు గోచరించే వస్తువులు మిధ్యయే అనుకొంటూ విజ్ఞాన మొక్కటే సత్యం అనుకోకూడదు.

అణువులు ఏవస్తువును ఏర్పరచి ఉన్నాయో అది వస్తువే. మిధ్య కాదు.

పైగా వస్తువులు మన కళ్ళకు ప్రత్యక్షంగా కనబడుతూనే ఉన్నాయి వాటిని మిధ్య అనటం విజ్ఞానం కాదు.

పదార్ధాలు ఎంత అణుసంచయమని విజ్ఞాన శాస్త్రజ్ఞులు చెప్పినప్పటికి వాటి స్థూలరూపాన్ని అంగీకరించవలసిందే. అలా అంగీకరించని పక్షంలో వారు విజ్ఞానులేకాదు, ప్రత్యక్ష వస్తువునే చూడలేరన్నమాట!

పూర్వపక్షం: స్వప్నంలో ఏ వస్తువులూ లేకపోయినా అవి ఉన్నట్లే కనపడతాయి. అలాగే ఈ ప్రమాణాలు, ప్రమేయాలూ కనబడుతున్నాయేగాని అవి వాస్తవం కాదు.

ఇంద్రజాలికుడు నిర్మించిన మహానగరాన్ని చూసి, ఎండమావుల్ని చూసి ఇలాగే మనం భ్రమపడతాం కదా!

ఉత్తరపక్షం: ఎండమావుల్లో నీరు ఉండదు. అందులో దిగితే మునగం. చెరువులో నీరు ఉంటుంది అందులో దిగితే మునిగిపోతాం.

మాయానగరంలో ఇళ్ళకు గుద్దుకున్నా తల పగలదు. నిజనగరంలో తల గోడకు తగిలితే పగులుతుంది ఆదే మాయకీ, ప్రత్యక్షానికీ తేడా.

నిజవస్తువు యొక్క వాసనయే స్వప్నంలో కనిపిస్తోంది. నిజ వస్తువు లేకుండా అది కనిపించదు. పోనీ అనాది వాసనవల్ల నిజ వస్తువు కూడా స్వప్నవస్తువులాగే కనిపిస్తోందంటున్నారా? ఎప్పుడో ఒకప్పుడు నిజ వస్తువు ఉన్నట్లే గదా! వస్తువులేకుండా వాసనలేదు. కావి నిజంకాదు. వాసనయే అనుకుని నూతిలో దూకితే చస్తామా లేదా? స్వప్నంలో నూతిలో దూకినా చావం.

స్మృతియొక్క సంకల్పమే స్వప్నం. పూర్వం తె లి సి న విష యాన్ని జ్ఞాపకం తెచ్చుకోవటమే స్మృతి. దానిని తిరిగి చింతించటం సంకల్పం. ఈ సంకల్పం అపస్మార సమయంలో జరుగుతున్నది. గనుక తికమకలలో కనిపిస్తుంది. మీ తల నరకబడుటను మీ స్వప్నంలో చూస్తారు. అది నిజ జీవితంలో జరగలేదు. తల గురించీ అది ఎవరిదో నరకబడటం గురించీ మీరు విని ఉంటారు, వేరువేరుగా తెలిసిన విషయాలను స్వప్నాలు అసందర్భంగా కూర్చి మీకు అందిస్తాయి. అం దు కే స్వప్నం వేరు: వాస్తవం వేరు.

పరమాణు పుంజానికి మూర్తిమత్వం వహించిన ఒక శరీరం ఉంది. అదే వస్తువు.

స్వప్నంలో మనకు భ్రమ కలిగినట్లుగానే, బాహ్య జగత్తులోని విషయాలయందు కూడా మనకు మిధ్యాజ్ఞానం కలుగుతున్నది. అంతవరకే మీతో ఏకీభవిస్తాము.

మెలకువ రాగానే స్వప్నంలో జరిగిన విషయాలన్నీ న శిం చి పోతాయి. అలాగే వస్తువుల తత్వజ్ఞానం కలిగిన వెంటనే వాటికి సంబం

ధించిన మిథ్యాజ్ఞానం కూడా నశించిపోతుంది. ఈ రెండూ వెలుతురూ, చీకటిలాంటివి.

యదార్థజ్ఞాన సంపాదనకు బుద్ధి ఒక్కటే నిమిత్తం. తత్త్వాన్ని బట్టి ఆ బుద్ధి రెండు రకాలుగా ఉన్నది. ఒకటి గౌణబుద్ధి (Biased). వస్తువుల యొక్క గుణాగుణాలను గ్రహించి రాగ ద్వేషాలను పొందుతున్నది. వస్తుతత్త్వమును నిర్లిప్తంగా గ్రహించగల బుద్ధి (Inductive) ఉత్కృష్టమైనది.

ఇది సమాధి (Deep meditation) ని అభ్యసించటం వల్ల లభిస్తుంది. బుద్ధినీ, ఇంద్రియజ్ఞానాన్ని ప్రోగుచేసుకునే ఆత్మనూ కేంద్రీకరించి (అధి = మనస్సు: + ఆత్మ = Experience )ఆధ్యాత్మ సాక్షాత్కారం చేసుకుని వస్తుతత్త్వాన్ని గ్రహించటమే సమాధి అని చెప్పబడుతున్నది.

పూర్వపక్షం ; అర్థవిశేషాల (Material benefits) ప్రాబల్యం ఎక్కువగా ఉన్నది. ధన సంపాదనా తత్పరత గల ఈ లోకానికి వస్తుతత్త్వచింతన కూడానా?

ఒకవంక ఆకలీ, దప్పీ ఏడిపిస్తూ ఉంటాయి. వాటిని తీర్చుకునే అవకాశాలు కూడా తక్కువ. వాటిని సంపాదించుకోవటానికే నానా అవస్థలూ అవుతుంటే మీరు చెప్పిన 'సమాధి' ఎవడిక్కావాలి? మీరు చెప్పినట్లు మనస్సునూ ఆత్మనూ సమాధిలో పెట్టుకు కూర్చుంటే ఇక శరీరం కూడా నిజమైన సమాధిలోకి వెళ్ళవలసి వస్తుంది.

ఉత్తరపక్షం: అవును. అందుకే అది అందరికీ లభించదు ఏదో అదృష్ట సంబంధం వల్ల కొందరికే అది సాధ్యమవుతోంది. వారు మహర్షులయ్యారు. మహర్షులకు ఆకలీ, దప్పీ కనిపించవు

పూర్వపక్షం: ఏదో అదృష్ట సంబంధంవల్ల స మా ధి కలుగు తుందని చెప్పారు గదా? అలాంటిదే ఏదో అదృష్ట సంబంధంవల్ల దుఃఖం కూడా కలుగుతున్నదని ఏందుకనుకోకూడదు? అది పూర్వజన్మ కర్మఫలం కావచ్చు గదా.

ఉత్తరపక్షం: కారణం ఉన్నంతసేపే కార్యం జరుగుతూ ఉంటుంది. కారణం పూర్వజన్మ కర్మయే అయితే ఇప్పుడు దుఃఖం కల గదు నిన్న ఉదయం కలిగిన కామానికి ఈ రాత్రి ఎవడూ రమించలేడు. ఈ రాత్రి రమించాలంటే ఈ రాత్రి కామం కలగాలి.

మనస్సు, ఆత్మ సంసారికం ( **Indulged in material world** ) కాకుండా నియమించుకోవటమే కదా మోక్షం-దీనికి అదృష్టం నిమిత్తం కాదు. బుద్ధి పూర్వకమయిన ప్రయత్నమే నిమిత్తం.
కాదు. బుద్ధి పూర్వకమయిన ప్రయత్నమే నిమిత్తం.

అందుకే మోక్షంలో పూర్వకర్మ ఫలానుబంధం ఉండదు.

'హృదయ గ్రంధిని భేదించు; సమస్త సంశయాలనూ ఛేదించు. అన్ని పనుల్నీ విడిచిపెట్టు. ప్రశస్త విషయాలవైపు దృష్టిని మరల్చు, అంటున్నది ముండకోపనిషత్తు.

సమాధికోసం యమనియమాదులు కావాలి. అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం అనేవి యమాలు. నియమాదివి కావాలి, శౌచం, సంతోషం తపస్సు స్వాధ్యాయం, ఈశ్వర ప్రణిధానం అనేవి నియమాలు. ఉచ్ఛ్వాసనిశ్వాసాలను నియమించుకునే ప్రాణాయామం చెయ్యి. సుఖాసనంమీదకూర్చో. ఇంద్రియాలు పనిచేయకుండా నిరోధించు. నువ్వు ఆలోచించదలచిన విషయంపై చిత్తాన్నినిలుపు (ధారణ). అప్పుడు జ్ఞానం తైలధారవలె తెంపు లేకుండా లభిస్తుంది. అదే ధ్యానం.

ధ్యానమే జ్ఞానగ్రహణాభ్యాసం. ఆయాశాస్త్రాలలో నిష్ణాతులతో చర్చించటం అవసరం.

అసూయలేని గురువులు, శిష్యులు, సహాధ్యాయులు, శిష్టులు, శ్రేయస్కాములు అనువారితో చేరి, వారితో సంవాదం పెట్టుకో.

నీకు ప్రతిపక్షం లేకపోయినా, తత్వజ్ఞానాన్ని మధించే ప్రయోజనం కోసం యిందుకు తోడ్పడమని ఎవరినైనా యాచించు.

మొక్కల్ని రక్షించటానికి ముళ్ళకంచెలవలె తత్వ నిశ్చయార్థం కోసం జల్పాన్నీ, వితండాన్ని ప్రయోగించు

ఈ జల్ప. వితండాలద్వారా విగ్రహమెవర్చి ( Analysis ), కథను (వాదాన్ని) నడిపించాలి.

# త్రయోదశ ఆహ్నికం

## జాతి

ఇక జాతిగురించి చెప్పుకుందాం.

సాధర్మ్యసమ, వైధర్మ్యసమ, ఉత్కర్ష, అపకర్ష, వర్ణ్య, అవర్ణ్య, వికల్ప, సాధ్య, ప్రాప్తి, అప్రాప్తి, ప్రసంగ, ప్రతిదృష్టాంత, అనుత్పత్తి, సంశయ, ప్రకరణ, హేతు, అర్థాపత్తి, అవిశేష, ఉపపత్తి, ఉపలబ్ధి, అనుపలబ్ధి, నిత్య, అనిత్య, కార్యసమాలని మొత్తం ఇరవై నాలుగు భేదాలు "జాతి"లో కనిపిస్తాయి.

వాది సాధించదలచిన ధర్మాన్ని స్థాపించటం కోసం హేతువును ప్రయోగిస్తే, దానిని ఖండించటం కోసం ప్రతివాది అసమర్థ హేతువును ప్రయోగించాడనుకోండి. ఇట్టి అసమర్థ హేతువునే 'జాతి' (Self Confuting Reply) * అంటాము.

ఈసారి దాని ఇరవైనాలుగు భేదాలకు ఉదాహరణలు చెప్పుకుందాం.

1. సాధర్మ్యసమం: 'ఏది ప్రయత్నంవల్ల పుడుతుందో అది ప్రయత్న జన్యం. ఏది ప్రయత్నజన్యమో అది అనిత్యం. శబ్దం, ఘటం - ఈ రెండూ ప్రయత్నజన్యాలే. కనుక అనిత్యాలు.'

సాధర్మ్యమనగా రెండు వస్తువులకు సమానధర్మాలను ఉదహరించి వాటిని సరిపోల్చి తన సిద్ధాంతాన్ని బలపరుచుకోవటం. ఇక్కడ ప్రయత్నజన్యతే ప్రమాణం. కుండకీ, శబ్దానికీ సమాన ధర్మం.

* Self-Confuting reply founded merely or dissimilarity.

వాదం పై విధంగా ఉంటుంది. అది తిరుగులేనిది "జాతి" అందుకు భిన్నంగా ఉంటుంది. ఇందులో వాది తీసుకునే ఉదాహరణలు చాలా బలహీనంగా ఉంటాయి.

'శబ్దం నిత్యమే. దానికి స్పర్శగుణం లేదు ఏది స్పర్శింపరానిదో అదనిత్యం. ఆత్మ స్పర్శింపరానిదేకదా! అది నిత్యం కాదా?,

అని అస్పర్శత్వాన్ని సమాన ధర్మంగా చేసుకుని వాది పై విధంగా వాదించాడనుకోండి. ఇట స్పర్శగుణమే సాధర్మ్యం.

ఎలాగో చెపుతా.

వెంటనే ప్రతివాది పైవాదాన్ని ఈకింది విధంగా ఖండించివేస్తాడు

"శబ్దం నిత్యమయినట్లయితే అది చెవి దగ్గర అనునిత్యమూ మోగుతూనే ఉండాలి. అలా మోగటం లేదు. కనుక అనిత్యం. శబ్దం చెవిని స్పర్శిస్తుంది. కనుక అస్పర్శకమూ కాదు. జ్ఞానేంద్రియాలున్నంత వరకూ ఆత్మ నిత్యమే. ఏదో ఒక జ్ఞానేంద్రియం ఎప్పుడూ పనిచేస్తూనే ఉంటుంది కనుక. అందుకే శబ్దానికీ, ఆత్మకీ పోలికేలేదు"

ఇట్లు రెండు వస్తువుల సమానధర్మాన్ని ప్రమాణంగా తీసుకుని ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించినప్పుడు. అదే సమాధర్మంతో ఆ సిద్ధాంతాన్ని ఖండించటం సాధర్మ్యజాతి అవుతుంది.

2. వైధర్మ్యం: గోవుకు సంబంధించిన భావన వల్లనే గోవు సిద్ధిస్తున్నది. గోత్వం నిత్యమే కదా! శబ్దానికి సంబంధించిన భావం వల్లనే అర్థం సిద్ధిస్తున్నది. కనుక శబ్దానికి అర్థసంబంధంవల్ల శబ్దమూ నిత్యమే'

ఇక్కడ శబ్దానికి రెండు అర్థాలున్నాయి ఒకటి ధ్వని ( Sound ) ఇది సామాన్యర్థం, రెండవది పద ( Word ) ఇది విశేషార్థం గోత్వం భావన ( Image ) గోవు వాస్తవం ( Reality ) ఈనాలుగు వైదర్మ్యాలను తీసుకుని వాది ఇక్కడ జాతిని ప్రయోగించాడు. అది వాదానికి నిలబడదు

ఎలాగో చూడండి.

'గోత్వం భావనయే గాని గోవుకాదు. అనగా యదార్థం కాదు. గోవులే లేని దేశంలో గోత్వం లేదు. కనుక అది అనిత్యం. గోవులుం చేనే గోత్వం సిద్ధిస్తుంది. ధ్వన్యాత్మకమైన శబ్దం అనిత్యమే. అర్థ వంతమైన పదం శబ్దమైనప్పుడు అర్థం నిత్యమేగాని శబ్దం నిత్యం కాదు. కనక గోత్వమూ, శబ్దమూ అనిత్యాలేగాని నిత్యం కావు.

శబ్దానికి రెండు అర్థాలున్నాయి. వాది ఊహించిన అర్థానికి భిన్న మైన అర్థాన్ని తీసుకుని జాతివాది వాదిని దెబ్బతీయాలనుకుని తాను దెబ్బ తిన్నాడు. జాతివాది వాడిన శబ్దంయొక్క నానార్థత, వ్యభిచారదోషానికి లోనైంది.

జాతిషట్కం : వాది ఏ పరమార్థాన్ని సాధించదలిచాడో అది సాధ్యం. దానికే పక్షమని కూడా పేరు. అతను ప్రస్తావించిన ఉదాహ రణమే దృష్టాంతము. వీటికి వేరువేరు ధర్మాలు వికల్పింపబడటం వల్ల ఆరు జాతి భేదాలు ఏర్పడుతున్నాయి. అందులో....

1. ఉత్కర్షం- ఉ॥ శబ్దం అనిత్యం (పక్షం). ప్రయత్నజన్యమగుట వలన (హేతువు). ఘటమువలె(దృష్టాంతము). అనిత్యత్వము (సాధ్యం).

శబ్దం అనిత్యమనే వాదాన్ని సాధించుకోవడం కోసం కుండను ఉదాహరణగా చెప్పి, శబ్దం అనిత్యమేనని సాధించటం పక్షం.

కుండను నిర్మించాలంటే కొంత ప్రయత్నం అవసరం. అలాగే శబ్దాన్ని సృష్టించాలన్నా కొంత ప్రయత్నం అవసరం. ఈ రెండూ ప్రయత్నం వల్ల సాధింపబడుతున్నాయి. ప్రయత్నం వల్ల సాధింప

బడిన కుండ పగిలిపోయి మట్టిలో కలిసిపోతుంది. అలాగే ప్రయత్నం వల్ల సృష్టింపబడిన శబ్దం కూడా నశించిపోతుంది. కనుక శబ్దం కుండ లాగే అనిత్యమైనది -ఇదీ పక్షానికి తాత్పర్యం.

దానికి ఉత్కర్షజాతి ప్రతివాదం ఎలా ఉంటుందో చెప్పుకుందాం.

'ప్రయత్నజన్యమవటం చేత కుండలాగ శ బ్ద ం అనిత్యమని మీరంటున్నారు. బాగానేఉంది. శబ్దానికికూడా కుండలాంటి రూపం ఉండాలి కదా ! రూపం లేదుగనుక శబ్దం అనిత్యం కావచ్చు. రూపం ఉన్నది అనిత్యమని ఎలా అనగలరు ? కుండ పెంకులు కనపడటం లేదా?'

4, అపకర్షం - పక్షంలో ఉండే దృష్టాంతానికి గల మరో ధర్మాన్ని తీసుకుని పక్షాన్ని దెబ్బతీయటం అపకర్షజాతివాదం.

'కుండవలె ప్రయత్నజన్యమవటం చేత శబ్దం అనిత్యమని మీ రన్నారు. కుండవలె, ప్రయత్నజన్యమవటంవల్ల, శబ్దం అశ్రావణం అని అనుకోవచ్చా ?'

అనగా కుండ. శబ్దమూ ప్రయత్నం వల్లనే జనిస్తాయని మీర న్నారు. శబ్దం వినబడుతుంది. కుండ కనబడుతుంది కనబడుతున్న కుండ వినబడటం లేదు. కనుక కుండలాగశబ్దంకూడా వినపడదంటారు. అంతేనా?

5. వర్ణ్యం - దృష్టాంతానికి పక్షధర్మాన్ని ఆపాదించటం.

ఉ॥ ప్రయత్నజన్యతాసామ్యం వల్ల కుండ, శబ్దమూ అనిత్య మయితే మీ పక్షంలోనే కుండ అనిత్యమని ఉండాలి మీరలా అనలేదు. కుండవలె అన్నారు. శబ్దం కుండలాగ ఉందంటారా ?

6. అవర్ణ్యం - పక్షమున దృష్టాంత ధర్మాపాదనం. కు ం డ లా గ శబ్దం కూడా అనిత్యమని మీరంటున్నారు, కుండ నిన్న ఉన్నది; నేడు

ఉంటున్నది; రేపు ఉంటుంది. అందులో అనిత్యత్వం కూడా ప్రయత్న సాధ్యమే. కుండను మరెవరో వచ్చి పగలగొట్టాలి. శబ్దాన్నికూడా మరెవరో వచ్చి పగలగొట్టాలికదా: దానిని మీరు వర్ణించలేదు. మీ దృష్టాంతంలో మీరు వర్ణించని విషయంకూడా సాధ్యమయ్యే ఉంది. కనుక కుండ అనిత్యత్వం సందిగ్ధమే అవుతున్నది. శబ్దంయొక్క అనిత్యత్వం సందిగ్ధం కాదు. శబ్ద ప్రయత్నాన్ని ఆపివేస్తే అది ఆగిపోతుంది. కనుక మీవాదం తప్పు.

7. వికల్పం - 'మీరు కుండనీ, శబ్దాన్నీ పోల్చారు. కుండ స్పర్శకు గట్టిగా వుంటుంది దూది మెత్తగా వుంటుంది. శబ్దం స్పర్శకు లభించేది కాదు. ఈ విధంగా కుండకీ శబ్దానికీ ధర్మాలలో తేడా వున్నది గనుక అనిత్యత్వంలోకూడా తేడా వుంటుంది. శబ్దం నిత్యత్వం కన్నా కుండ నిత్యత్వం ఎక్కువే కదా? ఈ రెంటికీ పోలికే లేదు'

8 సాధ్యసమం - 'ఘటం శబ్దం వంటిదయితే శబ్దం ఘటం వంటిది. ఘటంతో శబ్దం చేయవచ్చుగాని, శబ్దంతో నీళ్ళు తేలేము. కనుక ఈ రెండూ ఒకే విధమయిన సాధ్య సమత్వాన్ని కలిగిలేవు.'

ఉత్తరపక్షం : కొద్దిగా సమానధర్మం ఉన్నందువల్ల ఉపసంహారం Comdemn) చేయటం మంచిదికాదు. వస్తువుల ధర్మభేదం ఉండటం తప్పుకాదు.

ప్రయత్నంతో పుట్టించగలిగేవి ఏవి అయినా- కుండగాని శబ్దంగాని- అనిత్యమే. మా వాదంలో "ప్రయత్నజన్యత్వం" అనేది ఒక్కటే ప్రధానం రూపంగాని, కాఠిన్యమృదుత్వాలుగాని ప్రధానం కాదు.

1 ప్రయత్నజన్యమైనది అనిత్యమైనట్లు ప్రయత్నజన్యమైన వన్నీ రూపువంతం కావు. కుండ రూపవంతమయింది శబ్దం రూపరహిత

మైనది.

2 కుండను దూరంగా వుంచితే అందులోంచి శబ్దం వినపడదు, శబ్దాన్ని ధ్వంసంచేస్తే తప్ప వినబడకుండా వుండదు.

3. కుండలు పగిలిపోతున్నాయి. అందువల్ల అవి అనిత్యమని అందరికీతెలుసు. శబ్దాలు పగిలిపోవటం లేదు. కనుక నిత్యమా, అనిత్యమా అన్నసందేహం కలుగుతోంది. అలాగే వాది ప్రతివాదులకు ఏకాభిప్రాయం కలగనప్పుడూ సందేహం కలుగుతుంది. శబ్దం వి ష య మే సందేహం

4 ప్రయత్నజన్యములేవీ నిత్య కావు కుండలు ప్ర య త్నం మీద సృష్టింపబడినవే కదా!

5. సమానధర్మ మున్నంత మాత్రాన అన్నీ ఒక్కలాగే ఉండాలని గాని, వేర్వేరు ధర్మాలు ఉండకూడదని గానీ అనుకోకూడదు. ఉప్పూ. కర్పూరమూ ఒక్కలా ఉంటాయని అంటే అన్ని ఉప్పు ధర్మాలు. కర్పూరంలోకూడా వుంటాయని అర్థంకాదు. అలా వుంటే ఉప్పుతో మంగళ హారతిని యిచ్చి, కర్పూరాన్ని కూరల్లో వేసుకోవాలి

ఒక వస్తువుయొక్క ధర్మం మరో వస్తువునందు ఆరోపించబడటాన్ని "అతిదేశం" (Assimilation) అంటాము. అప్పుడే దృష్టాంతం పుడుతుంది. కాకియొక్క నల్లదనం కోకిలలో ఆరోపించబడితేనే కాకి కోకిలలా ఉన్నదని చెపుతాము.

9, 10. ప్రాప్తి, అప్రాప్తి-హేతువు సాధ్యాన్ని చేరి సాధించిందా? చేరితే అది కూడా సాధ్యమే అయిపోతుంది గదా!

ఉ॥ శబ్దము అనిత్యము: ప్రయత్నజన్యమగుట వలన- అను

వాక్యంలో 'ప్రియత్నజన్యమగుట' అనేది హేతువు. శబ్దం సాధ్యం. ఈహేతువు శబ్దంలో చేరిపోవటంవల్ల అది అనిత్యమయిందా? (ప్రాప్తి)

ఈ హేతువు శబ్దంలో చేరకపోయినా శబ్దం అనిత్యమే అయిందా? (అప్రాప్తి)

అప్పుడు హేతువుయొక్క ప్రయోజనం ఏమిటి? అదివిరర్థకమై నట్లేకదా! విరర్ధకమైన మీ హేతువు ఈ విధంగా తొలగింపబడిన పక్షంలో శబ్దం అనిత్యమను మీవాదం నిర్హేతుకమేకదా!—అని జాతివాదం.

ఉత్తరపక్షం : దండం చేతితో పట్టుకుంటేగాని, కుండ తయారు కాదు. దండం, చక్రం, మట్టి ఈ మూడూ ఉంటేనే కుండ తయారవు తుంది. వాదానికి హేతువు దండంలాంటిది. బుద్ధి చక్రంలాంటిది. విష యమే మట్టి.

11—12, ప్రసంగం-ప్రతిదృష్టాంతం: శబ్దంలో అనిత్యత్వం సాధ్య మని రుజువు చేయుటకుగాను మీరు కుండలోని అనిత్యత్వాన్ని దృష్టాం తంగా తీసుకున్నారు. కుండలో అనిత్యత్వం ఉన్నదని ముందుగా మీరు రుజువుచేయాలికదా! దానికి మీరు ప్రమాణం చెప్పలేదు. చెప్పారను కోండి—మళ్ళీదానికి ప్రమాణం చెప్పాలి ఈవిధంగా అనవస్థ (Disorder) ను సృష్టించటం ప్రసంగం.

"అయ్యా, మీరు శబ్దం అనిత్యం అని చెప్పటానికి కుండను ఉదా హరణగా తీసుకున్నారు. ఆకాశాన్ని ఉదాహరణగా తీసుకోండి. ఆకాశం శబ్దవంతమేకదా! మరి ఆకాశం నిత్యంకాదా? కనుక శబ్దమూ నిత్యమే." ఇది ప్రతిదృష్టాంతం.

ఉత్తరపక్షం : వస్తువును చూడటానికి దీపాన్ని తీసుకుంటాము. అలాగే ఒకవిషయాన్ని రుజువు చేయటానికి దృష్టాంతాన్ని తీసుకుంటాము.

ఆ దీపాన్ని చూడటానికి మరోదీపం తెచ్చుకోము. అలాగే ఒక దృష్టాంతాన్ని తెలియజెప్పటానికి మరో దృష్టాంతాన్ని తెచ్చుకోము. అలా తెచ్చుకున్నట్లయితే తొలిపక్షం ఎగిరిపోతుంది. ఉ॥ పాలు తెల్లగా కొంగలావుంటాయి అంటే, కొంగ ఎలా ఉంటుందన్నాట్ట మీవంటివాడే. కొంగ కొంకికర్రలా ఉంటుందని మరో దృష్టాంతంచెపితే, పాలు కొంకికర్రలా ఉంటాయని ఆ ప్రబుద్ధుడు అర్థం చేసుకొంటాడు.

వాదిచెప్పిన దృష్టాంతానికి బదులు మరో దృష్టాంతాన్ని చెప్పినప్పటికీ వాది ఆ దృష్టాంతాన్ని ఏ ప్రయోజనాన్ని ఆశించి ప్రయోగించాడో ఆ ప్రయోజనం పోకూడదు దృష్టాంతం సాధకమేగాని సాధ్యంకాదు.

13. అనుత్పత్తి-"అవును ప్రయత్నంవల్ల పుడుతుంది శబ్దం. ప్రయత్నించక పూర్వం శబ్దమే లేదుగదా ! అప్పుడు దానికి అనిత్యత్వమే లేదు. మనప్రయత్నం వల్లనే దానికి అనిత్యత్వం వచ్చింది. కనుక దోషం ప్రయత్నంలోనేగాని శబ్దంలోలేదు.

ఉత్తరపక్షం : శబ్దం పుట్టినతర్వాతనే అనిత్యత్వం సాధ్యం అవుతుంది. శబ్దమే లేనప్పుడు అది నిత్యమా కాదా అన్న ప్రశ్నయే లేదు. శబ్దానికి ప్రయత్నానంతరస్థితే హేతువనటం తప్పుకాదు కావున మీ వాదం సరియైంది కాదు.

14. సంశయ-సామాన్యము, దృష్టాంతము అను రెండూ ఇంద్రియాలచేత సమానంగానే గ్రహింపబడతాయి. అట్టి ఇంద్రియకత్వం రెండింటికి సమానమే కనుక నిత్యమైన సామాన్యానికే అనిత్యమయిన దృష్టాంతానికీ సమానధర్మం కల్గటమే సంశయమవుతుంది.

సామాన్యము అనగా ఏమిటో ఇప్పుడు చెప్పుకుందాం : శబ్దము కుండతో పోల్చబడింది. కుండ దృష్టాంతమయితే శబ్దము సామాన్యమవు

తుంది. ఈ విధంగా శబ్దమూ, కుండ రెండూ సమానంగానే ఇంద్రియాలచే గ్రహింప బడుతున్నాయి. అవి ఆత్మలో నిత్యమై ఉన్నాయి. బైట అని త్యమై ఉన్నాయి. కావున అవి నిత్యమా ? అనిత్యమా ? అనే సందేహం కలుగుతున్నది.

ఉత్తరపక్షం : రెండువస్తువులకు సమానధర్మాలున్నంత మాత్రాన సంశయం కలగదు. వాటిల్లో విశేషధర్మాలుండాలి. అవి కనపడకపోయి నప్పుడే సామాన్యధర్మాలనుబట్టి ఆ రెండు వస్తువులు ఒకటేనన్న అభి ప్రాయం కలుగుతుంది. అది సంశయంకాదు. ఆ రెండింటిలో వైధర్మ్యాలు స్పష్టంగా కనిపిస్తున్నప్పుడు సంశయం కలిగితే అది మహా సంశయ మవు తుంది. అంతమాత్రాన ఆ వస్తువులకు సాధర్మ్యం అంగీకరింపబడరాదన్న నిషేధం లేదు

శబ్దంవేరు : కుండవేరు. కుండకు ఆకారం ఉంది. శబ్దానికి ఆకారం లేదు. కుండలో నీళ్ళుపోసుకోవచ్చు. శబ్దంలో నీళ్ళుపోయలేము. శబ్దం క్షణికం: కుండ తాత్కాలికం. శబ్దం చెవి చేతనే గ్రహింపబడుతుంది; కుండ కంటిచేత గ్రహింపబడుతుంది. కుండకీ శబ్దానికీ ఇన్ని వైధర్మ్యా లున్నాయి.

అయినా ఈ రెండూ ఇంద్రియగ్రాహ్యాలే. అదొక సాధర్మ్యం. ఈ రెండూ కృతకాలే. (చేస్తేగాని తయారయ్యేవికావు. కుండను చేస్తాం; శబ్దం చేస్తాంకదా !) ఇదొక సాధర్మ్యం.

శబ్దానికి దృష్టాంతంగా కుండను తీసుకోవటానికి కారణం ఈరెండు సాధర్మ్యాలే వైధర్మ్యాలు ఎన్ని ఉన్నప్పటికీ ఈ రెండింటికీ సాధర్మ్యం ఉన్నంతవరకూ పోలిక చెప్పటం తప్పుకాదు.

బైట ఉన్న కుండయే కొంతసేపయినా ఉంటుంది ఇంద్రియాల

ద్వారా ఆత్మలో ప్రవేశించినకుండ జ్ఞాపకం వచ్చినప్పుడే ఉంటుంది. కనుక అప్పుడుకూడా కుండ అనిత్యమే.

15. ప్రకరణం-వాది ఒకటంటే ప్రతివాది ఒకటంటాడు. వాది ఒక సాధర్మ్యాన్ని తీసుకుంటే ప్రతివాది రెండవ సాధర్మ్యాన్ని తీసుకుంటాడు.

వాది : ప్రయత్నంచేసిన తరువాతగాని లభ్యం కానందున శబ్దం అనిత్యం.

ప్రతివాది : చెవిచే గ్రహింపబడుతున్నందున శబ్దం నిత్యమే.

వాది : వినబడుతున్నంత వరకూ శబ్దం నిత్యమే.

ప్రతివాది : శబ్దం నిత్యంకాదు. ప్రయత్నపూర్వకమై ఉన్నందున.

ఉత్తరపక్షం : పైకి ఎడ్డమంటే తెడ్డమని అంటున్నట్లు కనిపించినా వాది అభిప్రాయాలతో ప్రతివాది ఏకీభవించటం జరుగుతోంది. కనుక ఈ రకం ప్రతివాదంలో వసలేదు.

16. అ హేతువు-వాది ప్రతిపాదించిన హేతువును అహేతువుగా నిరూపించి వాదాన్ని త్రోసిపుచ్చటం.

"ప్రయత్నం తర్వాత లభిస్తుందిగనుక శబ్దం అనిత్యమని మీరన్నారు ప్రయత్నానికి ముందు శబ్దం లేదుగదా! ప్రయత్నసమయంలో, ప్రయత్నం పూర్తి కానంతవరకూ శబ్దంలేదు. దీనినిబట్టి శబ్దానికి భూత వర్తమాన, భవిష్యత్కాలాలు లేవని తెలుస్తోంది. శబ్దమే అనుమాన మయినప్పుడు అనిత్యత్వం గురించి ఆలోచించటం సహేతుకంగా లేదు."

ఉత్తరపక్షం : ప్రయత్నంవల్ల శబ్దం సిద్ధిస్తుంది గనుక శబ్దానికి ప్రయత్నమే ముందు ఉండాలి. ఇది ప్రత్యక్షం ప్రయత్న సమయంలో

శబ్దం పుట్టకపోయినా ప్రయత్నం ఉన్నదికదా ? కనుక చెప్పదంటూ ప్రశ్నలు వేయకూడదు.

సాధ్యానికిముందే హేతువు వుంటుంది. సాధ్యంసిద్ధించే సమయం లోనూ వుంటుంది అనంతరం పరిపూర్ణ సిద్ధి లభించేదాకా వుంటుంది. కనుక హేతువు సాధ్యానికి పూర్వంలోనూ. పరంలోనూ సాధనసమయం లోనూ ఉంటుందని గ్రహించండి.

కాకపోతే మీరు చెప్పిన హేతువు పూర్వ. పర. సమకాలాలలో కాక ఎప్పుడు సిద్ధించిందో చెప్పగలరా ?

17. అర్థాపత్తి - 'ఆ అబ్బాయి పగలు అన్నం తినడండి. చాలా బలంగా ఉన్నాడు' అనటంలో రాత్రిమాత్రమే అన్నంతింటాడని అర్థం. ఇది అర్థాపత్తి.

ప్రయత్నజన్యమైన శబ్దం, ప్రయత్నజన్యమైన కుండవలె అనిత్య మనిగదా వాది అభిప్రాయం ?

అప్రయత్నజన్యమైన ఆకాశం (శబ్దం) నిత్యమేనని ప్రతివాది అంటాడు. అది అర్థాపత్తి.

ఉత్తరపక్షం ? వాది చెప్పిన "శబ్దం అనిత్య" మనే సామాన్యా నికి (Statement) అర్థాపత్తి కల్పించి ప్రతివాది 'శబ్దం నిత్య' మనటం పంతపించింది. వాదానికి ప్రతివాది కల్పించింది అర్థాపత్తి అయితే ప్రతి వాది చెప్పిన 'శబ్దం నిత్య' మనే సామాన్యానికి వాదిచెప్పిన 'శబ్దం అనిత్య' మనే సామాన్యం కూడా అర్థాపత్తి అవుతుంది కదా ?

కనుక అర్థాపత్తి ఆత్మహత్యాసదృశం.

18. అవిశేషం - పక్షము, దృష్టాంతములలో ఒకే ధర్మం కని పిస్తోంది. అందువల్లనే ఆ రెండింటికీ సద్భావం కలుగుతున్నది కనుక ఆ రెండూ సమానమే అవుతున్నవి. అందులో విశేషం ఏముంది ?'

ప్రతిపక్షం : కొన్ని ధర్మాలు సమానంగా ఉన్నప్పుడు, కొన్ని ధర్మాలు సమానంగా లేనప్పుడు మీ వాదం సిద్ధించదు.

19. ఉపపత్తి సమం - శబ్దం అనిత్యం; కుండవలె; ప్రయత్న జన్యమవటంచేత.

శబ్దం నిత్యం; ఆకాశంవలె; అస్పర్శకమగుటచేత.

పై విధంగా రెండు ఉపపత్తులు (Derivations )కలుగుతుంటాయి. ఆ రెండు ఉపపత్తులూ సమానమేనని సరిపెట్టుకోవచ్చు. అప్పుడు శబ్దం నిత్యానిత్యమవుతుంది.

ఉత్తరపక్షం : ఉభయ పక్షాలను అంగీకరించినవాడు వాది పక్షాన్ని ఖండించటం లేదుగనక, అంగీకరించినట్లే అవుతుంది. ఆ తర్వాత ప్రతి వాదిని అంగీకరించినట్లూ అవుతుంది. పరస్పర వ్యాఘాతాలయిన ఈ రెండు వాదాలను అంగీకరించి తప్పుకునేవాడు ఆత్మ వ్యాఘాతానికి లోనవు తాడు. వాడికి బుద్ధిలేదు.

20 ఉపలబ్ధి - శబ్దం ప్రయత్న పూర్వకమే కానక్కర్లేదు గట్టిగా గాలి వీచినప్పుడు ఏ ప్రయత్నమూ లేకుండానే చెట్టుకొమ్మ ఫెళఫెళమని చప్పుడుచేస్తూ విరిగి నేలపడింది. కనుక వాది చెప్పినదే కారణం కానక్కర్లేదు.

ఉత్తరపక్షం : అందులో గాలియొక్క ప్రయత్నం ఉన్నది. కాబట్టి దోషం లేదు.

21. అనుపలబ్ధి – 'శబ్దం పుట్టక పూర్వం శబ్దం లేదనటానికి వీల్లేదు. అది పుట్టకుండా ఏదో నిరోధిస్తుందన్నమాట? అలాగే శబ్దం పుట్టిన తరువాత అది వ్యాప్తం కాకుండా ఇంకేదో నిరోధిస్తూ ఉండాలి. అంతకుముందు లేనిదేదీ పుట్టదు. పుట్టినది ఏ అవరోధమూ లేకుండా మరుగున పడదు. ఆయా అవరోధాలను తొలగించటమే ప్రయత్నం. ప్రయత్న ఫలితంగా శబ్దం నిత్యమవుతున్నది. శబ్దం పూర్వాపరాలం దుండికూడా లభించకపోవటం అనుపలబ్ధత్వమేగాని అనిత్యతకాదు.

ఉత్తరపక్షం : శబ్దం ఉపలబ్దం. అది లభించనప్పుడు అనుపలబ్ధ మవుతున్నది. దాని అనుపలబ్ధస్థితికి మీరు కారణాన్ని చెప్పారేగాని, దానిని సాధించలేదు. మీరు చెప్పింది వస్తువుయొక్క వాతావరణమే. వాతావరణం సిద్ధించినంత మాత్రాన వస్తువు సిద్ధించదు

పుట్టకపూర్వం శబ్దానికి ప్రతిబంధకమున్నదనీ, పుట్టిన తరువాత ప్రతిబంధకమేర్పడి నశిస్తుందనీ మీరు చెప్పారు. అదే నిజమయితే ఆ ప్రతిబంధకాలను ప్రత్యక్షంగా మీరు ఎత్తి చూపించాలి. అలా చూపించ లేదు అనుత్పాదకస్థితి, మరణమూ శబ్దానికున్నాయి. అందుకే అది అనిత్యం. దానికి మరో ప్రతిబంధకమేదీ లేదు.

మనస్సు ఆత్మతో కలిసి (ఆధ్యాత్మ)జ్ఞానాన్ని వికల్పం ( Analysis ) చేస్తుంది. అందువల్లనే ఏది వస్తువో, ఏదికాదో దానికి తెలుస్తుంది.

22. అనిత్యం- 'కుండ' శబ్దం- ఈ రెండూ ఒక్కలాంటివి. చేస్తేనే తయారవుతాయి. ఆ రెండిటలోనూ సమాన ధర్మాలున్నాయి. ఏదైనా అనిత్యమే కదా! కాబట్టి అవికూడా అనిత్యమనుకోవచ్చు "

ఉత్తరపక్షం: శబ్దమనిత్యమని వాది అంటున్నాడు. సర్వమూ అనిత్యమేనని మీరంటున్నారు. తెలియని శబ్ద అనిత్యత్వానికి తెలిపిన

కుండయొక్క అనిత్యత్వాన్నే దృష్టాంతంగా చెప్పాడు. సర్వమని చెప్ప లేదు. పైగా ప్రయత్నజన్యమగుట అని హేతువు చెప్పాడు. ప్రయత్న జన్యం కానివి అనిత్యమని అనలేదు

ఒకధర్మం- సమానం కానివ్వండి; విశేషం కానివ్వండి- సాధ్యాన్ని విడిచిపెట్టి ఉండదు ప్రయత్నకృతమనే సమాన ధర్మం రెండింటా ఉన్నది. అనిత్యత్వమే సాధింపవలసిన ధర్మం. ఆరెండింటికీ అవినాభావ సంబంధాన్ని అతను ప్రతిపాదించాడు. మీరేమో సర్వమూ అనిత్యమని వేదాంతం చెపుతున్నారు ఇక మీరు సాధించేదేముంది?

23. నిత్యం - 'అనిత్యమైన వస్తువుల్లో ఆ వస్తువు ఉన్నంత కాలమూ అనిత్యత్వం ఉంటుంది. అయినా నిత్యత్వం ఆ వస్తువులు ఉన్నంతకాలమూ ఉంటూనే ఉంది. అవి పుట్టకపూర్వం, గిట్టిన తర్వాత అనిత్యత్వం ఎలాగూ ఉంది. కనుక నిత్యత్వాన్ని ఎందుకు విశేషధర్మం గా భావించకూడదు?

ఉత్తరపక్షం: నిత్యమైన వస్తువులో అనిత్యత్వం సర్వకాల సర్వా వస్థలయందూ ఉండటం వల్ల, అనిత్యములందు అనిత్యత్వమే సిద్ధించటం వల్లనూ నిత్యత్వం లేదు.

24. కార్యం- ఉన్నదానిని బయట పెట్టటానికే ప్రయత్నంఅని పేరు. అది కార్యమే. లేనిదాని నుంచి ఎలాగూ తేలేదు. కనుక శబ్దం పుట్టటంలేదు. శూన్యం నుంచి ఏదీ పుట్టదు. కనుక అంతర్గతంగా ఉన్న శబ్దమే మీ ప్రయత్నకార్యం వల్ల అభివ్యక్తమై ప్రయత్నం అయిపోగానే తిరిగి అంతర్గతమవుతోంది."

ఉత్తరపక్షం: భూమిలో నీరుఉంది. అది అభివ్యక్తం కాకుండా మట్టి ఆవరణాన్ని కల్పించింది. ఆ ఆవరణాన్ని తొలగిస్తే నీరు కనబడు

తుంది. ఆ ఆవరణాన్ని తొలగించటం కార్యమే. తిరిగి ఆవరణాన్ని కల్పించటం కూడా కార్యమే. అభివ్యక్తమైన నీరు తిరిగి కనబడకుండా చేయాలంటే మళ్ళీ ఆవరణం కల్పించాలి. అనగా మట్టి పొయ్యాలి. ఇది రెండవ ప్రయత్నం.

శబ్దం ఒక కార్యంవల్ల లభించినా రెండవకార్యం లేకపోయినా నశిస్తోందేమి? శబ్దం పుట్టి అభివ్యక్తమౌతోంది. పుట్టకుండాకాదు.

ముఖ్యాంశాలు: ప్రతివాది "జాతి" ని ప్రయోగించినా వాది 'జాతి' ని ప్రయోగించకూడదు. వాది శాస్త్రాన్నే అనుసరించాలి. ఉభయులూ 'జాతి' ప్రసంగాన్నే చేసినట్లయితే 'తత్త్వం' సిద్ధించదు.

ప్రతివాది చూపే హేతువుల్లోకూడా ఎన్నో దోషా లుంటాయి. అయినాసరే మీ సమాధానాలు సరిగానే ఉండాలి.

వాది చేసిన ఖండనలోనూ, ప్రతివాది చేసిన ఖండనలోనూ దోషా లుంటాయి.

వాది వాదంలోని దోషాన్ని ముందుగా ఎత్తిచూపి ఆ తర్వాత ప్రతివాది తన వాదాన్ని కొనసాగించాలి.

తనది దోషమే అని వాది అంగీకరిస్తే ఇక వాదమే లేదు.

అల్లాగే వాది వాదంలోనూ, ప్రతివాది ఖండనలోనూ దోషం ఉన్న పక్షంలో ఆ వాదం అంతటితో పరిసమాప్తం కావాలి.

# పదవ ఆహ్నికం

## నిగ్రహస్థానాలు

ప్రతిజ్ఞా హాని; ప్రతిజ్ఞాంతరం; ప్రతిజ్ఞా విరోధం, ప్రతిజ్ఞాసన్యాసం హేత్వంతరం, అర్థాంతరం. నిరర్థకం, అవిజ్ఞాతార్థం, అపార్థకం, అప్రాప్త కాలం, న్యూనం. అధికం, పునరుక్తం, (పునర్వచనం) అననుభాషణం, అవిజ్ఞానం, అప్రతిభ, విక్షేపం, మతానుజ్ఞ, పర్యనుయోజ్యోపేక్షణం, నిరనుయోజ్యానుయోగం, అపసిద్ధాంతం హేత్వాభాస అని ఇరవై రెండు నిగ్రహ స్థానాలున్నాయి. నిగ్రహస్థానమనగా వాదం విడిచిపెట్టవలసిన చోటు.

1. ప్రతిజ్ఞాహాని - శబ్దం అనిత్యం - ఇంద్రియ గ్రాహ్యమయినందున' అని వాది ప్రతిజ్ఞ (Statement) యిచ్చాడు. వెంటనే ప్రతివాది

'నిత్యమయిన ప్రతి విషయమూ యింద్రియగ్రాహ్యమే కదా!' అంటాడు.

దానికి వాది ఏం జవాబు చెపుతాడు ?

"సరే శబ్దం నిత్యమే" అని ఒప్పుకుని ఊరుకోవాలి. అంటే ప్రతిజ్ఞాభంగమయిందన్న మాట.

2. ప్రతిజ్ఞాంతరం వాది : 'కుండవలె ఇంద్రియాలచే గ్రహింపదగినది అగుటచేత శబ్దం అనిత్యం'

ప్రతివాది : గాలి ఇంద్రియగ్రాహ్యమైనా నిత్యమే కదా !

వాది : కుండ అన్నిటిలోనూ వ్యాపించదు. గాలి అన్నిటిలోనూ

వ్యాపిస్తుంది. కుండ సర్వగతం కాదుకనుక అనిత్యమయింది. శబ్దం సర్వ గతం కాదుకనుక అనిత్యమయింది. సర్వగతంకాని శబ్దం అనిత్యం"

తొలిప్రతిజ్ఞలో "సర్వగతం" అను విశేషణం లేదు. కాని ప్రతి వాదివల్ల ఆ విశేషణం చేర్చవలసివచ్చింది.

ఇది అసలుప్రతిజ్ఞను దాటిపోవటమే కనుక ప్రతిజ్ఞాంతరమయింది.

3. ప్రతిజ్ఞా విరోధం: ప్రతిజ్ఞ, హేతువు ఈ రెండింటికీ విరోధం ఉండటం

వాది: ద్రవ్యానికి గుణంలేదు దానికి రూపం ( Form ) కన్నా వేరే ఏమీలేదు

ప్రతివాది: రూపంకూడా గుణమే. కనుక మీ ప్రతిజ్ఞకీ హేతువుకీ విరోధం ఏర్పడింది

4. ప్రతిజ్ఞా సన్యాసం- వాది: శబ్దం అనిత్యం: ఆకాశధర్మం కల దగుటవలన

ప్రతివాది: ఆకాశం నిత్యమేకదా!

వాది: శబ్దం అనిత్యమని ఎవరన్నారు?

ప్రతివాది దృష్టాంతరంలో లోపాన్ని ఎత్తి చూపిస్తే కంగారుపడి వాది తన ప్రతిజ్ఞను తానే తప్పించుకొని పోవటం.

5 హేత్వంతరం - విశేషం లేకుండా చెప్పిన హేతువును ప్రతి వాది ఖండించగా, దానిదోషాన్ని పోగొట్టటం కోసం వాది విశేషాన్ని జోడించటం ఓటమికి చిహ్నమే.

వాది: ఆకాశం నీలంగా ఉంది; శూన్యమైనందున.

ప్రతివాది: నీళ్ళు నీలంగా లేవా?

వాది: నీళ్ళుకూడా లేనంతటి శూన్యమైనందున.

6. అర్థాంతరం: మొదట ఒకవిషయాన్ని చెప్పి దానిని సమర్థించ టంకోసం మరొక విషయాన్ని చెప్పటం. గుణవంతమయిన వస్తువు సం సర్గంవల్ల, నీచవస్తువుకూడా గౌరవింపబడుతుంది.

వాది; శబ్దం నిత్యం. దానికి అస్పర్శగుణం ఉంది.

ప్రతివాది: అవును. చెవిటివాడిని స్పర్శించదు.

దానితో వాది ఉక్కిరిబిక్కిరై, విషయాన్ని మార్చి, 'చెవిటి వాళ్ళు నానా రకాలుగా ఉన్నారు. బ్రహ్మచెముడు కొందరికి, కొందరికి మూగ, చెవుడు కలిపి ఉంటుంది. కొందరికి చెవుడు వంశపారంపర్యంగా వస్తుంది. కొందరు చెవిలో నూనె పోసుకోక ...." ఊకదంపుడు ఉప న్యాసం చెప్తాడు. ఇదీ అప్రాప్తకాల ప్రసంగం.

7. నిరర్థకం- వాది: రసం ఉన్నదే! దాని తస్సాదియ్యా! అది రసమే. అందుకే 'ఋషులు రసోవైసః' అన్నారు. (నోటిలో లాలాజలాన్ని ఎగపీల్చి) అదే రసమంటే. చెరుకు రసమమకో! మధురం (Sweet): ఆమ్లం ( Sour ) : లవణం ( Salt ) : కటుకం ( Pungent ): తిక్తం ( Bitter) కషాయం ( Astringent ) ఆరు రసాలు. ఆరేమిటి ఖర్మ! అరవై మూడుదాకా ఉన్నాయి. మనవాళ్ళు చెప్పారు శృంగారం, వీరం, భీభత్సం రౌద్రం, హాస్యం భయానకం, కరుణ, అద్భుతం, శాంతం అని కొందరు రసాలు తొమ్మిదన్నారు. బహుశా కారం (కటుకం) తింటే రౌద్రం వస్తుందేమో!"

ఈరకమైన అసంతర్ప ప్రలాపనని విరర్ధకమ్ అంటారు.

8. అవిజ్ఞాతార్ధం- వాది: శ్లక్షుడు ఏమైనా అసగలడు. మీకే చెప్తున్నాను. అర్ధమయ్యిందా? శ్లక్షుడు. శ్లక్షుడండీ.

ఈ వి ధ ం గా లోకవ్యవహారంలో లే ని మూలమూలపదాలను తెచ్చి ప్రతివాదిని భయపెట్టి అపాటి శబ్దానికి అర్థంకూడా రాని అజ్ఞానిగా అతన్ని లోకానికి చూపడంకోసం ముమ్మారు రెట్టిస్తాడు వాది. ఈ విధంగా క్లిష్టపదాలను పలకడమే కాకుండా క్లిష్ట సమాసాలను మహావేగంతో ఉచ్ఛరిస్తారు. లొకలొకమని వాగెయ్యటంతో అదేదో అర్ధంగాక ప్రతివాది తెల్లబోతాడు. అదే అతనికి ఓటమిగా వాది తీసుకొని దర్పంతో సభావలోకనం చేస్తాడు.

9. అపార్థకం-పూర్వాపరాలు లేకుండా పరస్పర సంబంధం లేని పదాల ప్రయోగం అపార్ధకం. అది అర్థంలేనిది.

వాది : "ఆకాశంమీంచి దారాలు వేలాడదీసి మనసులో విచ్చెనలేసి బుద్ధిని పీక్కుతినాలి."

10. అప్రాప్తకాలం-వాక్యం యొక్క అవయవాలను అవక్రమం సమయోచితంకాని ప్రసంగం పువ్వులలోదూరిన నారకూడా శిరస్సుపై ధరింపబడుతోందికదా అంటాడు వాది.

గుణవంతమయిన పాలతోకలిసి నీళ్ళు మరిగిపోవటం లేదా ? అని విస్తుంది ప్రతివాదికి.

11. న్యూనం-ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణం, ఉపనయనం, నిగమనం అనేవి అనుమాన వాక్యానికి ప్రమాణాలు. వాటినన్నింటిని

క్రమం తప్పకుండా ప్రయోగించాలి. వాటిల్లో ఏ ఒక్కదానిని ప్రయోగించటం మరచిపోయినా అది న్యూనం అవుతుంది.

ఉదా :- కొండమండిపోతోంది వంటిల్లులాగ.

కొండ మండిపోతున్నది ప్రతిజ్ఞ. ఆ వెంటనే వంటిల్లు ఉదాహరణగా చెప్పబడింది. ఇందులో హేతువు లోపించింది.

కొండ మండిపోతోంది పొగవచ్చుటవల్ల అను హేతువు చూపందే ఉదాహరణం చెప్పకూడదు.

12 అధికం - హేతువుగాని ఉదాహరణగాని మితిమించి చెప్పకూడదు. అలా చెప్పటం అధికం.

ఉదా :- కొండ మండిపోతోంది భుగభుగమని. కొండమీద కన్నూ మిన్నూ కననివ్వనంత పొగవుంది. కొండమీద కొండంత నిప్పుంది.

13. పునరుక్తం-చెప్పడం.

ఉదా :- శబ్దం అనిత్యం శబ్దం నిత్యంకాదు. శబ్దం అశాశ్వతం. ధ్వని అస్థిరం.

ఏమిటిది ? అంతా ఒక్కటే.

14. అననుభాషణం — వాది ఏం చెప్పుతున్నాడో సభాసదులందరికీ అర్థమవుతుంది. కాని ప్రతివాదికి అర్థంకాదు. వాది ఒకటంటే ప్రతివాది మరేదో అంటాడు. దీన్నే అననుభాషణం అంటారు.

15. ప్రతివాదికి నోటమాటరాని పరిస్థితి, మనస్సు పనిచేయదు. వెర్రిమొహం వేయటం జరిగితే అది అవిజ్ఞానం?

16. తగిన జవాబు స్ఫురించకపోవటం అప్రతిభ

17. మాట్లాడుతూ మాట్లాడుతూ ఆకస్మాత్తుగా ఏదో పనుందని చెప్పి వెళ్ళిపోవటం విక్షేపం.

18. ముందుగా వాది పక్షంలో దోషాన్ని ప్రతివాది చూపగా వాది అంగీకరించి, ప్రతివాది పక్షంలోకూడా దోషం ఉందని ఆరోపించడం మతానుజ్ఞ.

10. పర్యనుయోజ్యోపేక్షణము : అనుయోజ్యమనగా ప్రశ్నింపదగినది. పర్యనుయోజ్యమనగా మిక్కిలి ప్రశ్నింపదగినది; దానిని విడిచి పెట్టటమే ఉపేక్షణం. వాది చెప్పిన దానిలో దోషం కనిపించినా పట్టించుకోకపోవటం.

20. నిరనుయోజ్యానుయోగం : దోషంలేని విషయాన్ని ఎదోదోషం ఉన్నట్లు పట్టుకుసాగదీయడం.

21. ఒక సిద్ధాంతాన్ని ఖండించటంకోసం తప్పుసిద్ధాంతాన్ని ప్రతిపాదించటం.

అపసిద్ధాంతం :-

22. హేత్వాభాస: హేతువులా కనిపిస్తుందేగాని నిజమైన హేతువు కానిది.

— సమాప్తం —